# శ్రీ దక్షిణామూర్తి దర్శనమ్

(భారతీయ సంస్కృతి దర్శనమ్ - సనాతన సిద్ధాంతమ్)



అమృతలూరి వీర బ్రహ్మేంద్రరావు (బ్రహ్మాజీ)

ప్రకాశకులు :

**అమృత ప్రచురణలు**

అమృతలూరి వీరబ్రహ్మేంద్రరావు

"భానుతేజం" డోర్ నెం. 3-1-93/1ఎ,

8వ లైను, కృష్ణనగర్, గుంటూరు - 522 006.

**శ్రీ దక్షిణామూర్తి దర్శనమ్**

**అమృత కుసుమాలు - 2.**


ప్రధమ ముద్రణ : 1999 అక్టోబరు





ప్రకాశకుడు : అమృతలూరి సురేంద్రవర్మ





ప్రాప్తి స్థానము :

**అమృతలూరి వీరబ్రహ్మేంద్రరావు**

"భానుతేజం" డోర్ నెం. 3-1-93/1ఎ

8వ లైను, కృష్ణనగర్, గుంటూరు - 522 006.

మూల్య వినియోగము :

**అనాధ బాలుర ఆశ్రమాభివృద్ధికొరకు**

**"దయా హృదయ సేవాసంస్థ"** (Regd. 328/92)

అమరావతిరోడ్డు - గుంటూరు-522 007.

ముఖ చిత్రం : దేవీ ప్రసాద్

**మూల్యము : రూ. 75-00**

కంప్యూటర్ టైప్ సెట్టింగ్ : పవన్ గ్రాఫిక్స్, నెహ్రూనగర్, గుంటూరు - 1.

ముద్రణ : శ్రీ లక్ష్మీప్రెస్, అరండల్‌పేట, గుంటూరు.

# "అమృత కుసుమాంకితము"

బ్రహ్మా నందం పరమ సుఖదం
కేవలం జ్ఞాన మూర్తిం
ద్వంద్వా తీతం గగన సదృశం
తత్వ మశ్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం
సర్వాధి సాక్షి భూతం
భావాతీతం త్రిగుణ రహితం
సద్గురు తం నమామి
గురు మధ్యే స్థితం విశ్వం
విశ్వమధ్యే స్థితో గురుః
గురు ర్విశ్వం నచాన్యో శ్మి
తస్మై శ్రీ గురవేనమః

గురవే సర్వలోకానాం భిషజే భవరోగినామ్ ॥
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః

శ్రీసనాతన బ్రహ్మర్షి గోత్ర మత్ పూర్వాజులు
పూజ్య జననీ జనకులకు భక్తితో నమస్కరించి

బ్రహ్మాజీ

# "BHĀRAT"

*- Brahmaji*

There's a land I know where the winds do softly blow;
And skies are kind and the fields are green;
There's a land I know where the rivers swiftly flow;
And the heart is ravished by ganges falling,
From the fountains of paradise is heard there.

Replete with song and story is this land;
Battle - scarred and legend - studded she;
Once peer of ancient Madhura and Nalanda,
Ujjayini and Kanchi and all lands free.

I love her hills, I love her winding streams,
I love her glades and grass and fern;
My kin are there; and from afar my dreams,
Are of her glory once again.

That land is Bharat, fairest peninsula of all;
Whose hills the clouds do hung and kiss;
That land is Bharat at whose sacred call,
Our hearts do stir with pride and bliss.
There's a land I know where the winds do softly blow;
..... ..... ..... ..... ..... ..... .....
..... ..... ..... ..... ..... ..... .....

"........... If I were to look over the whole world to find out the country most richly endowed with all the wealths, power and beauty that nature can bestow- in some parts a very paradise on earth - I should point to India. If I were asked under what sky the human mind has most fully developed some of the choicest gifts, has most deeply pondered on the greatest problems of life, and has found solutions of some of them which well served the attention even of those who have studied Plato and Kant - I should point INDIA".

*F. MAX MULLER*

"India must have been one of the earliest centres of human civilisation".

*H.R. HALL*

# అంతర్దర్శనము

'శ్రీ దక్షిణామూర్తి దర్శనమ్' పేర్న ప్రచురించిన ఈ గ్రంథమునకు ప్రథమముగా మా మనో క్షేత్రమున కృషి సల్పినవాడు శ్రీమాన్ సూరియన్ కాశీ పాండ్యన్ I.A.S. వారి "THE HIDDEN HERITAGE" అను అనువాద వాఙ్మయ చరిత్ర నాధారంగ అనేక దేశీయ, విదేశీయులు వ్రాసిన పరిశోధనా గ్రంథముల నాధారంగా యోగ దక్షిణామూర్తి చారిత్రికాంశాలను పరిశీలించట మైనది. మాకు పితృసమానులు, శైవారాధ్యులు యాగకర్త శివశ్రీ ధూపగుంట్ల విశ్వేశ్వర రావుగారు- ఒక శుభ సమయమున - త్రిగుణాత్ముడు, పరబ్రహ్మ స్వరూపుడు నయిన ఆ మహాదేవుని బహురూప ధ్యానాదుల మాత్రుకలను సేకరించి ప్రచురించ వలసినదిగా ఆదేశించిరి. అది మా మనోక్షేత్రమున విశ్వతేజమై నాటినది. అట్లు కాశీ, విశ్వేశ్వరుల ప్రజ్ఞ, శక్తులే శివ-అంబలుగా సారూప్యత చెందిన క్షేత్రగతమైన బ్రహ్మ బీజము పక్వమై అంకురించి, శాఖోపశాఖలై శ్రవణ, మనన, ధ్యానాదుల ద్వారా - ఆత్మావగతమై

**"మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్వం యువానం**
**వర్షి ష్ఠాంతే వసదృషి, గణైరావృతం బ్రహ్మనిష్ఠైః ॥**
**ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం**
**స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే ॥**

రూపమున సాక్షాత్కరించినది.

అపారమైన భారతీయ సంస్కృతి - దర్శనమ్, పరిశోధనాంశాలను వివరంగా చర్చించే ప్రయత్నం చేయక, పాఠకుని మనసు నిల్పుటకు వీలుగా క్లుప్తముగా విశదపరచి యుంటిమి.

శ్రీ కాశీ పాండ్యన్‌గారి ' మరుగనపడ్డ వారసత్వం' పరిశోధనా సాహిత్యం సాహసంతో చేపట్టిన ప్రక్రియ అని విఖ్యాత తత్వశాస్త్రవేత్త, విశ్వవిద్యాలయాల గ్రాంట్ల సంఘం ఉపాధ్యక్షులయిన శ్రీ ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారన్నట్లు 'సత్యం' అధిక సంఖ్యాకుల గుత్తాధిపత్యం కానక్కరలేదు. ప్రపంచ చరిత్రలో ఇప్పటివరకు అల్ప సంఖ్యాకులు నూతన సత్యాలను ఆవిష్కరిస్తున్న విషయం విదితమే గదా ! ఒక విషయం 'సత్యం' కావటానికి, వాస్తవం కావటానికి ఒక రచయిత అభివ్యక్తం చేసిన జ్ఞానాన్ని అందరూ అంగీకరించవలసిన అవసరం లేదు. అది ఎప్పుడూ జరుగదు కూడా.

చరిత్ర ఎంత పురాతనమైతే ఊహలు, అనుమానాలు కూడా అంతే అధిక సంఖ్యలో వుంటవి. హిందూమతంపైన ఈ పరిశోధనల ప్రభావం ఎంతో ఉంది. హిందూ

మతం యుగయుగాలనుండి పరిశుద్ధమైన దానినుంచి దూరంగా జరిగినట్లు తెలుస్తుంది. ఇందు సామాజిక, జీవ పరిణాత్మక, మతోద్దేశపూర్వక, సాంఘిక, రాజకీయంగా అనేక పరివర్తనలు చెంది నేడు మనం చూస్తున్న హిందూమతం క్షీరం నిండా నీరే వుంది.

'సిద్ధాంతం' ఈ ప్రపంచం నుంచి అంతరంగ స్వేచ్ఛను, ద్వేషరహిత మనస్సును కోరుతుంది. అదే ఆచరించదగిన మార్గదర్శకమంటుంది". శరీరంలోని అంతరంగ జీవప్రవమైన ప్రేమలేనపుడు బాహ్యావయవాలు మొత్తం ఏకమై ఏమి సహాయం చేయలేవు. శివుడే ప్రేమగా గుర్తించమని సనాతన హైందవం చెప్తుంది. ప్రతి జీవియందు దేవత్వము గర్భితముగా నున్నది. బాహ్య ప్రకృతి నంతయూ నిరోధించి, యంతర్గతమగు నీ దేవత్వమును వ్యక్తపరచుకొనుటే పరమావధి. ఇందుకై కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గాలలో ఒకటిగానీ కొన్నింటినిగానీ అనుసరించిన ముక్తుడు కాగలడు. ఇది ఎల్ల మతముల సారముగా గుర్తించగలరు. తాత్కాలికముగా నిద్రాణమైయున్న భారత జాతీయ సంస్కృతిని మేల్కొల్పుటకు వివేక సూర్యోదయము కావలసి యున్నది.

ప్రకృతి నతిక్రమింప యత్నించకున్నంత వరకే మానవుడు, మానవుడనిపించుకొన నర్హుడు. ఈ ప్రకృతి బాహ్యమని , అంతరమని యుండును. ప్రతి నరునకు సహజమునూ, జన్మ స్వాస్థ్యమునగు అనంత శక్తిని ప్రత్యక్షము గావించుకొనుటకై ప్రేరేపించు మహాశక్తియే మతము. శీల నిర్మాణము నందునూ, శాంతిని కలిగి యుండుటకును మూలాధారమైనదే మతమని భావించనగు. సంకుచితము, పరిమితము, కలహ కారణమునగు మతభావము లంతరించి అన్ని మతాచార సాంప్రదాయముల నడుమ మైత్రి పెంచుకోవలసి యున్నది.". అవ్యక్తమునూ, అనంతమున్నై యుండు॥. ఏకమేవా ద్వితీయ" మగు ప్రజ్ఞానమును కలసి అందైక్యము పొందవలసి యున్నది.

సమగ్ర భారతీయ దర్శనం జాజ్వల్యమానమైనదిగా నాకు ప్రత్యక్షమైనది. ఉత్తేజకర, భయానకమైన మహోదర్శనంగా భావించాను. భారతం కేవల భౌగోళిక రూపంకాదవి, దాని భౌతికాకృతి వెనుక మహోన్నత నాగరికత, చక్కని జీవన సరళి, ఉజ్వలచైతన్యం, ఒకవైభవోపేతమైన సంస్కృతి ఉన్నాయని, విజ్ఞానానికి, ఆరాధనకు ఆత్మ అంతర్గత దీప్తికి నిలయాలని గ్రహించాను. అవే నన్నీ గ్రంథరచనకు పురి కొల్పినాయి. ఇది నా స్థాయికి మించిన కార్యభారము.

'దర్శనమ్' (VISION) అనేది మామూలు 'వీక్షణం' కంటే లేదా 'ఫోటో స్నాప్' కంటే ఎలా భిన్నమైనది ? ఇంతకాలం మనం అనేక వస్తువులను చూస్తూనే ఉన్నాం. కానీ దర్శించటం లేదు. దేశకాలాలు, స్థితిగతులు, వ్యక్తి స్వభావం, వీక్షణానికి పరిమితులు విధిస్తాయి. 'వీక్షణం' ఎప్పుడూ స్థిరం - త్రిమాత్రం - సమతలం లేదా ఘనంగా

వుంటుంది. సీమన్ వాట్సన్ టేలర్, W.M. ధియోడోరడీ, బేరి., జె. టాల్ బాయిస్ వీలర్., R.C. మజుందార్., Dr. C. రామస్వామి అయ్యర్., P.R.S. రాధాకృష్ణన్., Dr. D.D. కౌశాంబి., రాహుల్ సాంకృత్యాయన్‌లేకాక ఎందరో మరెందరో భారతదేశాన్ని దాని సంస్కృతి ప్రాభవాలను తమ తమ అవధులమేర దర్శించారు. దాని ఔన్నత్యాన్ని ఎంతో విపులంగా విశ్లేషించారు.

'దర్శనమ్'లో భూత భవిష్య ద్వర్తమానాల పరిగ్రహణం ఉంటుంది. ఆది భౌతిక, ప్రాణిక, మానసిక, ఆధ్యాత్మిక స్థాయి లన్నింటిలోని అనుభవాలను సమైక్యం చేస్తుంది. దానికి తనదైన స్వీయ అంతర్గత శక్తి వుంది. కార్యకారణ గతి, పరివర్తన, పరిణామ సూత్రాలున్నాయి. "ఈథర్" క్షేత్రాధారంలో ప్రచలించే తరంగ కణాలవలె, దర్శనంలోకూడా స్థిర, ప్రగమన, ఆదిభౌతిక మూలకాలన్నీ, భవ, భవాల ఆవిష్కారాద్భుతాలలో సంగమిస్తాయి. అంతిమంగా చెప్పాలంటే 'దర్శనమ్' దైవప్రసాదం. అది కొంగ్రొత్త వెలుగులను ఎల్లప్పుడూ వెదజల్లుతుంది. నిర్దిష్ఠ కార్యాచరణకు అది ఒక అనుజ్ఞవంటిది. భారతదేశ చరిత్ర, సంస్కృతికి సంబంధించిన గ్రంథములనేకం ఆంగ్లంలో రచింపబడినవి. తెలుగునందు బహుస్వల్పం. నేను సాహసంతో చేపట్టిన ఈ గ్రంథరచన సమగ్రమని భావించటం లేదు. బహు విద్యావేత్తలు, వేదవిదులు, పరిశోధకులు, చారిత్రికులు ఈ గ్రంథమందలి దోషములను మన్నించి తెల్పిన సవరించుకోగలనని సవినయముగా మనవి చేయుచున్నాను.

- బ్రహ్మాజీ

**Dr. D.N. PARAMA SIVAM,** M.A., M.Phil.,
Professor Philosophy
H.No. 18-3-54/B,
Anna Nagar Ext. COIMBATTOOR.

# సమీక్ష

శ్రీ అమృతలూరి వీరబ్రహ్మేంద్రరావు (బ్రహ్మాజీ) గారి రచన శ్రీ దక్షిణామూర్తి దర్శనమ్ రెండు భాగాల గ్రంథము. దర్శనం ఒక విషయాన్ని భిన్న కోణాలనుంచి విస్తృత పరిశీలన జరుపునదే సమగ్ర దర్శనమ్‌గా భావించాలి. అనగా శ్రీ దక్షిణామూర్తి విశిష్టతను సమగ్రంగా దర్శించినది అని తెలియుచున్నది.

రచయితతో నాకుగల పూర్వ పరిచయము బహుస్వల్పము. మా ఇరువురకు అనుసంధానం కూర్చినవారు డా॥ నన్నపనేని నరశింహారావు, సైంటిస్ట్, తెనాలి. వారు మాకుభయులకు మిత్రులు, శ్రేయోభిలాషులు. శ్రీ బ్రహ్మాజీగారు తమ ప్రధమ రచన "శ్రీ మంగళాద్రి కథానికలు" ద్వితీయ రచన "శ్రీ దక్షిణామూర్తి దర్శనమ్" వ్రాతప్రతిని తాను రూపొందించిన దారుశిల్ప చిత్రములు పంపుచూ మీరు మాకు చాలా సన్నిహితులని అందుచే చొరవతో ఈ కార్యభారమును మీకందించు చున్నానని మన ఇరువురి మధ్య శ్రీ నరశింహుడు అనుసంధానకుడని వ్రాసియున్నారు. ఆ లేఖ నాకుకొంత ఉత్సుకత కల్పించినది.

మీ కథానికలు చదివిన పిమ్మట మీరు వ్రాసినది యదార్థమని గ్రహించాను. డా॥ నరసింహారావుగారు మనకిరువురకు ప్రత్యక్షమిత్రులు. శ్రీ మంగళాధీసుడైన శ్రీ నారసింహుడు పరముగా మిత్రులు, వరదులని గ్రహించి నా అభిప్రాయమును వారి ఆదేశముగా భావించి వ్రాయ సంకల్పించినాను.

మన పరిచయకాలమున మీరు హైబ్రిడ్ ప్రత్తి విత్తనోత్పత్తి రంగములో నుండి వ్యాపారము చేయుచున్నారు. గ్రంథ రచనారంగమున కెట్లు ప్రవేసించినారు. మరియు శిల్ప ప్రామాణికముగా మీరు రూపొందించిన దారుశిల్ప చిత్రములు నన్నెంతో ఆశ్చర్య పరచినవి. ఇవి అన్నియూ నిరంతర పరిశ్రమకు ఏరంగమూ కష్టతరము కాదని తెలియుచున్నది. చిత్తూరు జిల్లా 'నగరి'లో మా చిన్నతనములో దారుశిల్పములు తయారుచేయు కుటుంబములు రెండుకలవు వారితో మాకు సన్నిహిత సంబంధము లుండేవి. మీ చిత్రములు మాకు పూర్వ జ్ఞాపకములు కల్పించినవి.

శ్రీ దక్షిణామూర్తి దర్శనమ్ ఒక విశిష్టమైన గ్రంథం. ఇందు భారతీయ సంస్కృతి, పురాతన చరిత్ర నాగరికత, మత విశ్వాసాలు, జలప్రళయాలు, భూగర్భ శాస్త్ర పరిశీలనాంశాలు ఎన్నో చోటుచేసికొని ఉన్నాయి. "సిద్ధాంతం" బహుపురాతన మైనదని, విశ్వజనీయమైనదిగా అది ప్రవచించిన శ్రీ దక్షిణామూర్తి ఆదిమ హైందవ నాగరికతలో

సర్వదా వెలసిన గురుడని, రచయిత వేదపూర్వ కాలం, వేదకాలం, వేదోత్తర కాలంలోని అనేక ప్రతిపాదనలతో సర్వసమ్మతమైన 'సిద్ధాంతం'ను వెలుగునకు తీసికొచ్చిన విధం చాలా విలక్షణమైనది. తార్కికమైనది. ఇందుకు రచయిత తాను పరిశీలించిన గ్రంథములను, గ్రహించిన వివరములను తెలియపరచినాడు.

ప్రథమ భాగంలో భారతీయ సంస్కృతి దర్శనమ్‌లో తను ఈ గ్రంథ రచనకు ప్రేరణ కల్గిన విధము కలదు. ఆంగ్లమున దేశభక్తి గీతముతో ప్రారంభమయి సనాతన భారతీయ నాగరికత, ఆధ్యాత్మిక చింతన, తత్త్వవిచారణలు వివరంగా తెలియపరచినారు. అందు ఈశ్వర తత్త్వము, బ్రహ్మ పదార్థము, దైవ ప్రకృతి, నటరాజ నృత్యాభినయ అర్థ వివరణ, ఈశ్వర ఉనికి - నిరూపణ చాలా ఋజుమార్గంగా తార్కికముగా విశ్లేషించినారు.

ప్రథమయోగి శ్రీ దక్షిణామూర్తి యొక్క వివరణలో అతని స్థానం వేదయుగానికి ముందునుండే కలదని మొహంజోదారో, హరప్పా నాగరికతల పరిశీలకులు సర్‌జాన్ మార్షల్, జె.హెచ్. మాలేగారి పరిశోధనల వివరములు ఉటంకించినారు. నాటి శివుని ప్రతీకలను వర్ణించినారు. భారతీయ సంస్కృతిలో ద్రవిడ నాగరికత తుంగభద్ర లోయ నాగరికతతో మొహంజోదారో నాగరికతల సారూప్యతను, పెరూ, కొలంబియా, ఈస్టర్ నాగరికతలలో గల సారూప్యతను వివరించటంలో భారతీయ పురాతత్వ శాఖవారి పరిశోధన వివరాలను తెలియపరచారు. భారతీయ నాగరికత యొక్క సనాతనత్వాన్ని నిరూపించేవిషయంలో ఈ కవి ఎంతో కృషిసల్పి ఎన్నో నిరూపణలను, పరిశీలనాంశాలను వివరించియున్నాడు. ప్రొ॥ డి. సేన్, బి.బి. లాల్, హరిదాస్ భట్టాచార్య ప్రొ॥ కె.ఎన్. శాస్త్రి, బి.సి. సిన్హా, వేలుపిళ్లై, కురళ్ సాహిత్యాన్ని మరెందరో పరిశోధకుల వివరాలు తెల్పుచూ శ్రీ దక్షిణామూర్తి యొక్క సనాతనత్వాన్ని ఋజువుపరచినారు. శైవ సిద్ధాంతం యొక్క ఔన్నత్యము, పరమతసహనములు కలదిగా తెలిపే వివరణలు - హరిదాస్ భట్టాచార్య, సర్‌జాన్ మార్షల్, ముల్కరాజ్ ఆనంద్, డా॥ జి.యు. పోప్, డా॥ కేమిల్ జల్విబిల్, డా॥ డబ్ల్యూ. హెచ్. గోల్డే, సర్ చార్లెస్ ఇలియట్, ఎస్.ఎస్. సూర్యనారాయణ శాస్త్రిగారి అభిప్రాయాలతో ఆ సిద్ధాంతం యొక్క ఔన్నత్యాన్ని నిరూపించేందుకు చాలా పరిశ్రమించినాడు. మౌనవాణి (VOICE OF SCIENCE) యొక్క విశిష్టతను సనాతనం నుండి అధునాతనం వరకుగల దాని విశిష్టతను ప్రత్యేక గుర్తింపెలాంటిదో వివరించారు శ్రీ దక్షిణామూర్తి నుండి గ్రహించిన ఆదివ్య మౌనబోధ ఋషిపుంగవులు పొందిన జ్ఞానం, దాని ఔన్నత్యాన్ని వివరణలు ఎంతో సమంజసంగా వున్నవి. వారనుభవించిన దివ్యత్వ భావన ఎంతో మహోన్నతమైనదని చూపించారు.

అణచబడ్డ వారసత్వం అనేభాగం చాలా క్లిష్టమైన సందేశం. అందు పురాతన హైందవ నాగరికతలో శతాబ్దాలుగా జరిగిన మార్పులు అది అనుభవించిన ఔన్నత్యాలు, వినాశనాలు, అందు శైవంపై వచ్చిన అపనిందలూ, సమకాలిక దార్శనికుల ప్రభావం,

రాజకీయ సాంఘిక పరిస్థితులు ఇవి అన్నియూ కలుపుకొనుచూ వారసత్వానికి, శైవ సాంప్రదాయాలకు జరిగిన దుష్ప్రచారాలు అందుకు 'సిద్ధాంతం' హేతువు కాదని వివరించే సందర్భంలో ఈకవి ఎంతో మానసిక వత్తిడిని ఎదుర్కొన్నట్లు కనుపిస్తుంది. లేకుంటే ఈ అంశంలో అన్ని వివరణలు, విపులంగా ఈయవలసిన పనిలేదు. అంత విస్తృత పరిశ్రమ ఫలంగా కృతకృత్యుడైనాడని తెలియుచున్నది.

శివలింగాకృతి - శివపూజ వివరణలు ఎంతో సహేతుకంగా నిరూపించారు. చెట్లను, కొండలను, పాములను, జంతువులను ఆరాధించే నాగరికత సర్వమానవ ప్రకృతేనని ఎన్నో వివరణలు సాక్ష్యాధారాల ద్వారా నిరూపించారు. నాటి అనాగరిక పద్ధతులెంతో అర్థవంతమైనవని అవి కాలానుగుణంగా కొంత రూపాంతరం చెంది నేటికీ అవలంభించబడుచున్నవని వానిమూలం ఎంతో లోతైనదో, భావయుక్తమైనదో ఆ వివరణలు అందరూ తెలిసికోదగినవిగా గ్రహించే ప్రయత్నంచేశారు. పృధ్విపై ప్రతి సృష్టికి సర్వ దేశమతాలు అంగీకరించిన 'జలప్రళయాలు' అవి సంభవించి భౌగోళికంగా చెందిన మార్పులు వాని ననుసరించి వ్యాప్తిచెందిన జీవన పరిణామం, నాగరికతలు ఈ గ్రంథ భాగమునకు అంతగా అవసరం లేకపోయినా మనపురాతన నాగరికత, సాంప్రదాయాలు అధ్యయనంచేసేటప్పుడు భౌగోళికమైన స్థితిగతులు, వాస్తవాలు తెలిసికోవటం తప్పనిసరేయని నేనూ ఖచ్చితంగా నమ్ముచున్నాను. జలప్రళయాల వివరణలు ఈ గ్రంథమునకు చాలా అర్థవంతమైన అంశమేనని వారితో ఏకీభవించు చున్నాను.

అణచబడ్డ వారసత్వంలో సనాతన హైందవ సాంప్రదాయం ఎలా అణచబడి సమకాలిక మతాలపై జరిగిన అరాచకాలు, వాని ఉచ్చనీచాలు ఎలా జరిగినవో తెలియ పరుస్తూ నాటి రాజకీయ సాంఘిక స్థితిగతులను వివరిస్తూ ఆయా మతాలు సమాజంపై చూపిన ప్రభావాలు, సమకాలిక దార్శనికులు ప్రతిపాదించిన సిద్ధాంతాలను క్లుప్తంగా వివరించటంలో పాఠకునికి సమగ్రరూపం చూపించి చైతన్యవంతునిగా చూడగోరే మనోభావంగా ఎన్నో వివరణలిచ్చి యున్నారు. సమకాలిక పరిస్థితులు వారసత్వంపై చూపిన అపప్రథలు కేవలం ప్రచారమనే నిరూపించి ప్రకటించారు.

మహేంద్రగిరి మహాయోగి శ్రీ దక్షిణామూర్తి వసించిన స్థానం యొక్క ప్రత్యేకతలు నాటి ఆచార వ్యవహారాలు. ఆర్య సంస్కృతి వృద్ధి పొందునప్పుడు దేశీయులైన ద్రవిడ నాగరికతలలో ఏర్పడిన వైషమ్యాలు, ఆర్యులు తమ స్థానాన్ని సుస్థిర పరచుకొనే సందర్భాలలో దేశీయులను అనాగరికులుగా, రక్కసులుగా చిత్రించిన తీరు ససాక్ష్యంగా వివరించారు. చివరలో మతం - మానవతావాదం, సమసమాజం ఎలా ప్రవర్తించాలి, దాని మార్గదర్శిక సూత్రాలేవి, అవి మొదట చెప్పిన జ్ఞానులెవరు అవి ఆచరించటంవల్ల కలిగే కలిమి వివరించిన అంశాలు చాలా సమంజసంగా ఉన్నాయి. ఈ

భాగం తత్వ పరిశీలకులకు, సత్య సోధకులకు మనసునెంతో ఆకట్టుకోగలవని నమ్ముచున్నాను. ఈవిధమైన విశ్లేషణం ఈ గ్రంథంలోనే నేను పరిశీలించగల్గాను.

వేదోత్తరభాగంగా ద్వితీయ భాగం పూర్తిగా ఆరాధ్యమై ఆధ్యాత్మిక ఆచరణలతో కూడుకొన్నది. ఇందు శైవారాధనలోగల విశిష్టతలున్నవి. పరమశివుని భిన్న రూప ధ్యానములు కాశ్యప శిల్పాధారంగా గ్రహించి ప్రచురించినారు. శైవమత సాంప్రదాయాలు, పురుష సూక్తము, గాయత్రీ మంత్రార్థము, రుద్రాక్ష విశిష్టత, ద్వాదశ జ్యోతిర్లింగాలు, రుద్రరూపవర్ణన, మహాన్యాస రుద్రాభిషేకము, శివరాత్రి విశిష్టత, అంతర్ దర్శనము, పరివేదన, మంత్రపుష్పార్థము, మంగళా శాసనము, శివస్తోత్రములు, లింగాష్టకం, శివభజనలు, స్తుతి అన్నీ ఆధ్యాత్మికపరంగా ఆచరించదగినవిగా వున్నవి. ఈ రచయితకు సంస్కృతంపై కొంత అభిమానమున్ననూ నేటి ఆధ్యాత్మిక భావాలు వెలుగునకు తీసికొని వచ్చే సందర్భంలో సంస్కృతం యొక్క ప్రాముఖ్యత చాలా ఉన్నదనే గ్రహించారు. అందుచే ఆ శ్లోకాలను యథాతథంగా పొందుపరచి అర్థవివరణలిచ్చి భారతీయ ఆధ్యాత్మికత్వాన్ని సంగ్రహంగా వివరించారు.

అంత్యంలో మానవతావాదం, ముగింపులో రచయిత విశ్వ సౌభ్రాతృత్వం, ప్రేమతత్వం, పరహితేచ్ఛ మరల మరల వివరించి దానిపై తనకుగల భావాలను వ్యక్త పరుస్తూ అవి అందరూ ఆచరించదగ్గ సన్మార్గమని సూచించారు. ఇందు రచయిత మనోభిప్రాయంలో సనాతన సాంప్రదాయం విడనాడకుండా సత్యమార్గాన చరించటంలోనూ ప్రేమ పంచటంలోనూ ఆ పరమ శివుని కృపకు ఎల్లరూ పాత్రులు కాగలరని తెలియుచున్నదని వివరించారు.

ఈగ్రంథ రచనకు తానుపరిశీలించిన గ్రంథాల వివరణ, గ్రంథకర్త తానుగ్రహించిన అంశాలు విశ్లేషించి శ్రీ దక్షిణామూర్తి యొక్క రూపాలు, శివుని భిన్న స్వరూపాలు, మొహంజోదారో నాగరికతలలో చూపిన 'పశుపతి' శివాకృతులు ఈ గ్రంథ పరిపూర్ణతను చూపునవిగా వున్నవి. ఈ వివరణలన్నీ తనకన్నా పూర్వులు సేకరించిన వేనని వానిని మరల ఒకసారి సమష్టిగా వెలుగునకు తీసికొనివచ్చే ప్రయత్నంగా భావించాలని కోరియున్నారు. ఈ అభ్యర్థన సత్యమై ఎంతో సహృదయంతో నిండినదై యున్నది. శ్రీ దక్షిణామూర్తి స్థానం ఈ ప్రక్రియలో నిరూపణ చాలా విశిష్టమైనదిగా నమ్ముచున్నాను. ఈ గ్రంథం బహుళ ప్రచారం పొందగలదని ఇందు ప్రథమ భాగం అన్య భాషలలోకి అనువదించదగినదని నమ్ముచున్నాను. భక్తితో ఈ గ్రంథాన్ని శ్రీ దక్షిణామూర్తికే అంకితమొనర్చినాడు శ్రీ బ్రహ్మజీ శ్రీ దక్షిణామూర్తి కృపకు పాత్రులు కాగలరని ఆకాంక్షించుచున్నాను.

**Dr. N. SAMBA MURTHY**
Professor
Dept. of Ancient Indian History,
Culture and Archeology
University of Madras, MADRAS.

*Sri A.V. Brahmendra Rao,*

My hearty congratulation to your successful work on "Sri Dakshina Murthy Darsanam" in a different vision.

In first part of your book on religion is very comprehensive and your objective study of materials is really wonderful. Your presentation is lucid and analytical. This is a very interesting and obsorbing study of Hindu Religion and Indian Culture from the earliest times.

This Darsanam is the only work of its kind published to-date in as much as it treats of all religions prevalent in ancient India, both indigenous as well as extraneous, as also their socio-economic background and aftermath in an objective manner. 'Siddantam" stands how such an ancient and broad. The book meets a long felt desideratum and I am sure, will be found highly enlightening and useful both by the students of the cultural history of India and general readers interested in Indias Culture and heritage hidden.

In the second part of your presentation, naration of 'Siva Idols" in various forms, purusha Suktham, Mahanyasabhishekam, Mantra Pushpam and Saivagama dharma are very very clear to knowledge. Also the providing of Eswara existence is very logical.

I have no doubt that this work will be widely welcomed by those intrested in the early history and culture of India.

*Thanking you,*

***- Dr. N. Samba Murthy***

# భారతీయ సంస్కృతి - దర్శనమ్
# ప్రశంస

భారతీయ సంస్కృతి - దర్శనమ్ అనబడు, సాంకేతిక ప్రామాణిక విలువలు ఆత్మ మోక్ష దర్శన శాస్త్రము, జగత్ గురు శ్రీ "ఆది శంకారాచార్యుల జగన్మిధ్యావాదము, అణచబడ్డ వారసత్వము, కృష్ణ లోయలో బ్రాహ్మణ, విశ్వాసాన్ని ప్రతిబింబించే మొదటి ఆపస్తంభూజ అఘోరమూర్తి శివాలయము సృష్టికర్త కాంతి పురుషుడు అయిన విశ్వకర్మ సృష్టి స్థితి, లయలు విశ్లేషణ షోడశ శివరూపములు శివుని స్వరూప స్థితి దర్శన లక్షణములు, ప్రాచ్య శిల్ప నాగరికత, ప్రాక్తన చతుష్టయము, స్త్రీక్షేత్రము, జలప్రళయాలు గ్రహస్థితులను బట్టి ఖగోళశాస్త్రములోని వైజ్ఞానిక గణనము, కాల నిర్ణయము చేయవచ్చునన్న, శాస్త్రీయమైన, గ్రహాల నడకలు ప్రాపంచిక చరిత్రకాంశములు పాశుపత దర్శనము, పాంచరాత్ర దర్శన వివరములు మతము, మానవతావాదము, భారతీయ ప్రాచ్య శిల్ప కళా నాగరికతా లక్షణములు, సమసమాజము పైన తెలుపబడిన అనేక ప్రామాణిక విశిష్ట విషయములు జ్ఞానశాస్త్ర, పరిశీలనయోగి కృతికర్త యైన శ్రీ బ్రహ్మజీ గారు, పై విషయ శాస్త్రమును వెలుగులోనికి ప్రచురణ ద్వారా పై గ్రంథమును శాస్త్ర విషయములు తెలియపరచినందులకు, మిక్కిలి ప్రశంసనీయులు.

దక్షిణామూర్తి - దర్శనమ్ ఉత్తర భాగము - ఆధ్యాత్మిక పరిణామం రూపధ్యానములు ప్రమాణరూపములు, శివమూర్తి స్వరూప ధ్యానవివరములు శైవమత సంప్రదాయములు, ధ్యానము, సాధన, ధ్యానము ద్వారా నిజచైతన్యము "ఓంకార" స్వరూప తత్వము, పంచతత్వములు గాయత్రీ మంత్ర రూపము ధ్యానము, శివరాత్రి మహిమ విషయము, మహాన్యాసము - అభిషేకము, అంతర్దర్శనము దారిద్ర్య దహనస్తుతి, ముఖ్యముగా శివరూప లక్షణ వివరములు, శిల్పశాస్త్ర ఆధ్యాత్మిక రూపధ్యాన తాత్పర్య విషయములు, ఈశ్వర నిరూపణ అంశములో "మండకోపనిషత్తు" లోని ప్రాథమిక విషయాంశములు శ్రీ దక్షిణామూర్తి ఆత్మ తత్వము, స్త్రీ దేవతామూర్తుల ప్రతిమల వివరణము, ప్రాక్తన చతుష్టయ, శివజ్ఞాన, బోధాశాస్త్ర విషయములు, బుద్ధుడు, ధర్మకీర్తి, బౌద్ధ దర్శనములోని నాల్గు ఆర్య సత్యములు, బుద్ధుని ధార్మిక చింతన దక్షిణామూర్తి దర్శన శాస్త్రపరమైన విషయములను ఎంతో పరిశీలనగావించి జ్ఞానపరులైన విద్యాపరులకు ఎంతగానో సహకరించిన శ్రీ బ్రహ్మజీగారి అకుంఠిత దీక్షా రచన మిక్కిలి ప్రశంసనీయము.

**- దీవి మాధవరాయ శర్మ**

సహాయ స్థపతి దేవాదాయ శాఖ

ఆం॥ప్ర॥ ప్రభుత్వము.

# "ధన్యవాదములు"

శ్రీ దక్షిణామూర్తి దర్శనమ్ గ్రంథ రచన సుమారు రెండు సంవత్సరముల కాలం తీసికొన్నది. విలువగల్గిన సమాచారములు సేకరించుటకు, భారతదేశ పురాతన సంస్కృతిపై అధ్యయనం చేయుటకు వలసిన గ్రంథములు సకాలములో లభించకనూ, చారిత్రాంశములలో మతవిలువలను క్రోడీకరించి బయలుపరచుటకు ఎంతో కాలం పట్టినది. ఎన్నో పరిశోధక గ్రంథములను సమకూర్చుటలో మాకు సహకరించిన స్టేట్ రీజనల్ లైబ్రరీ - గుంటూరు శాఖ ఉద్యోగులకు మా కృతజ్ఞతలు ముందుగా తెలుపవలసి యున్నది.

ఈ గ్రంథ ప్రథమ ప్రయత్నమును పరిశీలించి, నిశిత విమర్శచేసి వాస్తవాలను వెలుగునకు తెచ్చే ప్రయత్నంలో నన్నెంతో ప్రోత్సహించి సత్యావిష్కరణకు దోహదపడి ప్రస్తుత గ్రంథం ప్రమాణికంగా రూపొందుటకు తోడ్పడిన ప్రొ॥ జి. నాగేశ్వరరావు (ఆంధ్రా యూనివర్శిటి, విశాఖపట్నం) వారికి హృదయపూర్వక ధన్యవాదములు.

ఈ గ్రంథముపై తమ అమూల్య అభిప్రాయం వెలిబుచ్చిన ప్రొ॥ డా॥ ఎన్. సాంబమూర్తి (మద్రాస్ యూనివర్శిటి, మద్రాస్) గ్రంథ సమీక్షమొనర్చిన ప్రొ॥ డి.ఎన్. పరమశివం (తత్వశాస్త్రం) కోయంబత్తూరు వారికి నా కృతజ్ఞతాభివందనములు.

శ్రీ దక్షిణామూర్తి దర్శనమ్ గ్రంథావిష్కరణకు తోడ్పడిన ప్రముఖ నేత్రవైద్యులు దయాహృదయ సేవాసంస్థ వ్యవస్థాపకులు డా॥ ఆర్. దయాకర్‌గార్కి, గ్రంథ ముద్రణకు ధనమనుగ్రహించి సహకరించిన పరమశివుని ఏకాదశ రుద్రరూపులుగా !

1. కపాలునిగా : శ్రీ సానగ బ్రహ్మర్షి గోత్రజులు
   శ్రీకోట రామారావు, అన్నపూర్ణగార్లు
2. పింగళునిగా : శ్రీ ఆంగీరస బ్రహ్మర్షి గోత్రజులు
   శ్రీ శ్రీరాం వెంకటలక్ష్మీకాంతారావు, నాగేశ్వరమ్మగార్లు
3. భీమునిగా : శ్రీ భద్రాక్షస బ్రహ్మర్షి గోత్రజులు
   శ్రీ చోడా నాగేశ్వరరావు, నాగేంద్రమ్మగార్లు
4. విరూపాక్షునిగా : శ్రీ విశ్వంభర బ్రహ్మర్షి గోత్రజులు
   శ్రీ నూతక్కి సుబ్బరాయుడు, స్వరాజ్యలక్ష్మిగార్లు
5. విలోహితునిగా : శ్రీ సానగ బ్రహ్మర్షి గోత్రజులు
   శ్రీ కొండిపర్తి సత్యనారాయణ, గిరిరాజకుమారిగార్లు

6. శాస్తునిగా : శ్రీ భరద్వాజ బ్రహ్మర్షి గోత్రజులు
శ్రీ నంబూరు వీరేశలింగం, విజయకృష్ణ కుమారిగార్లు

7. అజపాదునిగా : శ్రీ కౌండిన్యస బ్రహ్మర్షి గోత్రజులు
శ్రీ శనగల మృత్యుంజయశర్మ, భానుమతీదేవిగార్లు

8. అహిర్బుధ్న్యునిగా : శ్రీ రాపినోళ్ళ గోత్రజులు
శ్రీ రామిరెడ్డి సాంబిరెడ్డిగారు.

9. శంభునిగా : శ్రీ సనాతన బ్రహ్మర్షి గోత్రజులు
శ్రీ అమృతలూరి చక్రధరరావు, మణెమ్మగార్లు

10. చండునిగా : శ్రీ ఆత్రేయస బ్రహ్మర్షి గోత్రజులు
శ్రీ పూసపాటి గిరిధర్, లక్ష్మి ప్రసూనాంబగార్లు

11. భవునిగా : శ్రీ ఆత్రేయస బ్రహ్మర్షి గోత్రజులు
శ్రీ పూసపాటి రమణకుమార్, కళ్యాణిగార్లు

వీరు రుద్రులైనను పరమశాంతులై నాపట్ల ప్రసన్నులైరి.

ముద్రణకు సహకరించిన శ్రీ లక్ష్మీ గణపతి ప్రింటర్సు, శ్రీ బి.వి.ఎస్. శాస్త్రి గార్కి, కవర్ పేజీపై శ్రీ దక్షిణామూర్తి రూపం సాక్షాత్కరింపజేసిన ప్రముఖ చిత్రకారులు శ్రీ దేవీప్రసాద్ గార్కి, ఆప్తమిత్రులు శ్రీ యర్రగడ్డ సీతారామయ్య గార్కి ధన్యవాదములు.

– బ్రహ్మాజీ

# శ్రీ దక్షిణామూర్తి దర్శనమ్

## విషయసూచిక

# భారతీయ సంస్కృతి - దర్శనం

"ఆత్మావా ద్రష్టవ్యః శ్రోతవ్యః మంత్ర వన్యోనిధి ధ్యా సి తవ్యః"

ఆత్మను చూడు, ఆత్మను విను. ఆత్మను గురించి తెలుసుకో. నిరంతరం ధ్యానించు.

శ్రవణ, మనన, ధ్యానాదుల ద్వారా ఆత్మను గురించి తెలుసుకోగల్గేట్లు చేసేదే 'దర్శన శాస్త్రం'.

శోక మోహాదులనుండి మానవుని విముక్తి చేసేదే 'దర్శనశాస్త్రం' - అదే బ్రహ్మవిద్య - ఆత్మ విద్య - మోక్షవిద్య. అది భవబంధాలను త్రెంపే విద్య. విపులమైన వైజ్ఞానిక దృష్టితో పరిశీలించి బ్రహ్మ పదార్థజ్ఞానాన్ని పొందటమే దర్శనం.

ఆధ్యాత్మికత, సంస్కృతి, భౌగోళికల మేళవింపే భారతదేశం. భారతదేశమంటే కేవలం భౌగోళిక, నైసర్గిక స్వరూపంగా పూర్వకాలపు భారతీయులు భావించలేదు. సంస్కృతి, సాంప్రదాయాలలోను, ఆధ్యాత్మిక చింతనలలో ఎక్కడ సారూప్యత కన్పిస్తుందో అదే తమదేశంగానూ, అవి ఆచరించే వార్ని తమ దేశస్థులుగా భావించారు. ఇక్కడ సంస్కృతి అంటే భౌతిక సంస్కృతి కాదు, దేశ సిరిసంపదలు కావు. దేశ భావ వాతావరణం, సంస్కృతి దేశ కాలాలతో, విస్తారమైన ఆధ్యాత్మిక చింతన, నైతిక ప్రవర్తన, దైవచింతన, దేశ సంస్కృతికి మూలాధారాలుగా భావించారు. సమాజానికి ఉన్న అంతరంగం సంస్కారం -సంస్కృతి. కంటికి కనుపించని సంస్కృతిని ఎలా గుర్తించటం? సమాజ సంస్కృతి సాహిత్యం - కళల మీద ఆధారపడి వుంటుంది. భారత సమాజ సంస్కృతి మానవుని ఉన్నత శిఖరాలకు చేర్చటం.

ఇహానికే ముడిపెట్టుకొన్న పాశ్చాత్య సంస్కృతి భారతీయ సంస్కృతిని నిరసించటం సహజమే. "భారతీయ సంస్కృతి తన లోతులు తాను కనుక్కొని విముక్తి కొరకు జరిగిన ప్రయత్నం జీవితంతో విరోధంగా పరిణమించటమనే లోపానికి గురైంది. అయినా సనాతన సాంప్రదాయ లక్ష్యం అంతరించకుండా తన ఔన్నత్యాన్ని నిరూపించుకొంటూనే భారతీయ జీవితానికి ఎప్పటికప్పుడు కాలానుగుణంగా ప్రభవించిన ప్రబోధకుల ద్వారా ఆ దివ్య జ్ఞానాన్ని నూతన జీవితాన్ని అందిస్తూనేవుంది.

**"సర్వేజనా : సుఖినో భవంతు, సర్వేసంతు నిరామయాః ।**
**సర్వేభద్రాణి పశ్యంతు - మాకశ్చిత్ దుఃఖ భాగ్భవేత్" ॥**

వేద కాలంనాటి ఏ శాంతి మంత్రాన్నైన పరిశీలించి చూస్తే సహనత, సత్‌భావన, సమిష్టి జీవన విధానం భారతీయ సంస్కృతిలో ముఖ్యాంశాలుగా గోచరిస్తాయి. దేశానికి వ్యక్తి-సమాజం విడదీయలేని అనుబంధంగా గుర్తించారు. ఈ నాటికి కూడా కొందరు బ్రహ్మర్షులు, రాజర్షులు, యోగులు, విద్వాంసుల పేర్లు, మిగిలి ఉన్న విషయం మన మెరిగినదే. ఆ రోజులలో ధర్మ మోక్షాలకు ఎక్కువ విలువ నిచ్చారు. వ్యక్తి గుణగణాదులను లెక్కించేటప్పుడు అంగీకృతమైన కొన్ని ప్రామాణిక విలువలను రూపొందించారు.

జాతి, మత, రంగు, వయో, లింగ భేదములు లేకుండా ఈ ప్రామాణిక విలువలకు ఎవరు సరిపోతారో వారిని మహానుభావులన్నారు. క్రీ. శ. (788-820) 8వ శతాబ్దిలో జగత్ గురు శ్రీ శంకరాచార్యుడు జగన్మిథ్యా వాదాన్ని రూపొందించాడు. బ్రహ్మమాత్రమే సత్యమని, జగత్ మిథ్యయని జీవుడు- పరమార్థ తత్వం రెండూ ఒకటేనని ఈ దర్శనంలోని ప్రముఖ సిద్ధాంతం. అది ఈ నాటికి కూడా సామాన్య జనాన్ని ప్రభావితం చేస్తూనే ఉన్నది.

**"అలౌకికం పురుషార్థోపాయం వేత్తి అనే నేతి"**

వేద విషయమంతా "ధర్మ, బ్రహ్మ" స్వరూప నిరూపణయే.

**"ధర్మ బ్రహ్మణి వేదైక వేద్యే"**

కంటికి కనుపించేదేది ధర్మముకాదు, బ్రహ్మముకాదు. మానవులు చేసే సమస్త కర్మలను అంటిపెట్టుకొని వుంటూ ఆ కర్మల ఫలంగామనకు అనుభవంలోకి వచ్చేదే ధర్మం.

ప్రాచీన భారతీయ విద్యా విధానంలో (1) ఆదర్శాలు, నైతిక విలువలు, ఆధ్యాత్మిక చింతనల సమ్మేళనం. (2) అర్హతాభిరుచుల ననుసరించి విద్యా విధానం. వారికి తెలిసిందంతా సమస్తమైన విద్యలు ముక్తి మార్గాలని మాత్రమే. నిరంతరం శ్రమిస్తూ అర్థకామాలను అనుభవిస్తూ, ఆధ్యాత్మిక విలువలైన, ధర్మమోక్షాలకై ప్రయత్నించిన నాగరికత మన పూర్వులది.

**"క్షణశః కణశశ్చైవ విద్యా మర్థంచ చింతయేత్"**

(శ్రీ కాళిదాసు)

ప్రతిక్షణము విద్యను, ధనాన్ని చిన్న చిన్న కణాలుగానైనా సాధింపుమని.

ప్రాచీన భారతీయ విద్యా విధానం అంతా ఆరోజులలో అంగీకరించబడిన జ్ఞాన మీమాంస శాస్త్రం. ఆ జ్ఞాన స్వరూపమేమి, అవధులేమి, ఆ రోజులలో, ఆచరణలలో అంగీకరించబడిన పురుషార్థాలపైన, వర్ణాశ్రమ ధర్మాలపైనా చాలా వరకు ఆధారపడిఉన్నవి. 'జాతస్య మరణం ధృవం' - మరణించిన ప్రతి జీవి తిరిగి జీవిస్తుందా ? జననము-

మరణము అనే రెండు యదార్థాల మధ్య ఉండేదే జీవితం. ఈ జీవితం శాశ్వతంకాదు. ఈ శరీరం నశించిపోతుంది. కనుక ఈ శరీరం దృఢంగా, ఆరోగ్యంగా వున్నపుడే మన జీవితపు ఆశయాలు, విలువలు, భౌతిక సంపద ఆధ్యాత్మిక సంపద చేకూర్చుకోవాలి.

జ్ఞానమంతా వస్తు ఆశ్రయమా ? లేక ఆత్మ ఆశ్రయమా ? భారతీయ దార్శనికుల దృష్టిలో జ్ఞానమంతా ఆత్మ ఆశ్రయమే. ఆధ్యాత్మిక సత్యాలంటూ కొన్నిఉన్నాయి. వాటిని మానవుడు తన అంతర్బుద్ధి ద్వారా తెలిసికోగలడు. అవి కేవలం భావనా మాత్రాలు కావు. వాటికి యదార్థతవుంది. పూర్వులు వాటిని అన్వేషించి అనుభవం ద్వారా తెలిసికొన్నవారు అనేక మంది ఉన్నారు. నేడు కూడా కొందరున్నారు. అనేక మంది మహర్షులు, యోగులు, తత్వదర్శనాన్ని పొందారు. వారి వారి దివ్య అనుభవాలు వ్యక్తం చేసినపుడు వారు చూపిన పారమార్థిక స్వరూప వర్ణాలలో తేడాలు కనుపించినా భిన్నత్వంలోనే ఏకత్వం చూడటం భారతీయ దర్శన శాస్త్ర ప్రముఖ లక్షణం.

సృష్టిలో ఏ పరిణామం మూకుమ్మడిగా జరుగదు. వ్యక్తిగత వృద్ధి ద్వారా, వ్యక్తులు పెంపొందించటం ద్వారా జరుగుతుంది. ఏ ఒకరిద్దరు అసాధారణ వ్యక్తులలోనో ముందుగా దివ్య చైతన్య పరివర్తనం జరుగుతుంది. ఆ తరువాత అది నెమ్మదిగా జాతిలో వ్యాపించి సాధారణమైపోతుంది.

పరిణామ గమనంలో మానవుడు ఇప్పటికన్నా ఉన్నత స్థాయిని, క్రొత్త క్రియాశీల స్థాయిని అంటే దివ్య చైతన్య మానవత్వాన్ని చేరగలడు. అలా మానసికంగా ఎదిగిన మానవుడు దివ్య మానవునిగా భవిష్యరూపం పొందగలడు. మానవుని ఈ మార్పు సంఘం దాని కార్యకలాపాలలో కూడా మార్పు పొంది ఒక దివ్య జీవన (Divine Life) కు స్థాపన కాగలడు.

భారతీయ సంస్కృతి ప్రధానంగా 1) మతము ఆధ్యాత్మికత (Religion and Spirituality), 2) భారతీయ చిత్ర శిల్పకళ (Indian Sculpture Art), 3) భారతీయ సాహిత్యం (Indian Literature), 4) భారత రాజ్యాంగ వ్యవస్థ (Indian Polity) గా ప్రముఖులు గుర్తించారు.

1. అవి సర్వానికి ఆరంభస్థానమైన అత్యున్నత చైతన్యస్థితిలో విశ్వాసాన్ని ప్రబోధించింది. 2. దీనిని చేరేదాకా మానవుడు జీవితంలో అంతర్గత వికాసాన్ని బాహ్య క్రమశిక్షణనూ అనుసరించాలని చాటింది. 3. స్థిరమైన బహుముఖమైన సర్వదా విస్తరించే జ్ఞాన, ఆధ్యాత్మిక సాధనా పద్ధతిని అందించింది. 4. ఈ ఉన్నత సోపానాలు ఎక్కలేని వారికి వ్యక్తిగత, సామూహిక జీవితాన్ని రూపొందించింది. ప్రతి వ్యక్తి తన పరిమితులలోతన ప్రకృతిని బట్టి నడుస్తూ క్రమంగా ఆ మహనీయస్థితిని చేరగల్గేటట్లు చేసింది. అందుచేతనే నమ్మాళ్వార్, మానిక్కవసాగర్, ఆండాళ్, తుకారామ్, కబీరు,

మీరా, శంకరుడు, రామానుజుడు, చైతన్యుడు, పోతన, నానక్ లాంటి ఆధ్యాత్మికులు మత వ్యవస్థాపకులేగాక మహాకవులు, శిల్పులు, విజ్ఞాన శాస్త్రజ్ఞులు, పరిపాలకులు, రాజనీతివేత్తలు. బహుముఖ ప్రజ్ఞావంతులు, విజేతలు - అశోకుడు, చాణక్యుడు, చంద్రగుప్తుడు, భోజుడు, కాళిదాసు, అక్బర్, శివాజీ, గురుగోవింద్ మొదలైనవారు భారతీయ సంస్కృతిలో జన్మించారు.

మానవుడు విశ్వమయుడై సర్వ అస్థిత్వాన్ని, సర్వజీవులను తానుగా భావించటానికి అది మార్గంచేసింది. భారతీయ సంస్కృతిలోని భావాత్మక ఆదర్శం ఇది. పాశ్చాత్యులు అనుకొన్నట్లు భారతీయ సంస్కృతి జీవితానికి సంబంధంలేని తాత్విక ఊహాగానమే అయితే దానికింత బ్రహ్మాండమైన జీవనధార, శక్తి ఉండేవికావు.

అహంకార నిర్మూలనాన్ని భారతీయ మతం బోధించిన మాటనిజమేగాని అది అనంతత్వాన్ని గెలుచుకోవటానికి సాధనగా మాత్రమేనని గ్రహించాలి. మానవుడు విశ్వమయుడై సర్వ అస్థిత్వాన్ని సర్వ జీవులనూ తానుగా భావించటానికి అది మార్గం, భారతీయ సంస్కృతిలోని భావాత్మక ఆదర్శంగా గుర్తించవలసినది.

శ్రీ S. రాధాకృష్ణన్ భారతీయ తత్వశాస్త్రాన్ని "భారతదేశంలో తత్వశాస్త్రం ప్రధానంగా ఆధ్యాత్మికం, కాల విధ్వంసాన్ని, చారిత్రక దుర్ఘటనలను తట్టుకొని భారతదేశం నిలబడటానికి అది పెంపొందించిన గొప్ప రాజకీయ నిర్మాణంగానీ లేదా సాంఘిక వ్యవస్థగానీ కారణంకాదు. తీవ్రమైన దాని ఆధ్యాత్మిక తత్వమే కారణం" అన్నారు.

# ఈశ్వరుడు

## (నశింపులేనివాడు)

"ఈశావాస్యమిదగ్ం సర్వయత్కించ జగత్యాం జగత్".

పృథ్వియందుగల సమస్త జీవరాశుల యందంతటనూ కించిత్తయిననూ ఈశ్వరుడు వ్యాపించి యుండని ప్రదేశమేలేదు.

**"యస్తు సర్వాణి భూతాని ఆత్మ న్యే వాను పశ్యతి"**
**సర్వ భూతేషు చాత్మానాం తతోన విజుగుప్సతే" ॥**

ఎవరు తమయందు వలెనే అన్ని భూతములయందు ఆత్మను చూచువారు అన్ని భూతముల యందదే ఆత్మ ఉన్నదని యెంచువారు ఇతరులను ద్వేషింపరు.

**"యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాద్వి జానతః**
**తత్రకో మోహః కశ్శోకః ఏకత్వ మను పశ్యతః**

ఎవరు సమస్త భూతాలను తమ ఆత్మగనే యెంచి సర్వత్రా ఆకాశమువలె వ్యాపించియున్న ఈశ్వరునిగా భావించి ప్రకృతి వలన కలిగిన స్థూల శరీరాదులు తానుకానని స్వచ్ఛముగా అంతర్జ్యోతివలె వెలుగుచున్న ఈశ్వరునిగా భావింతురో వారికి శోకము మోహము కలుగవని తెలియుచున్నది.

**"నిర్వికారో నిరాకారో నిరవద్యో ऽ హ మవ్యయః**
**నాహం దేహో హ్య సద్రూపో జ్ఞాన మిత్యు చ్యతే బుధైః ॥**

జన్మ మరణముల వికారము లేనివాడను. కారణమేమంటే శరీరేంద్రియములనే ఆకారములేనివాడను. అందువల్ల తాపత్రయములు, అపక్షయము, నాశములేనివాడను, నశించు శరీర స్వభావుడను కాను.

**"నిరామయో నిరాభాసో నిర్వికల్పో ऽ హ మాతతః**
**నాహం దేహో హ్య సద్రూపో జ్ఞాన మిత్యు చ్యతే బు ధైః ॥**

ఏ రోగము లేనివాడను, స్వప్రకాశస్వరూపుడను గనుక దేనిచేతను తెలియబడను. సర్వకల్పనా రహితుడను, ఆరోపము అధిష్టానమునకు అంటను, కనుక కల్పనా రహితుడను. దేహాది స్వరూపుడనుకాను, అఖండ బ్రహ్మాకార వృత్తియగు సాక్షాత్కారమే జ్ఞానమనబడును.

మరియు ఏగుణము, క్రియలు నాశములేనివాడను, ఏ బంధమూ లేనివాడను. నేను అజ్ఞానము, అజ్ఞాన కార్యములగు భ్రమలు అనే మాలిన్యములేనివాడను.

ఆకాశాదులవలె శూన్యరూపుడను. దేశ కాలవస్తు పరిచ్ఛేదములు లేనివాడను, అపరిశుద్ధత, ముసలితనము, మరణములేనివాడను. ఇవి అన్నియూ స్థూల సూక్ష్మాకార దేహములకు సంబంధించినవి కనుక దేహ త్రయములేనివాడను, సచ్చిదానంద స్వరూపుడననే తెలుసుకొనుటయే జ్ఞానమనబడును.

**విశ్వత శ్చక్షు రుత విశ్వతోముఖో**
**విశ్వతో హస్త ఉత విశ్వత స్పాత్**
**సం బాహుభ్యాం ధమతి సంపతత్రై**
**ర్ద్యా వా భూమి జనయన్ దేవ ఏకః** (ఋ. 10-81-3)

విశ్వకర్మ అంతటనూ కన్నులు కలవాడును, అంతటనూ ముఖములు కలవాడును, అంతటనూ చేతులు, కాళ్ళు కలవాడగు చున్నాడు. అతడు ఇతరులసాయము లేకయే జీవులయొక్క పుణ్యాపాప, రూప కర్మలచేత భూలోకము మొదలు దివము వరకునూ గల సమస్త లోకాలను సృష్టించాడు. అనంతమైన అనేక భువనాత్మకమైన ఈ జగద్రూప సామ్రాజ్యాధిపతి ఒక్కడే. ఆయనే సృష్టి, స్థితి, లయకర్త అని వేద ఉపనిషత్తులయందు ఈశ్వర స్వరూపాన్ని విపులంగా నిర్వచించింది.

పురాణేతిహాసాల కర్త అయిన వ్యాసుడు పురాణాదుల యందు వివిధ ఈశ్వర స్వరూప నిరూపణముచేసి అది వేదసాంప్రదాయానుగుణమేనని తెలియపరచటానికై బ్రహ్మసూత్రాలను రచించాడు. అందు రెండవసూత్రంలో -

**"యతోవ ఇమాని భూతాని జాయంతే**
**యాని జాతాని జీవంతి। యత్ ప్రయం త్య భి**
**సం విశంతి। త ద్వ జిజ్ఞాసస్య తత్ బ్రహ్మేతి।**

ఏ మూలభూత తత్వం వలన ఈ పాంచ భౌతిక సృష్టి జరుగుతుందో, ఎవని వలన ఈ జగత్తు రక్షింపబడి సుభిక్షంగానుందో, తిరిగి ఈ సృష్టి ఎవనియందు లయము చెందునో ఆ మూలభూతతత్వమును గూర్చి శాస్త్రీయముగా మీమాంస చేసికొనుడు. అదియె బ్రహ్మయని శృతి. బ్రహ్మసూత్రాల తాత్పర్యము. దాని వలన ఈశ్వర స్వరూప లక్షణం స్పష్టమగు చున్నది. సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము యొక్క కర్తృత్వం ఈశ్వర లక్షణం. అతడే అంతర్యామి.

భాగవతమున :

**లోకంబులు లోకేశులు**
**లోకస్థులు తెగిన తుది, నలోకంబగు పెం**
**జీకటి కవ్వల నెవ్వం**
**డేకాకృతి వెలుగు నతనినే సేవింతున్.**

మరియూ,

ఎవ్వనిచే జనియించు జగ
మెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వని యందు డిందు పర
మేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వ డనాది మధ్య లయు
డెవ్వడు, సర్వము తానయైన వా
డెవ్వడు, వాని నాత్మ భవు
నీశ్వరునే శరణంబు వేడెదన్.

త్రిమూర్తులకు తండ్రియూ, కీర్తివలె అంతటా వ్యాపించువాడునూ, భక్తులకు సమస్త శక్తులను చేకూర్చువాడును అగు ఆ విశ్వకర్మ, విశ్వకర్త, జగత్‌పిత సాక్షాన్నిర్గుణ పరమాత్మ అయిన జగదీశ్వరునిగా నెరుంగవలయును.

"త్ర్యంబకం యజామహే,- సుగంధిం పుష్టి వర్ధనం ।
ఉర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మామృతాత్ ॥

(ఋ. 7-59-12)

త్రయంబకా రాధనచేత అనగా పరమాత్మ జ్ఞాన సముపార్జనము వలన మృత్యువు తొలగి అమృతత్వమబ్బునని, అతని జ్ఞానము సంపూర్ణముగా కలిగిననేగాని అమృతత్వము రాదని భావము.

"త మేవం విద్వా నమృత ఇహ భవతి
నాన్యః పంథా అయనాయ విద్యతే"

ఆజగత్ కారణ పరబ్రహ్మమును ఎఱింగిననే గానీ మృత్యువును దాటి అమృతుడు కాలేదని తెలియుచున్నది - అట్టివాడే

"బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి"

బ్రహ్మవేత్త బ్రహ్మయే అయినట్లు త్ర్యంబక తత్త్వ సాధకుడు త్ర్యంబకుడు కాగలడు. సత్యమార్గ నిర్దేశకుడు, సత్యవాక్ ధారి అట్టి ఈశ్వరుని సదా, ధ్యానించి కాంచగలడని భావించనగు.

యోగ దర్శనంలో ఈశ్వరునికి చాలా ప్రాధాన్యత ఉంది. ఈశ్వరుని సర్వజ్ఞత్వ లక్షణం కల్గి ఇతర పురుషుల నందర్ని అతిశయిస్తున్నాడని 'సేశ్వర - సాంఖ్యం' అనబడుతుంది.

యోగ దర్శనంలో పతంజలి, (క్రీ. శ. 250) ఈశ్వరుణ్ణే ఆది గురువుగా ఎంచాడు. ఈశ్వరుడు త్రికాలాతీతుడు, ఆద్యంత రహితుడు, అతడు పూర్వపు ముక్త పురుషులందరికి గురువు. అతడే మోక్షప్రదాత. 'ప్రణవం' అతని సంకేతం. ప్రణవాన్ని జపిస్తూ దాని అర్థాన్ని మననం చేస్తూ ఈశ్వర ప్రణిధానం చేయాలి. అపుడు శ్రమలేకుండా సమాధిసిద్ధిస్తుంది. అనగా తాను ప్రకృతి కంటే పూర్తిగా వేరైన పురుషుణ్ణే అనే జ్ఞానం కలిగి విఘ్నాలన్నీ ఈశ్వరానుగ్రహం వల్ల తొలగిపోతాయి.

మోక్షదాయకమైన దివ్యజ్ఞానం పరిశుద్ధ హృదయాలకు ఏ రకమైన ఉద్వేగంలేని వారికి వస్తుంది. అట్టి పరిశుద్ధత, లేములు సాధించటం అత్యంత కష్టతరమైనా అవి అందరికి అకుంఠిత సాధనవల్ల సంభవాలే. ఇలా జ్ఞాన యోగం స్వార్థ రహిత జ్ఞానార్జన, సత్యగుణాన్ని వికశింపజేస్తుందని బోధిస్తుంది.

యోగజీవతంలో ధర్మ, భక్తి, జ్ఞాన అని మూడు క్రియాదశలు. అవి నిస్వార్థకర్మ, ప్రేమ, జ్ఞానాలతోముడిబడి ఉన్నాయి. అవి ఆచరించబడిన జీవి నేను, నన్ను, నాది అనుబంధాలనుండి విముక్తి పొందే జిజ్ఞాసువుకు తోడ్పడుతుంది. ప్రతివాని యొక్క సత్త్వ స్వభావం సత్త్వ రజస్తమో గుణాల ఆచరణ ద్వారా ప్రస్థాన ప్రగతిని చేపట్టవలసినదిగా ఆజ్ఞాపిస్తుంది. ఇదే యోగదక్షిణామూర్తి ప్రవచించిన సనాతన హైందవ మతం.

ధర్మ బద్ధమైన క్షేమకరమైన జీవిత విధానాన్ని ఋషులు వివిధ సంస్కార రూపమైన కర్మలనుపదేశించారు. అవి భారతీయులకు శిరోధార్యాలు. స్వధర్మాన్ని అనుష్ఠించకుండా ఈశ్వరానుగ్రహానికై అర్రులు చాచటం అవివేకం. ఈశ్వరుడు కర్మఫలప్రదుడు.

బ్రహ్మ పదార్థముగా :

**"య న్మూలం సర్వభూతానాం యన్మూలం చిత్తబంధనం**

**మూలబంధ స్స దాసే వ్యో యోగ్యో సారాజయోగినాం ॥**

ఏ బ్రహ్మతత్త్వం ఆకాశాది సమస్త భూతాలకు మూలకారణమో, మనస్సుకు కారణమైన జ్ఞానముకూడా ఏ బ్రహ్మ అధిష్ఠానముగా నున్నదో అట్టి పరబ్రహ్మయే మూలబంధము. సర్వకాలములయందు ఈ మూలబంధమును ఆశ్రయించియే రాజయోగులు అనగా జ్ఞానయోగులు తరించవలెను.

**"అంగానాం సమతాం విద్యోత్సమే బ్రహ్మణి లీయతే ।**

**నో చే న్నైవ సమానత్వ మృజుత్వం శుష్క వృక్షవత్ ॥**

దేహ సామ్యమునకు లక్షణము శరీరము యొక్క కాళ్ళు చేతులు మొదలగు అవయవములు అధిష్ఠానమగు సర్వసమమగు బ్రహ్మరూపముగా భావించి

శరీరావయవముల యందు చంచలత్వ మనగా విషయములయందు ప్రవర్తించుట లేకుండా చేయుటయే దేహ సౌమ్యము. శరీరావయవముల యందు బ్రహ్మ భావన లేనిది చంచలస్థితిపోదు. అది పోనిది ఎండిన చెట్టువలె ఋజు భావమేర్పడదని భావము.

"తతస్తద్వృత్తి నైశ్చల్యం కుంభకః। ప్రాణసంయమః।
అయంచాపి ప్రబుద్ధానా మజ్ఞానాం ఘ్రాణ పీడనం ॥"

అహం బ్రహ్మాస్మి అనగా నేను బ్రహ్మనయితిననే, అంతఃకరణ వృత్తిని నిశ్చలముగా నిలుపుకొనుటయే కుంభక మనబడును. బ్రహ్మకంటే యేదియూ వేరులేదనుకొనుట రేచకము. నేను బ్రహ్మ స్వరూపుడనని భావించుట పూరకము. ఈ వృత్తిని నిశ్చలముగా నుంచుకొనుట కుంభకమని చెప్పినట్లయినది. ఇట్టి ప్రాణాయామము జ్ఞానులకే. ముక్కుతో చేయు ప్రాణాయామము అజ్ఞానులకని భావము.

ఏవం యః సర్వభూతేషు పశ్యత్మాన మాత్మనా
స సర్వ సమతా మేత్య బ్రహ్మ మ్యేతి పరమాం పదం

*(మనుస్మృతి - 12-125)*

ఒకడు సర్వప్రాణులను తన ఆత్మలోని ఆత్మగా భావిస్తాడో, అతడు సర్వ సమతను సాధిస్తున్నాడు. అట్టివాడు పరమపదం అయిన బ్రహ్మపదం చేరుకుంటాడు.

ఇది మానవతకు పరాకాష్ఠ, దైవత్వానికి చేరువలోనిది. భారత సనాతన సాహిత్యాన్ని పరిశీలించేటప్పుడు, బాహ్య సౌందర్యాన్ని కాక ఆత్మ సౌందర్యాన్ని పరిశీలించాలి.

## దైవ ప్రకృతి - దేవుడు :

నిష్క్రియాత్మక స్థితి లేదా సంకోచస్థితిలోని దేవుడే దైవ ప్రకృతి లేదా శివుడు. క్రియాత్మకస్థితి, వ్యాకోచస్థితిలోని దేవుడే శక్తి, దీనినే శివజ్ఞానబోదమ్ అనెయ్' లేదా దైవ సంకల్పం అంటుంది. దైవప్రకృతి - దేవుని కలిపి శివ-శక్తులుగా లేదా 'అర్ధనారీశ్వరులు' గా చిత్రీకరించటమైనది. సంకోచస్థితిలో నున్న దేవుడు అవైయుక్తికము లేదా నిర్గుణము. వ్యాకోచస్థితిలోని దేవుడు వ్యక్తికము, దయ ప్రేమలు కలవాడని తెలియుచున్నది.

తాంత్రిక దృష్టిని విశ్లేషిస్తూ భౌతిక శాస్త్రవేత్త MICHALL TOLBOT "మార్మిక వాదం - ఆధునిక భౌతిక విజ్ఞానం" అనే తనగ్రంథంలో - చేతనము - సత్యనిర్మితి (Reality - Structure) రెండూ సమానార్థాలేనని తంత్రాలంటున్నాయి. సత్యనిర్మితిలే శక్తి, పౌరాణికంగా శివునిలోని స్త్రీ భాగం (Counterpart) అయిన శక్తిచే ప్రతి బింబితమవుతుంది. శక్తిని కలిగియున్న శివునికి శక్తికి భేదంలేదు. చేతనానికి ఉన్నశక్తి చేతనమే- అదే శివశక్తి. దృశ్య రూపకమైన విశ్వానికి అస్థిత్వాన్ని కల్పించేది ఆ శివశక్తే. (Page No. 149. of Mysticism and the new physics by Michall Tolbot).

నటరాజు లేక నర్తిస్తున్న శివుని ఫిట్జోఫ్‌కాప్ర అనే భౌతిక శాస్త్రవేత్త వివరణలో "ఆధునిక భౌతిక విజ్ఞాన శాస్త్రవేత్తలకు శివతాండవం - పరమాణు అంతర్ పదార్థాల నర్తనమే". హిందూ పురాణాలలో లాగ అది మొత్తం విశ్వానికి సంబంధించిన అవిరళ సృష్టి ప్రళయనర్తనం. అది మొత్తం అస్థిత్వానికి, సహజ దృశ్యమానానికి మూలాధారం. శివుని తాండవ నృత్య ప్రతిమలు భారతీయ శిల్ప సృష్టి ఔన్నత్య ప్రతిమలుగా, నృత్య గురువుగా ఆరాధించారు. మన ఈ కాలంలో విశ్వనర్తన నమూనాలను చిత్రించటానికి భౌతిక శాస్త్రవేత్తలు అత్యంత పురోగమించిన సాంకేతిక జ్ఞానాన్ని ఉపయోగించారు. ప్రతిక్రియ జరుపుకొంటున్న కణాల బుద్బుదశాల (Bubble Chamber) ఛాయాచిత్రాలు ఈ విశ్వంలోని సృష్టిప్రళయాల అవిరళ లయలకు సాక్ష్యంపలికే శివతాండవ దృశ్య చిత్రాలు. భారతీయ శిల్పులు నిర్మించిన శివుని భిన్న ఆకృతులు భంగిమలు అందంలోను, అర్థవంతంలోనూ అవి పోటీపడతాయి. విశ్వనర్తన రూపం ఈ విధంగా ప్రాచీన పురాణాన్ని మతైక కళను, ఆధునిక భౌతిక శాస్త్రాన్ని ఏకం చేస్తుంది.

భారతీయ చిత్రశిల్పకళలు యావత్ ప్రపంచంలోనే విశిష్టస్థానాన్ని ఆక్రమించుకొన్నాయి. కళ అంతర్బుద్ధికి చెందిన కర్మ (Act of intuition). ప్రతికళకూ ఒక భావన లక్ష్యం ప్రధానోద్దేశంగా ఉ... యి. జీవితంలోనూ ప్రకృతిలోనూ కంటికి కనుపించే దానినుంచి లభించిన సూచననుంచి పాశ్చాత్య కళాకారుడుకి ప్రేరణ లభిస్తుంది. ఒకచో అది అతని అంతరాత్మనుంచి వచ్చినా వెంటనే అతడు దానిని ఒక బాహ్యాధారంతో అనుసంధిస్తాడు. భారతీయ కళాకారుడు ఆత్మలో, అనంతంలో దైవంలోవున్న దాన్ని వెల్లడిచేయాలని చూస్తాడు. ఆత్మను దాని ప్రకటనల ద్వారా, అనంతాన్ని దాని సజీవ పరిమిత ప్రతీకలద్వారా, దైవాన్ని ఆయన శక్తులద్వారా వెల్లడిస్తాడు. భారతీయ కళకు ఆత్మావలోకనమే ప్రధాన లక్షణం (P.No. 207 - Foundations of Indian Culture) భవన నిర్మాణాలు, దేవాలయ మసీదులు మొదలైనవి భారతదేశంలో ఉన్నత స్థితికి చెందినవి. శిల్పకళకు నటరాజ విగ్రహాలు చిత్రకళకు అజంతా చిత్రాలు భారతీయ చిత్ర శిల్పకళలు రెండు విధాలుగా వున్న ఊహాశక్తుల మధ్యవున్న తేడా అంతా అక్కడ ప్రదర్శితమైనది. మానసిక, ప్రాణిక భౌతికాలమీద మొగ్గు చూపేది యూరోపియన్ కళ. సూక్ష్మమై ఇంద్రియామభూతికి కూడా అతి తక్కువ శక్తితో ప్రస్ఫుటమయ్యే ఆధ్యాత్మికత మీద మొగ్గుచూపేదే భారతీయకళ. అందువల్లనే శివునకు ఐదు మోములు పదిచేతులు, విష్ణునకు నాల్గు చేతులు, బ్రహ్మకు మూడు తలలుగనూ రూపొందించియున్నారు.

ఆకాశాన్ని గురించి హిందువులు చెప్పిన సిద్ధాంతము "టేలర్" ప్రతిపాదించిన గుళికాఫేణ సిద్ధాంతమూ రెండూ ఒకటే. ఉదాహరణకు విద్యుచ్ఛక్తి రేఖలు ఆకాశంలోఏదేని

ప్రాంతంలో ఏకోన్ముఖ మవుతున్నప్పుడు అవి అడ్డదిడ్డంగా పోక ఏక కేంద్రాభిముఖంగా పోతాయి. ఇది చాలా ఆశ్చర్యం. ఎందుకంటే 'శివుని వెంట్రుకలు' అని తెలియబడే శక్తిరేఖలలో ఆకాశం వ్యాప్తమై వుందని తంత్రాలంటున్నాయి. శివుని వెంట్రుకలకు - ఆకాశ వస్త్రాన్ని సంకోచ వ్యాకోచాలకు గురి చేయగల్గిన సామర్థ్యం వుందని అవి అంటున్నాయి. ఆకాశాన్ని యూక్లిడేతర (Non-Euclidian) అర్థంలోభావించి, వక్రతాభావనను (Concept of Curvature) పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రం ఊహించగల్గింది గత శతాబ్దంలో మాత్రమే. కానీ శతాబ్దాలకు పూర్వం తాంత్రిక గ్రంథాలు ఆకాశ సంకోచ వ్యాకోచాలను పేర్కొన్నాయి - హేతువాద దృష్టితో పరిశీలించిన లేక అంతరిక్ష పరిజ్ఞానముతో విశ్లేషించినా దీని సాధ్యాసాధ్యాలు ఇప్పటికీ సందేహాస్పదమని - ఊహకందటంలేదని నా అభిప్రాయం.

Prof. H. ZIMMER గారి రచన Myths and symbols in Indian Art and Civilization పేజి నెం. 151లో శివుని నటరాజ వృత్యముపై వివరణ . . .

"Dance is an ancient form of magic. The dancer becomes amplified into a being endowed with supra-normal powers. His personality is transformed, like Yoga. The dance induces trance, ecstasy, the experience of the divine, the realization of one's own secret nature and finally merges into the divine essence". In our country the dance has flourished side by side with the severe austerities of the meditation grove, Siva therefore, the arch-yogi became the master of the dance". Zimmer further holds, "The dance is an act of creation. It brings about a new situation and summons into the dancer a new and higher personality. It has a cosmogonic function, in that it arouses dormant energies which then may shape the world on a universal scale. Siva is the cosmic dancer; in his 'Dancing manifestations' he embodies in himself and simultaneously gives manifestation to Eternal Energy. The forces gathered and projected in his frantic, ever - enduring gyration as the powers of the evolution, the maintenance and dissolution of the world. Nature and all its creatures are the effects of his eternal dance."

Pantomimic dance is intended to transform the dancer into what he impersonates. The war-dance turns the warriors into fearless heroes. Hunting dance assures the success of hunting. Dancers mimic the gods of vegitation, sexuality and rain.

The 'Dance of Siva' is full of meanings. The drum in the upper right hand connotes sound, the vehicle of speech. The upper left hand in Ardhachandra mudra, bears on its palm a tongue of flame. Fire is the element of the destruction of the world. The second right hand in Abhaya-mudra bestows peace and protection. The uplifted left foot signifies release and salvation of the devotee. Gajahasta-mudra remines us of Ganesa, the remover of obstacles. The dwarfish demon is symbolic of man's ignorance. The ring of flames and light signify the energy of wisdom. It is the transcendental light of the knowledge of truth. Siva's destruction is finally identical with release and there lies eternal peace and happiness.

Siva as the cosmic Dancer is the manifestation of eternal energy in its five activities, creation, maintenance, destruction, concealment, and favour. These five activities are symbolized in the positions of Lord's hands and feet. The upper three hands indicate, creation, maintenance and destruction. The planted foot is concealment and the upper lifted foot indicates favour. The flying arms and legs and the swaying of Siva's torso indicate the continuous creation and destruction of the universe.

భారతీయ నృత్యాలు పురాతన తాంత్రిక శక్తులతో కూడినవై యున్నవి. అందు నృత్తకుడు తన అద్భుత శక్తులను విస్తరించి ప్రదర్శించును. అతని శక్తియోగ మార్గమున ప్రోత్సహించబడి ప్రేరేపింపబడిన పారవశ్యమున అద్భుతశక్తిగా అంత్యములో ఆ పరాశక్తిలో ఐక్యము కాగల్గినది. భారతీయ సంస్కృతిలో నృత్యకళలు ఎన్నో భంగిమలు, రూపభేదములున్నా అవి అన్నీ ఆ నృత్యమూలగురుడైన ఆ శివునిలో కలియునవిగా నున్నవి. నృత్యము ఒక సృష్టిగా అది విశ్వసృష్టి పరమైన చర్యగా నిద్రాణమైన శక్తులను మేల్కొలుపు విశ్వ ప్రమాణంగా గుర్తించటమైనది. శివుడు విశ్వనృత్తకుడు. అతని

అభినయములో మూర్తీభవించిన ముద్రలు విశ్వశక్తులుగా అభినయించబడి అంతములేక విస్తరించు, వృద్ధి పరచు, లయము చేయు సృష్టి కార్యములను చూపు ప్రతీకగల నృత్యమే. మూకాభినయముగా చూపించు యుద్ధముద్రలు యోధుని భయరహితునిగా, వేటగానిని వేట సాఫల్యముగా, అధిదేవతల ఆరాధన పునరుత్పత్తి, వర్షసంకేతాలుగా చూపుచున్నవి.

శివుని నటరాజ నృత్యము పూర్తిగా అర్థవంతమైనది. అతని కుడి ఉపరితల చేతియందున్న డమరుక శబ్ద సంకేతముగనూ, ఎడమ ఉపరితల ముద్రనందుగల అగ్నిలయము చేయు నదిగానూ, కుడిభాగమున క్రింది కరము చూపు అభయముద్ర శాంతి రక్షణ సంకేతముగనూ, పైకెత్తిన ఎడమకాలు ఆరాధకుడిని తరించునదిగానూ, గజహస్త ముద్ర విఘ్నములను తొలగించునదిగను, కుడికాలు క్రిందనున్న వామన రక్కసుడు మానవుని అజ్ఞాన సారుప్యతతోనూ, పరీవృతమై యున్న అగ్నిజ్యోతులు వెలుగు, ప్రజ్ఞగాను, వాని కాంతి పుంజములు, సత్యము విజ్ఞానముగనూ చూపుచూ శివుని అభినయము ముగింపులేని విశ్వశాంతి, ఆనందముల సారూప్యముగనే ప్రకటిత మగుచున్నది.

శివుని విశ్వ సృష్టిపరమైన నృత్యము ఐదు భావములైన సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహములుగా అతని కర పద విన్యాసముల ద్వారా పై మూడూ కరములయందు సృష్టి, స్థితి, లయములుగనూ, స్థిరపాదము తిరోధానముగనూ, పైకెత్తి పెట్టిన పాదము అనుగ్రహముగనూ పరీవృత వలయ అగ్నిజ్వాలలోచేయు నృత్యము మొత్తము విశ్వసృష్టి. లయముల ఆద్యంతములు లేకుండా జరుపు సృష్టి కార్యముగనే తెలియుచున్నది.

తిరువళ్ళువరు - కురళ్‌లో మొదటి ప్రకరణ "దేవుని నిజస్వభావ వైభవం తెలిసిన ఎవరికి అవిద్యనిచ్చే ద్వివిధ కర్మలు అంటవు". దీనిని సాధించటమే జ్ఞానోదయం, జ్ఞాని అయిన వానికి దైవ ప్రకృతి, దేవుడు, ఆత్మ వేరు వేరు కాక ఒక్కటే. మూడు మలాలయిన కర్మమల, అనవమల, మాయా మలములను క్షాళన చేయటానికి యోగ దక్షిణామూర్తి మతం జిజ్ఞాసువులు అనుసరించవలసిన యోగమార్గాలను నిర్దేశించింది.

యోగి అయినవాడు 1) ఆసనం ప్రాణాయామ, 2) నిగ్రహం సంయమనం, 3) ఇంద్రియకవస్థులకు దూరం, 4) ధ్యానం - సమాధులను అభ్యసించవలసియున్నది. మానవ జీవిత దశలుగా 1) బ్రహ్మచర్య 2) గృహస్థ, 3) భక్తు 4) జ్ఞాన దశలుగా ఎరగవచ్చును.

ఈ విధంగా సర్వాంతర్యామిత్వంపై దేవుడు స్వచ్ఛందంగా విధించుకున్న కర్మల లేదా రాగముల పరిమితిని ధర్మయోగం లేదా నిష్కామ కర్మను ఆచరించటం ద్వారానే

అధిగమించగలరు. ఇది యోగ దక్షిణామూర్తి ప్రవచించిన హిందూమతం - భారతీయ మతం - "సాధకుని ఏకాగ్రత చాలినంత తీవ్రంగా ఉన్నపుడు ప్రతిదీ అందుబాటులోనే ఉంటుంది" (కురళ్ - 666).

**విహాయ కామాన్ య స్సర్వాన్**
**పుమాం శ్చరతి నిస్పృహ :**
**నిర్మమో నిరహంకార :**
**నశాంతి మధి గచ్ఛతి ॥**

కామమును జయించినవాడు గొప్పవాడు. అంతేకాదు కామమును ప్రకోపింప చేయు విషయముల గురించి జ్ఞానమును తృణీకరించునో అతను మరియు గొప్పవాడు. కామనల గురించి కామమును గురించి ఎటువంటి స్పృహలేనివాడు పరమశాంతుడని గీత బోధించుచున్నది.

అట్టి పరతత్వమును సాధన ద్వారా సాధించి లోకహిత కార్య నిమగ్నుడవు కావలెనని భావము.

క్రీ. పూ. దార్శనిక ప్రముఖుడు "సుయుగ్వారైక్య" ఉపనిషత్ కాలపు ప్రసిద్ధ ఋషి, ఇతనిని గురించి యజ్ఞావల్క్యుడు - దార్శనికుడు పసి పిల్లవాడిలా, నిర్లిప్త, నిస్వార్థ, అమాయక స్వభావంకలవాడుగా ఉండాలన్నాడు. ఇతడు ఆధ్యాత్మిక వాది మాత్రమే కాదు. నిఖార్సయిన భౌతిక వాద దార్శనికుడు. సుయుగ్వా విశ్వం యొక్క మూలపదార్థం -'వాయువు' - అన్నాడు. యాజ్ఞ వల్క్యుడి సమకాలికుడైన అనాక్సిమన్ (క్రీ.పూ. 588 - 524) కూడా విశ్వ మూలపదార్థం 'వాయువే' అన్నాడు. భౌతిక జగత్తును దేవతలగానూ, దానికి మూలం వాయువుగానూ, శరీరాన్ని ఆధ్యాత్మికంగానూ దీనికి మూలం ప్రాణంగాను చెప్పాడు.

జైనులు పదార్థవాదులు, బౌద్ధులు శూన్యవాదులు, వేదాంతులు బ్రహ్మవాదులు, మీమాంసకులు కర్మవాదులు, సాంఖ్యులు ప్రకృతి వాదులు, నైయాయికులు ప్రమాణవాదులు, వైశేషికులు అణువాదులు, యోగులు ఈశ్వరవాదులు.

వేదాల ప్రధాన ఉద్దేశ్యం మన ఆధ్యాత్మిక జ్ఞానానికి - ఆత్మ సంస్కృతికి (Self culture) తోడ్పడటమే. అది ప్రస్తుత అజ్ఞాన స్థితిలో మృతిచెంది, జ్ఞానంతో తిరిగి జన్మించాలనేదే వేద ఋషుల సందేశం.

ఈశావాస్యోపనిషత్ అన్ని ఉపనిషత్‌లకన్నా గంభీరమైనది. ఈ జగత్తు ఈశ్వరునికి నివాసమని ప్రకటించే ఈ ఉపనిషత్ సర్వేశ్వరుని గురించి జ్ఞానాన్ని అందిస్తుంది.

గీత కర్మ సన్యాసాన్ని బోధించటంతోపాటు, వ్యక్తిత్వాన్ని వదలుకొని పరమాత్మలో ఏకం. కావాలంటుంది.

**సర్వధర్మాన్ పరిత్యజ్యమా మేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥**

అనేదే గీతాసందేశం. అయితే ఈ ఆత్మ సమర్పణ తేలికగా వచ్చేది కాదు. దీనికి ధర్మజ్ఞానాలు ఆధారంగా ఉండాలని గ్రహించాలి.

సిక్కు మత గ్రంథం "ఆదిగ్రంథ్" లోని 'ఆశాకావర్' అన్న శ్లోకంలో లింగసమానత్వం, నీతి వైశిష్ట్యాన్ని కొనియాడుతూ మానవాళికి మహిళలే మూలమని వారికి దైవత్వాన్ని సంప్రాప్తింపజేసింది. సత్‌మార్గపథంలో పరమ గురుని చేరుకోగలమని తెలియపరచింది.

ఇలా అనేక దార్శనికుల విలువలు ఎన్ని రూపాంతరములలో ప్రతిపాదించినా మూలశక్తులయిన పంచభూతములలో అనుసంధించబడిన ప్రాణశక్తి - జీవశక్తి - శరీర ధారణ ద్వారా రూపాంతరమై తిరిగి ఆ పరములో ఐక్యత చెందు సంవృత్త కార్యంగా తెలిసికోగలము.

## ఈశ్వర నిరూపణం :

న్యాయ దర్శనంలో ప్రమాణ స్వరూపం విపులంగా, శాస్త్రీయంగా చర్చించి నిరూపింపబడింది. ఇందులో మొదటి సూత్రంలో -

**ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాంత**
**సిద్ధాంత అవయవ తర్క నిర్ణయవాద జల్ప**
**వితండా హేత్వా భాస చ్ఛల జాతి నిగ్రహ స్థానానాం**
**తత్త్వ జ్ఞానాత్ నిశ్శ్రేయ సాధిగమ :**

ఇవి షోడశ పదార్థాలు. వీటి తత్వ జ్ఞానము వలన నిశ్శ్రేయ ప్రాప్తికలుగుతుందని సూత్రార్థము.

"ప్రమాణం ప్రాణనిలయః" అని భగవన్నామాలలో శబ్దం కీర్తింపబడింది. ప్రమాణమంటే భగవంతుడు. భగవద్వాచకమైన ప్రమాణ శబ్దోచ్చారణం మంగళాచరణమే అవుతుంది. ఆప్తతముడైన ఈశ్వరుడే మొదటి ప్రమాణం. ఉదయనాచార్యులు - "శంకోర్మేష కలంకి భాః కిమపరైః తన్మే ప్రమాణం శివ". 'న్యాయ కుసుమాంజలి' యందు శివుడే తనకు పరమ ప్రమాణంగా కీర్తించాడు. శివుని కంటే ఇతరులైన మేధావులైన శాస్త్రజ్ఞులుండవచ్చు. ఎంత పండితులైనా వారు జీవులు. భ్రమ, ప్రమదాది దోషాలు తప్పవు. అట్టివారి వచనాలు ఏవిధంగా ప్రమాణాలౌతాయి? ఈశ్వరుడు, అతీంద్రియ ద్రష్టలైన మహర్షులు మనకు ప్రమాణం. భ్రమ ప్రమదాది దోషరహితమైన కార్యమే ఆప్తవాక్యము - అదే ప్రమాణం. ఈ సిద్ధాంతాన్ని బోధించటానికి "ఓం నమః

ప్రమాణాయ" అనుచు న్యాయ శాస్త్రారంభం చేయటం ఉచితమే. ఈ షోడశ పదార్థ తత్త్వజ్ఞానము వలన దివ్య భావన ప్రాప్తికలుగుతుందని తెలియజేయటమైనది.

అనురాగం సిద్ధించనిచో ఈర్ష్య క్రోధాదులు కలుగుతాయి. ఈ రాగాదులే దోషాలు. అనుకూల వస్తువు, వ్యక్తులపై రాగం, ప్రతికూలమైనచో ద్వేషం, వస్తుతః నిర్వికారమైన ఆత్మకు ప్రతికూలంగానీ, అనుకూలంగానీ ఉండదు. ఇట్లు రాగాదులచే ప్రేరితుడై శరీరము చేత హింస, మానసిక నేరం మొదగు అధర్మకార్యాల యందు జీవుడుప్రవర్తిస్తాడు. వాక్కుతో అసత్య భాషణం, దూషణములు, మనస్సుతో పరద్రోహ చింతన ఇవి అన్నీ అధర్మాలే.

బ్రహ్మజ్ఞాని అయిన జీవన్ముక్తునకు సర్వకామప్రాప్తి కలుగుతుందని అనగా బ్రహ్మజ్ఞాని ఆప్తకాముడౌతాడు. ఆప్తకాముడైన వాడు (ఆత్మనే ఈశ్వరభాసంగా జేసినవాడు) కొరతగినదేముంటుంది? కోరికలే వుండవు. అందువల్ల దుఃఖ ప్రాప్తియే వుండదు.

ఈశ్వరుడెవ్వరు? కార్య కారణ భావం దార్శనికులందరికి సమ్మతమే. ప్రత్యక్షంగా జగద్రూప మహత్కార్యం జరగటం తెలియుచున్నదే. కారణం లేకయే కార్యం జనించదుకదా! కాబట్టి జగద్రూపసృష్టి మహాకార్యానికి మూలకారణమైన సర్వజ్ఞుడగు ఈశ్వరుడున్నాడని తప్పక అంగీకరించాలి. చిత్ర విచిత్రమైనది ఈ సృష్టి. గగన, నగర, సాగరాదులు వివిధ స్వరూప, స్వభావాలుగల పంచభూతాదులై ప్రకృతి నియమ బద్ధమై క్రమం తప్పక అనాది కాలంనుండి ప్రవర్తిల్లుచున్నది. జడమయమైన ఈ ప్రకృతికి మూలకారణం ప్రధానమని సాంఖ్యులు అనుమాన ప్రమాణంచే నిరూపించారు. ఈ ప్రకృతి జడమే. ఈ జడమైన ప్రకృతికి కారణమేది? అనే విషయమై వారు మీమాంస చేయలేదు. కానీ లోకసిద్ధ న్యాయాన్ననుసరించి కార్యకారణ చేతనమైన ఒక నిమిత్త కారణముండవలె. అట్టి పురుష ప్రయత్నము లేక ఘట పదాది కార్యాలు తమంతటతామే జరుగవు. అట్టి చేతన కార్యప్రజ్ఞుడైన వాడే పురుషుడు కర్తగానున్నాడు. అతడే ఈశ్వరుడు.

ఈశ్వర నిరూపణ అంశములో "ముండకోపనిషత్తు' ప్రథమ మండలమున

**మం॥ యత్త దద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః**
**శ్రోత్రం తదపాణి పాదం ।**
**నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం**
**యద్భూత యోనిం పరిపశ్యన్తి ధీరాః**

సమస్త సృష్టికి కారణమైన దానినిగా జ్ఞానులు దేనిని తెలిసికొనిరో యది అదృశ్యము, అగ్రాహ్యము, అగోత్రము, అవర్ణము, చక్షుః శ్రోత్రములు లేనిది, నిత్యమైనది, సర్వగతము, సుసూక్ష్మము, అవ్యయము అగుచున్నది.

ఈ మంత్రమును గురించి ఒక్క మాటలోచెప్పవలెనన్న ప్రపంచమునందలి సమస్తగ్రంథములలో వర్ణించిన ఆ మహోత్కృష్టపరతత్వమునకు నీ శ్లోకము సంగ్రహవ్యాఖ్య అనవచ్చును. ఈ మంత్రములోని అర్థమును విపులముగా చర్చించినచో -

అదృశ్యత లేక అగోచరత - చూడదగిన వస్తువుని గానీ వ్యక్తినిగానీ మనము చూడగలము. అనగా మనము చూచుటకు అది ఒక వస్తువుగా నుండవలెను. ఆ పరమాత్మ అట్టి వస్తువుకాదు. కావున అది అదృశ్యము. మనలోనే కేంద్రీకృతమైన జీవశక్తిని మనము చూచుటకు ప్రయత్నించుచున్నాము. కానీ మనకు జ్ఞాన సాధనమైనదా శక్తియే. మనలో నుండు జ్ఞాత చూడబడుదానిని చూచుటకు నేత్రమనెడు దర్శన సాధనము ఉపయోగించుచున్నాము. కానీ ఆ సాధనము చేతనే ఆ సాధకుడు తన్నుతాను చూచుకొనలేడు. ఏలయన చూడబడునందంతయూ తనకంటే వేరైన విషయమై యుండవలయునుగదా! కాబట్టి ఆ పరమ సత్యమును, ఆ జీవనజ్యోతిని 'అదృశ్యం' అని వర్ణించియున్నారు.

**అగ్రాహ్యము** - అది అదృశ్యమైన యెడల మనస్సుచేతనైనా గ్రహించవచ్చునుగదా! అన్న సందేహం కలగవచ్చు. అందువల్లనే 'అగ్రాహ్యం' అనుపదముపయోగించబడినది. మనస్సా పరమ సత్యమును గ్రహించలేదు. మనస్సుకు గ్రహణశక్తి నిచ్చునదికూడా ఆ పరమ సత్యమే. సర్వశక్తిసంపన్నమైన యాత్మ మనస్సుకు కూడా గ్రహణ శక్తినిచ్చుచున్నది. కాన మనస్సు దానిని స్వతంత్రముగా గ్రహించలేదు. ఆ సత్యమును మనస్సు గ్రహించవలెనన్న ఆ సత్యము మనస్సు కన్నా భిన్నమై దూరముగా నుండవలెను. కానీ మనస్సు ఆత్మతో సంబంధములేకుండా పోవునో అప్పుడది 'జడ' పదార్థమగుచున్నది. అందువలన యాత్మ 'అగ్రాహ్యం'గా చెప్పబడింది.

**అగోత్రం** - ఆది వున్న ప్రతి వస్తువుకుసూ అంతము కలదగు చున్నది. సృష్టింపబడిన ప్రతి వస్తువూ నశించి తీరవలసినదే. కానీ అశాశ్వత, అమృత, సత్యము అంతములేనిది కాబట్టి ఆ పరమసత్యమున కొక గోత్రము అనగా 'ఆది' కల్పించుట పరిహాసాస్పదము.

**అవర్ణం** - గుణరహితమైనది. బుద్ధిచే ఊహించి, మనస్సుచే చింతించి, ఇంద్రియములచే గ్రహించునది భౌతిక రసాయనిక తత్వమే గుణము. అనగా ఆత్మచే ప్రకాశించబడు పదార్థముల యందుండునవే గుణములు. కావున శాశ్వతమైన నాశరహితమైన సత్య తత్త్వము గుణరహితమగుచున్నది.

**అచక్షుః, శ్రోత్రం, తదపాణి పాదం** - ఆ పరమాత్మ మనను కనబడనిది అనగా 'అదృశ్యము' అని ఇంతకు క్రితమే చెప్పబడినది. మనము దానిని చూడలేము కానీ అది మనలను చూడ వచ్చును గదా అన్న సంశయానికి ఆ పరమాత్మకు జ్ఞానేంద్రియములుగానీ, కర్మేంద్రియములుగానీ లేవు. కన్నులు, చెవులు కాళ్ళు చేతులు అన్నీ అతనిలో పనిచేయుచున్నవే కానీ తన అస్థిత్వము కొరకు ఆ పరమాత్మకు ఈ సాధనములతో పనిలేదు. తనను తాను తెలిసికొనుటకు ఆ పరమాత్మకు ఎట్టి సాధనములతో ఆవశ్యకములేదు. తన కన్నా భిన్నమైన విషయములు తనలో లేవు. క్రొత్తగా పొందిన జ్ఞానము చేత తెలిసికొనుటకు అతనిలో ఎట్టి అజ్ఞానములేదు. అతడు స్వయముగనే జ్ఞాన స్వరూపుడు మరియు సర్వ వ్యాపియగు నతనికి నెట్టి కర్మయుసంబంధమును, కర్మలనగా కోరికలయొక్క అభివ్యక్త రూపములే. ఆ పరిపూర్ణ సత్యము స్వయం పూర్ణత్వమునకు కర్మలు కూడా నుండవు.

నిత్యం, విభుం, సర్వగతం, సుసూక్ష్మం, తదవ్యయం - పైని నిర్ణీతములైన భావములనంగీకరించినవాడు తర్కపద్ధతిని సిద్ధాంతీకరించునపుడు ఈ నిత్యం, విభుం ఆదిగాగల విశేషణముల నంగీకరించి తీరవలసినదే. ఆది లేనిదనగా అంతములేనిదే అనగా శాశ్వతమైనది. అనగా 'నిత్యం' శాశ్వతమైనది సర్వవ్యాపి 'విభుం' అగుచున్నది. సర్వవ్యాపి అయినయెడల ఈ సమస్త పదార్థ ప్రపంచమున్నూ దానియొక్క వ్యక్త రూపమే అగుచున్నది. సర్వవ్యాపిత్వము సూక్ష్మత తత్త్వమును సూచించునుగాన అది 'సుసూక్ష్మము' అట్టిసూక్ష్మతమము నాశములేనిది అనగా 'అవ్యయము' అగుచున్నది. మనో బుద్ధ్యాతీతమై, యది విపులమైన పరమాత్మయొక్క ఇట్టి లక్షణమును "సాధన" చేయుటచే పవిత్ర బుద్ధిగలవాడు దీనిని తెలిసికొను ఆసక్తితో వెదకిన తప్పక అతనికిట్టి సత్యము సుగమమగుచున్నది.

ఆ అనుభవము అతి వివరముగనూ, సంపూర్ణముగనూ, కలుగుచున్నదనియే యిచట 'పరిపశ్యంతి' అను పదము సూచించుచున్నది. ఇట్టి అనుభవముచేత సాధకుడు 'నామ రూపాత్మకమైన ఈ సమస్త జగత్తుకు ఆ పరమాత్మయే మూలభూతుడు అని తెలిసికొనుచున్నాడు.

**భూతయోనిం** - ప్రతి కార్యమునకు కారణము కలదు. కారణము లేక కార్యము సంభవముకాదు. మనకు శ్రుతిపరంగా ఈ ప్రపంచమంతయూ మన బుద్ధులచే సృష్టించబడినదే. ఉన్నది ఆ పరమాత్మ ఒక్కటియే. అది అద్వితీయము, ఏకము అని ఆ పరమసత్యమొక్కటియే. అట్టి దివ్యజ్ఞానమే పరివేష్టితమైన ఋషి పుంగవు లెల్లరూ ఆ మౌనమునీంద్రుని నుంచి గ్రహించియున్నారు.

## ప్రథమయోగి - దక్షిణామూర్తి

అత్యంత ప్రాచీన నాగరికతలో పురాతన భారతీయ నాగరికతా విశ్లేషణలో ద్రవిడ నాగరికత ప్రముఖమైనది. ద్రావిడులు ఉత్తరాదికి వలస వెళ్ళారు. అక్కడ మహేంజోదారో, హరప్పా నాగరికతావిర్భావానికి కారకులైనారు. ఈ సిద్ధాంతాన్ని బలపరచటానికి అనేక సాక్ష్యాలున్నాయి. ముఖ్యంగా 'తుంగభద్రాలోయ - సింధూలోయ' నాగరికతలు మధ్యవున్న సారూప్యతను పేర్కొనవచ్చు. "బ్రాహ్మిలిపి తెలుగు భాషా లిపి' ' అనే అభిప్రాయం కూడా వుంది. (The Hidden heritage by K.C. Pandyan).

మహేంజోదారో, హరప్పా, చన్హూదారో నాగరికతా పర్యవేక్షణలో క్రీ.శ. 1921 నుండి 1927 వరకు "సర్ జాన్ మార్షల్" భారత పురాతత్వశాస్త్ర డైరెక్టర్ జనరల్‌గా పనిచేసియున్నారు. వారు పై నాగరికతలపై మూడు బృహత్ గ్రంథములను వెలువరించి యున్నారు.

క్రీ.శ. 1927 నుండి 1931 వరకు "J.H. Mackey", 1963లో "G.F. Dales" మహేంజోదారో ఖనన పరిశోధనలు నిర్వహించియున్నారు. మహేంజోదారో అనుపదము "Mound of the dead" "మృతిచెందిన దిబ్బ" అని అర్థము. 1951 - 56లో గుజరాత్‌లోని మహి, సబర్మతి వ్యాలి త్రవ్వకాల రాతియుగపునాటి గుర్తులు. మహేంజోదారో త్రవ్వకాలలో సుమారు 2000 ముద్రలు దొరకినవి. లోథాల్‌లో 210 ముద్రికలు దొరకినవి. ఒక ముద్రికపై యోగి సింహాసనా రూఢుడై వున్నాడు. అతని తలపై ఎద్దుకొమ్ములు గల కిరీటం వున్నది. ఏనుగులు, పెద్ద పులులు వివిధ జంతువులతని చుట్టూ వున్నవి. ముద్రికపై అనేక అక్షరములు కలవు - వాటి అర్థము శోధించి నేటివరకు ఎవరూ చెప్పలేదు. బహుశా ఆ ముద్రికపైనున్న దైవము 'పశుపతి అని అతడే శివుడని' అవి ఆనాటి మత చిహ్నములుగా గుర్తించబడినవి. మహేంజోదారో నాగరికత క్రీస్తుపూర్వం 5000 సం॥ల క్రితముదనియు, ఈ పట్టణమధ్యగా సింధునదీ పాయ ప్రవహించినట్లుగా నుండెను. మహేంజోదారో, హరప్పా, గుజరాత్, రాజస్థాన్, దక్షిణాపథ దక్షిణ భారతీయులానాడు పశుపతి నారాధించు నాగరికత కలదని తెలియుచున్నది.

సౌరాష్ట్రములో 17 సమాధులు కనుపించినవి. అందొక సమాధిలో రెండు అస్థిపంజరములు బయలుపడినవి. బహుశః సతీసహగమన పద్ధతి అమలులో నుండి వుండవచ్చును. క్రిష్టా జిల్లా ఏలేశ్వరంలోకూడా జంట అస్థిపంజరములుగల శవపేటిక లభ్యమయినది.

ఇచ్చట లభించిన దిగంబర దేవత మూడుముఖములు, కొమ్ములు కలిగి పీఠముపై ఆశీసనమై యున్నది. మతపరమైన భంగిమలోనున్న ఈ ప్రతిమచుట్టూ అనేక

జంతువులున్నట్లు, గాజులు తొడగబడిన హస్తముగల ఈ దేవత శిరోజములు నిడువుగావుండి దువ్వబడినట్లున్నవి. ఇది పరమశివుని అర్ధనారీశ్వరునిగా సూచించు ప్రతిమగల ముద్రిక ఇతడే పశుపతి.

మరొక ముద్రికపైగల దేవతా ప్రతిమ క్రింద కూర్చొనియున్నట్లు కనుపించుచున్నది. ఈ రెండు ముద్రికలపై యున్న దేవతా ప్రతిమలు దిగంబరముగా నున్నవి. సింధూ నాగరికతా ప్రజలు శివపూజలు చేసే వారని ప్రజలు శైవ మతానుయాయులని తెలియుచున్నది. శాక్త్యారాధనము అమలులో నుండెనని తెలియుచున్నది.

ఇచ్చట లభించిన స్త్రీ దేవతామూర్తుల ప్రతిమలు మాతృదేవతావిశిష్టమైనవి. ఇట్టివే బెలూచీస్తాన్ దక్షిణ భాగములయందు అసంఖ్యాకములుగా లభ్యమైనవి. జోబ్ లోయలో కాళీ మాతకు సంబంధించిన ప్రతిమలు, చిత్రములు కనుగొనబడెను.

ఇట్టి స్త్రీమూర్తి ప్రతిమలే నైలు, డాన్యూబ్, యూఫ్రటీసు, టిగ్రీసు నదీ పరివాహకములయందు కూడా లభించియుండుటను బట్టి సింధులోయ నాగరికత అక్కడ వరకూ విస్తరించినదని తెలియుచున్నది. బెలుచీస్థాన్ దక్షిణ భాగములందు కూడా లభ్యమైనవి.

వేదకాలానికి ముందు సామాన్య అనార్యమత తత్త్వం ఒకటివున్నది. దానినుంచి హైందవం, జైనం, బౌద్ధం వచ్చాయి అంటున్నారు. ఈ సామాన్య అనార్యమతాన్ని మొదట ప్రవచించి ప్రవర్థన మొనరించినవాడు సిద్ధులలో, యోగులలో ప్రధముడైన "దక్షిణామూర్తి" అతడే శివుడు.

ఎందరో రచయితల అభిప్రాయం ప్రకారం వేదాలకు పూర్వమే దక్షిణాదివారైన అతని శిష్యులు నలుగురు. ఆంధ్రా - ఒరిస్సా సరిహద్దులలో శ్రీకాకుళం దగ్గరలోగల మహేంద్రగిరులపై వసించిన యోగదక్షిణామూర్తి వద్ద శైవతత్వాన్ని తెలుసుకున్నారు. ఈ విధంగా శైవమతం ప్రపంచంలోనే అత్యంత ప్రాచీన సజీవమతం అని సర్‌జాన్ మార్షల్ అన్నారు. (The Hidden Heritage by K. C. Pandyan) అట్టి శైవమతం ప్రజాస్వామికం, నైతికం, మానవుల సమతా సహనాలతోకూడిన మతం. శైవం ప్రాచీన హిందూమతం. శివుడే మొదటి "అరుహన్" అని అనేక పరిశోధనా ఫలితాల ద్వారా వెల్లడైన సత్యము. మూడు సంస్కృతేతర మతాలు హిందూ, శైవ, బౌద్ధమతాలు తెలుగు గడ్డపై ప్రశాంతంగా ఒకదాని సరసన ఒకటి ప్రవర్ధమానమయ్యాయి. మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి మండలంలోని గొల్ల గంగాధరగుడి పురావస్తు శాఖ వారి ఒకే ప్రాంగణంలో మూడు మతాలకు చెందిన గుడులున్నాయి. శ్రీకాకుళం జిల్లాలోని ఆముదాల వలస మండలంలోని గాజుల-కొత్త వలస గ్రామం వద్ద వున్న సంగమేశ్వరాలయం కూడా

మూడు మతాలకు మూలం. బహుశా ఆ స్థలానికి సంగమేశ్వరం పేరు దాని వల్లే వచ్చియుండవచ్చు. ఈ గుడి క్రీ. శ. 12వ శతాబ్దికి చెందినది. (News Time - 7-1-1986 from Hyderabad).

యోగదక్షిణామూర్తి కాలం మొహంజొదారో, హరప్ప (క్రీ. శ. 1922లో బయల్పడినవి) నాగరికతల కంటే ముందరిది అనటానికి నిశిత సాక్ష్యాధారాలున్నాయి. ఇటీవల పరిశోధనలు తుంగభద్రాలోయ నాగరికతకు సంబంధించిన గుహ చిత్రాలు, కుడ్యలేఖ్యాలను వెలువరించాయి. ఇవి అన్ని విధాల సింధూ నాగరకతకు ముందలివిగనే కనుపిస్తున్నాయి. సింధూ నగరికత, తుంగభద్రా నాగరికత లిపుల మధ్య పోలికను తుంగ్రభద్రా నాగరికతకు చెందిన చిత్రాలు - పెరూ, కొలంబియా, ఈష్టర్ - ద్వీప కల్పాలకు చెందిన అటువంటి చిత్రాలతోడి పోలికను, ఫలకాలతో కనుపించిన విధంగా ఈ చిత్రాలను, లిపులను కర్నూలు జిల్లాలోని కర్నూలు, నంద్యాల, దోణ్ ప్రాంతాలలోని కేతవరం, పుడిచర్ల, కలువ బుగ్గ, సిద్దాలు గట్టి, చిన్న సిద్దులు, పెద్ద సిద్దాలు గుహలలోనూ, మహబూబ్ నగర్ జిల్లాలోని శ్రీశైలంకు ఎగువ భాగంలో కోలాపూర్ మండలం మాలచింతలపల్లి వద్ద కృష్ణానదీ పరివేష్టిత కొండదిబ్బల గుహలలోనూ చూడవచ్చు. రంగారెడ్డి జిల్లా కొక్కపేటలో, మెదక్ జిల్లా ఎడ్తనూర్, గాడిచర్ల వద్ద గంగి ఆవులబండ, గద్ద గుండులలో అటువంటి చిత్రాలు, లిపులు ఈ మధ్యనే కనుగొనబడినవి. ఆ గుహలపేర్లు సూచించినట్లుగా అవి అనేక సిద్దులు చరించినట్టివిగా వుండి యోగ దక్షిణామూర్తి సంప్రదాయాన్ని అనుసరించినట్టి వారైయుండ వచ్చని పరిశీలకుల భావన.

ఆర్యులు భారతదేశానికి వలస రాక పూర్వమున్న భారతీయ నాగరికత మొహంజదారో - హరప్పా నాగరికతలలో శివుని ఆరాధన, శివలింగ రూప విశ్లేషణలను "Sources of Indian Tradition - Vol. I లో "Brahmanism" అను శీర్షికన W.M. Theodore De Bary ఇలా వివరించియున్నారు.

As seen today, the earliest religious thought in India is konwn or deduced from Archaeological evidence, such as seals, Figuries, Tablets and other artifacts, belonging to a pre-Aryan Civilization which existed in the valley of the Indus River during the later part of the Third Millinnium B.C. The only conclusions which may be drawn with any certainty, however, from materials associated with the culture uncovend at the site of Harappa, are a pre-occuaption with fertility symbols (e.g. terra-Cotta figurines of prequant females, stone phallic symbols and the like) and the worship of a divinity similar to the God Shiva, the ascetic par

excellence of historic Hinduism. Who is frequently associated with a Bull and is also of ten represented by a phallic symbol. Besides representations of fertility symbols, which imply the existence of a Mother or Earth Goddes Cult, and the divinity reminiscent of Shiva. The Indus Civilization also seemed to attach religious significance to certain animals, such as the tiger, buffalo, Croco-dile, elephant and even multiheaded monsters and hybried crea-tures, as well as trees and auspicious symbols, such as the swas-tika. Some seals point to religious motifs found in Mesopotomia, such as the Gilgamesh legend, the IBEX (Wild goat), trefoil designs and others and suggest a possible origin of religious ideas even earlier than the datable artifacts of the Indus Valley Civilization. Though it is difficult to establish a definite continuity in the development of religious ideas in India dating from the Indus civilization to modern times, it is however, possible to distinguish a clearly non-Aryan-which may or may not be pre-Aryan source for many of the concepts which characterize that religion which is known as "Hinduism" in India today.

తమిళనాడులోని నీలగిరి కొండలలో ఇందుహత్తి, సుసిసిగుడి, సీగూరు, కొనవాక్కొరై మొదలైన గ్రామాలలో అటువంటివే కనుగొన బడ్డాయని ఇటీవల పరిశోధకులు తెలుపుచున్నారు. వీటిని మధ్య ప్రదేశ్‌లోని భింభేత్క గుహా చిత్రాలతో పోల్చారు. ఈ భింభేత్క చిత్రాలలో మానవుని అరచేయి పోలిన రేఖా చిత్రాలేకాక ధనస్సు, శరాల ప్రతీకలు కూడా కనుపించాయి. "ఋద్వేద శివుడు ధనుర్బాణాల ప్రతీకలోనున్నాడు". ఇదే తరువాత పాండ్య రాజులకు రాజముద్ర అయినది(Page no. 64, Cultural Heritage of India-By Haridas Bhattacharya).

మధురై ప్రభుత్వ వస్తు ప్రదర్శనశాల ఆవేక్షకుడు యస్, సులేమాన్ - కిదరిపత్తి, అలగర్, కారున్ కాలకుడి, తిరువద వైరుల కొండ గుహాలలో చారిత్రిక పూర్వ చిత్రాలను కనుగొన్నాడు. అతడి పరిశోధనల ప్రకారం అలగర్ గుహా చిత్రాలలోని త్రిశూలాలు - ఇండియాలోయ సంపత్తిలో కనుపించిన త్రిశూలాలతోనూ మతపరమైన సంబంధం కలిగ యుండవచ్చు " (Hindu daily 18-4-1986) ఆంధ్రా తమిళనాడులోని గుహా చిత్రాల లిపులు తెలుగు - తమిళం రెండింటి ప్రాచీన లిపులయి వుండవచ్చు.

అలా అనేక గుహచిత్రాల, రాతల వల్లనేమి, లిపి సంకేతాలవల్లనేమి భాషా విశ్లేషణలవల్లనేమి పురాతన "భారతీయ ఆధ్యాత్మిక యోగిగానెంచబడిన దక్షిణామూర్తిని అతని ఉనికి సర్వభారతం వెలసిందని తెలియపర్చగల్గివున్నాయి". ఇంకనూ అనేక చారిత్రక పరిశోధకులు ఎన్నో ఋజువులు చూపియున్నారు. ఇంకనూ పరిశోధనలు కొనసాగుచునేయున్నవి.

రాజస్థాన్‌లోని కరిబంగన్ త్రవ్వకాలు క్రీ.శ. 1961 నుండి 1969 వరకు నిర్వహించబడినవి. ఈ త్రవ్వకాల పరిశోధనలు జరిపిన వారు ప్రొ॥ B.B. లాల్, B. K. ధాపి అనువారు ముఖ్యులు.

ప్రొ॥ D. సేన్, B. B. లాల్‌గారి పరిశోధనలు కూడా పంజాబ్ స్టేట్, సట్లెజ్, సిరస వ్యాలిలో నాగరికతలకు దక్షిణాది పరిశోధనలో బయల్పడిన నాగరికతలకు సమకాలీనత ఆపాదించారు. దేశపాండే, S. R. రావుగార్లు కర్నాటకలోని మాలప్రభ వ్యాలి, చిత్రదుర్గ, త్రవ్వకాలలో లభించిన గుర్తులు గుజరాత్, రాజస్థాన్‌లలో లభించిన దానికి సారూప్యత ఆపాదించారు. B.C. సిన్హాగారి "Hinduism and symbol worship" పేజినెం. 107లో ఇలా వివరించి యున్నారు.

"According to Swamy Sivanandaji, LINGA is certainly not the sex mark. To quate him." The popular belief among foreigners is that the Siva Linga represents the phallus or the virile organ the emblem of the generative power or principle in nature. This is not only a serious mistake, but a grave blunder. In the post vedic period, the Linga became symbolical of the generative power of Lord Siva - Linga is the differentiating mark. (Page No. 355 - All About Hindiusm). లింగ పురాణమందు

ప్రధానమ్ ప్రాకృతిమ్ తత్ఛ యదాహ్వాలింగముత్తమమ్
గంధావర్ణారశై విహీనమ్ శబ్ద-స్వార్శాది - వర్జితమ్ ॥

(The foremost Linga which is primary and is devoid of smell, colour, taste, hearing, touch etc., is spoken of as Prakriti)

సంస్కృతమునందు 'లింగ' అను దానికి ఒక గుర్తుమాత్రమే. మరియూ స్వామి శివానందజీ తన అభిప్రాయంలో - "This vast world of countless forms is a Linga of the omnipotent Lord. LORD SIVA is really formless. He has no form of his own and yet, all forms are His forms. All forms are pervaded by Lord Siva. Every form is the form of Linga of LORD SIVA.

According to swamiji the SIVA LINGA has a mysterious power to induce concentration of the mind. The mind attains one-pointedness when it looks at the Linga. That is the reason why the ancient seers of India have prescribed LINGA for being installed in the temples of LORD SIVA. To quote Swamiji again " Linga is ony the outword symble of the formless being, Lord Siva who is the indivisible, all pervading, eternal, auspicious, ever-pure, immortal essence of this vast universe, who is the undying soul seated in the chamber of your heart, who is your indweller, inner most self or ATMAN and who is identical with the supreme Brahman (P.P. No. 355-356 - All about Hinduism and P. P. 356-357- Ibid).

సర్వజనీనతకు, సహనానికి ఆ మతం పేరు గాంచినది. మొయికండర్ శివజ్ఞాన బోదంల లాంటి రచనలలో శివుడే ప్రేమ కృపలను వారు బోధిస్తారు. యోగవిద్య ద్వారా మనిషి పరిశుద్ధుడగునని శ్రీ రామలింగఋషి చెప్పినట్లు శైవం అంటే "సమరస సన్మార్గం' ', "ప్రపంచ పౌరవాదం" (Cosmopolitanism) సర్వ మానవ సౌభ్రాతృత్వాలను ప్రతిపాదించిన "సంగం" సాంప్రదాయం. దానిని గాఢంగా ప్రభావితం చేసింది. ఉదహారణకు "కురళ్"ను హిందూమతసారంగా, పూనగంటనను, పురాణములుల సర్వ్యాలలో ఉంది. ఈ నగ్న సత్యము అధిక సంఖ్యాకుల గుత్తాధిపత్యంలో ఉండనవసరం లేదని అంటారు. ప్రొ. K.N. శాస్త్రి గారి అభిప్రాయంలో 'సంఘం' సాహిత్యం క్రీ. పూ. 500 నుండి క్రీ. శ. 500 వరకు ప్రభావితమైనదని.

ఏ గొప్ప మతమైనా న్యాయ, ప్రజాస్వామ్య సమతా బద్ధమైన సమాజంలో సమరస భావనతో మెలగవలెనని అటువంటి సమాజాన్నే అది ఎల్ల కాలం బలపరచగలదని నాప్రగాఢ విశ్వసం.

ఏ మతానికి తీసిపోని ఒక గొప్ప నీతిని శైవ సిద్ధాంతం, కురళీలు బోధిస్తాయి. వాటిని ఆచరణలో పెట్టి నల్వురకు ప్రచారం చేసినవారు మానవాళికి అమూల్య సేవ చేసిన వారవుతారు. ఒక జాతి భవిష్యత్తును తీర్చి దిద్దటంలో సమాజ, భౌతిక వనరులకంటే దాని వారసత్వం, భాష, తత్వం, మతం, సంస్కృతుల యొక్క ప్రభావం ఎంతో ఎక్కువ. 'భారతీయ ఆలోచనా విధానంపై తాత్విక చింతనపై ప్రకృతి హిందూమతానికి ఎంతో పట్టువున్నది. ఇంకా భారత ప్రజలు విధివాదాన్ని, పరలోకాన్ని పట్టించుకున్నంతగా "పని" ని గురించి పట్టించుకోరు. "నీ భావి జీవితాన్ని నీవే మలచుకోవచ్చు. మానవుని భవిష్యత్తుకు అతనే కర్త అనే విషయాలు భారతీయ సాంప్రదాయానికి వైదేశికాలు".

"ప్రథమయోగి దక్షిణామూర్తియని శైవ సాంప్రదాయం అంటుంది. అతడే శివుడు. దక్షిణామూర్తి అనగా కానుకలతోనూ, గౌరవముతోనూ సంభావింప తగిన గొప్పవాడు. పరముడని, పరమశివుడని, పరమేశ్వరుడని, సిద్ధేశ్వరుడని, యోగేశ్వరుడని, మహేశ్వరుడని, మహాదేవుడని, మహేంద్రుడని, మౌనమూర్తియని, గణమూర్తియని అనేక నామాలతో తెలియబడతాడు". తమిళ జైన సాహిత్యమైన "తిరుక్కుళం బహం' ' మొదటి పద్యంలో జైన ప్రథమతీర్థం కరుడైన "అరుహన్"తో శివుని సమంచేస్తుంది. (Page No. 154 of 'Tamilal Samaya Varalaru' By Velu Pillai)

శివుని యొక్క ప్రత్యేక రూపాలను, అలంకారాలను అతని యొక్క శక్తిసామర్థ్యాలను వివరిస్తూ "All About Hinduism" లో పేజి నెం. 355-356 లో Siva Icons అను శీర్షికలన ఇలా వివరించినది - Siva is the most powerful God of the trinity. His worshippers invoke him by a hundred names. As such is represented in icons in all possible forms ranging from benevolence to male volence. When in distress, the other two Gods need his help they lend him some of their own powers and Siva is then known as MAHAADEO.

Siva is generally seen with a tiger skin covering his loins, serpents encircling his body and an antelope held in left hand. Siva's special emblems are a batttle axe, a trident and often a bowl of human skull or a garland of skulls. He has a JATA-MUKUTA and wears the crecent moon as a part of his headdress. He has special armlets and bracelets to decorate his body. In his dances he may have more than four hands and is seen stamping with his foot on the body of a demon.

The Siva murties in Yoga-mudraa are known as Daksina Murtis and are in a sitting posture. In Vyakhyana - Daksina Murtis he is seated in restful pose carrying a Mala in the right and lotus in the left hand. The position of the legs varies in three different varieties of this image. Siva has been depitcted as a great teacher of music in Vinadhara Daksina Murti. వీణాధర దక్షిణామూర్తి గొప్ప సంగీత ఉపాధ్యాయునిగా వర్ణించియున్నారు.

హిందువులు తమ సిద్ధాంతాన్ని క్రీ. పూ. 3వ శతాబ్ది ఆరంభంలో పాటలీ పుత్రం వద్ద జరిగిన జైన సమావేశంలో - జైన మత సాహిత్యం తనను తాను "సిద్ధాంతము" అని

చెప్పుకుంది. దీనిని శ్వేతాంబర జైనులు అంగీకరించారు కూడా (శైవానుయాయులను శివుని త్రిశూలం, శివతంబరులని పిలచినట్లుగా, పేజి. నెం. 44 "The cultural Heritage of India" By హరిదాస్ బట్టాచార్య, వైశేషిక సంస్థాపకుడు కూడా తను బ్రహ్మాండమైన యోగంద్వారా మహేశ్వరుని దయను పొందిన తరువాతనే తన వైశేషిక ప్రక్రియను ఉపక్రమించానని చెబుతాడు. గౌతమ, కణాదులు శైవులని తొలికాలపు జైన రచయిత అయిన హరిభద్రుడన్నాడు. (పేజి. నెం. 68 - The cultural Heritage of India By Haridas Bhattacharya).

శైకల్యార్స్ "పెరియా పురాణం"లో శైవ ప్రవక్తల జీవితగ్రంథంలో వివరించబడింది. తిరుజ్ఞాన సంబంధర్ (క్రీ.శ.7వ ప్రారంభంలో) తిరునావుక్కరుసు (7.A.D.) సుందరమూర్తి (8.A.D.) మానిక్కవక్కరర్ (7th A.D.) నమ్మాల్వార్ (7th or 9th A.D.) ఆదిశంకర (788 A.D.) ఎందరో నాయన్మార్లు సిద్ధాంతాన్ని సర్వజన సమ్మతమైనదిగా ప్రచారం చేశారు.

ఈ విధంగా సిద్ధాంతంతోపాటు సాంఖ్యాయోగాలు "యోగ దక్షిణామూర్తి" బోధలనుంచి పరిణమించాయని చెప్పవచ్చు. "అలెగ్జాండర్ కండ్రటల్ - వేద మంత్రాలను వేద దేవతలను సృష్టించిన సంచార ఆర్యజాతి ప్రవేశించక ముందున్న భారత ఉపఖండంలో ప్రజలలో వున్న అనేక ప్రాచీన మత సాంప్రదాయాలను శైవ సాంప్రదాయం తనలో కలుపుకొని ఒకే జాతీయతగా ఏర్పడినదని భారతీయ శాస్త్రజ్ఞులు పూర్తిగా నమ్ముచున్నారు".

ఆదిమ భారతీయులు పూజించిన దేవుడు శివుని మూల రూపం కనుక శివభక్తులు "తమ దేవుడు వేదాలకంటే ప్రాచీనుడని" అనుకోవటం తప్పలేదని, ప్రాచీన భారత నగరాల త్రవ్వకాలు సూచిస్తున్నాయి. (Page. No. 182 of "The Riddles of three Oceans By Alexander Kondrator) అంతేగాక ఇంకా అనేక మంది పండితులు శైవ సిద్ధాంతంపై వెలిబుచ్చిన అభిప్రాయాలు ఈ విధంగా ఉన్నాయి.

"Hinduism and Symbol Worship"

By. B.C., Sinha

Gurukul Kangri University - Hardwar.

**Saivism :**

Siva the supreme God of the saivas, traces his ancestry to the pregnant womb of the ancient culture. To quote Sir John Marshall (Mohenjo-daro and the Indus civilization - Preface P - Vii) "Among the many revalations that Mohenjodaro and Harappa have had in

store for us, none perhaps, is more remarkable than the discovery that Saivism has a history going back to the chalcolithic age or perhaps even further still and that it takes its place as the most ancient living faith in the world". There is a view that Siva is the God of the Dravidians. The specian feature of Saivism from its very inception was the worship and meditation of the creative cosmic principle. The image of Sivalinga, found alost in all the Saiva temples throughout India, is only a plastic representation of self-existent truth.

The origin of Saivism is lost in obscurity. But it is clear that the historical Saivism is a blend of two lines of development, the Aryan and Pre-Aryan. In the words of K. A. Nilakantha Sastri (The culture Heritage of India - P. No. 63). "It is not a single cult, but a federation of allied cults. Whose practices range from the serenest form of personal life in faith to the most repulsive excesses that alienate one's sympathy for the cult. The hold of Saivism extends not only over the whole of India, from the Indus Valley to Bengal, but stretches out across the sea to Grater India and the Archipelago, and beyond the northern mountains to central Asia".

"The characteristics of Saivism are the exaltation of Siva above all other Gods, the highly concrete conception of the deity and the intensely Personal nature of the relation between him and his devotees". These traits are most clearly found in Swetaswatara Upanisad. Just as the Gita Voices the intense theism of Vaisnavism, so does the Swetaswatara expend the supermacy of Siva. On the one hand, Siva is here identified with the eternal Absolute on the other hand he is the God of all Gods, potent for good and evil. Soon he come to be regarded as the creator of the world, its instructor and redeemer. To quote Mulk Raj Anand (The Hindu view of Art. P. 48). "The human soul attains pure bliss by uniting with him and through gradual renunciation of the world, exercising Bhakti and by seeing every thing in Him."

Saivism is more deeply rooted in vedic literature than vaisnavism. In fact Siva is the heir of Rudra, whom we found in connection with the Maruts. This Rudra is celebrated in a hymn in Yejurveda. Here he appears as a being who lives on the mountains with his followers, and whose protection is sought for house and farm and for all sorts of business. He is not the God of a sacerdtal religion, but a lord who reveals him self to herdsmen and water-bearers. His two sides are here clearly marked. Hi is a saviour, who gives pleasure and turns away sorrow. He is a destroyer, who is justly feard. Rudra in Rigveda is a terrible God, and much supplication was needed to humour him in to a good temper. (Macdonnel - Vedic Mythology Page No. 77). There is none more powerful than the Rudra. The Rigvedic Rudra exhibits more of the traits of the Rudra-Siva of later times. In the Yajurveda, we meet with stories concerning Rudra's exploits, such as killing the Asuras and destroying their cities. But it is the Satarudriya which draws together all the floating conceptions regarding Rudra-Siva of the early vedic times and provides a bresh starting point for new development.

The form of Siva is terrible. He dwells on the Kailaasa with his wife parvati and numerous ganas. His power threatens people with various dangers. He has three eyes, serpent round his body and skulls round his neck. He represents the annihilating power of nature. lard Krishna himself figures as the chief devotee of Siva. The dance of Siva which is the highest ideal of the art of dancing represents, "a dramatisation of the five activities evolution, continuation, destruction, illusion and enlightenment-which constitute the world process. (Kumaraswami-Dance of Siva P.P. 56, 57)

Savism found its way in the islands of the Eastern Archipelago and in the Hinduized states of grater India at a very early date. Fa-Hin found the PAASUPATAS established in JAVA early in the fifth century A. D. The early Hindu kingdoms of Champaa,

was ruled by Saiva kings. The dominant cult in Kambuja was saivism. In the western. India preacher who became famous as LAKULISA. He is the founder of PAASUPATA SECT of saivism.

2. శైవాదం ప్రపంచంలోకెల్ల అత్యంత సజీవ ప్రాచీన విశ్వాసం.

- "సర్ జాన్ మార్షల్".

3. ద్రవిడ బౌద్ధిక ఉత్పత్తులలోకెల్ల అత్యంత పరిణీయమైనది శైవ సిద్ధాంతతత్వము, భారత దేశ మతాలలోకెల్ల నిశ్శందేహంగా అత్యంత సహజమైన విలువగలది, ప్రభావితమైనది, విపులమైనది శైవసిద్ధాంతం.

- డా॥ జి. యు. పోప్".

4. మానవ చింతనలో పరిపూర్ణత, ప్రతిభావంత దర్శనాలలో శైవ సిద్ధాంతాన్ని అగ్రగణ్యంగా పరిగణించవచ్చు.

- డా॥ కెమెల్ వ్యాలి బిల్"

5. మనకు లభించిన వాటిలో శైవసిద్ధాంతం లాంటిది మరో దర్శనంగానీ, విశ్వాసంగానీ, పూజా విధానంగానీ లేవు. దీనికి గొప్ప ప్రాచీనతకు ఉండే శ్రేష్టతలు ఉన్నాయి. ఒక మత దర్శనంగా విశ్వాసుల జీవిత అభివ్యక్తిగా శైవసిద్ధాంతమంతటిది దక్షిణ భారతదేశంలో మరొకటిలేదు. వాస్తవానికి ఇండియా మొత్తంలో దాని అంతర్గత శ్రేష్టతల ఆధారంగా శైవ సిద్ధా:తాన్ని "భారతీయ చింతన జీవనాల జలరేఖగా అంటే ఔన్నత్యరేఖగా పరగణించటం తొందరపాటు కాదు. - "*Dr. W. H. Goldy*"

6. నాకు తెలిసినంతలో ఏ సాహిత్యం కూడా వైయుక్తిక మత జీవితాన్ని - దాని పెనుగులాటను, విషాదాలను, దాని ఆశాభీతులను దాని విశ్వాస విజయాలను అంతస్వేచ్ఛగా అంత ప్రగాఢంగా వర్ణించలేదు.

- సర్ చార్లెస్ ఇలియట్

7. ఇతర దర్శనాలకు తెలియని పదార్థాలను పరిగణలోనికి తీసుకొనుట ద్వారా ఈ సిద్ధాంత ఔన్నత్యం స్థిరీకరింపబడింది. ఉదాహరణకు సాంఖ్యం - 24 పదార్థాలనే గుర్తించింది. యోగం కూడా అంతే సంఖ్యను మొత్తం మీద గుర్తించింది, అదనంగా అది దేవుని ప్రతిపాదించినప్పటికీ, పాంచరాత్రం ఇంకా ఇతర ఆగమాలు ఇంతకంటే ఇంకా ఎక్కువ పదార్థాలు గుర్తించవని, ఆ సమయంలో "సిద్ధాంతం" ఒక్కటే 36 పదార్థాలను గుర్తిస్తుందని భావించారు. ఈ 36 పదార్థాల జ్ఞానంవల్ల "శివైక్యాన్ని" అంటే అంతిమ ముక్తిని పొందవచ్చు.

- ఆచార్య *N. N.* సూర్యనారాయణ శాస్త్రి

శైవ పరహితేచ్ఛ, బౌద్ధ అనుకంప, జైన అహింస, క్రైస్తవ సహానుభూతి, ఇస్లామ్ సమతావాదం మొత్తం మానవాళి ఉమ్మడి వారసత్వం. ఒక దేశం ఎలాగైతే శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞానాన్ని ఇతర దేశాలనుండి ఆర్జించి దానిని తన దేశ జాతి యావత్తుకు ప్రయోజనం పొందించటానికి తోడ్పడాలి. వాటిని జాతి ప్రయోజనాలకై వెచ్చించే మంచి మనసు కావాలి. అంతరాత్మలలో కనీస పరివర్తనలు లేకుండా కలకాలం కొనసాగే ఆధ్యాత్మిక ప్రగతికి అర్థంలేదు. అలాగే మనకు మత బోధనలలు ముఖ్యంకాదు, అందుదహరించిన ధర్మాచరణమే ముఖ్యమని గ్రహించాలి. ఈ సూత్రాలలో ప్రథమంగా లోపించినది ప్రేమ సూత్రం. దేవుడే ప్రేమయని మన ప్రాచీన వారసత్వం నొక్కి చెప్పింది. 'అంబే శివమ్' శివుడు ప్రేమ వేరుకాదు. భగవంతుని ప్రేమ ద్వారా పొందవచ్చు, దర్శించవచ్చు, కేవలం చింతన ద్వారా ఎప్పటికి పొందలేవు. మానవాళి కోరుకునే వాటిలో కెల్లా ఇది అత్యంత ఆవశ్యకమైన గొప్ప వారసత్వం. దీని వలన మనిషిపరిపూర్ణుడుకాగలడు. తనను ఎప్పుడయితే పరిపూర్ణునిగా చేసికొనగలడో తన అంతరంగంలోనే ప్రేమ పూరిత ఆలయాన్ని నిర్మించుకోగలడు. అది సకల చరాచరములపై తన ప్రేమ భావాన్ని విస్తరించి వ్యాపించగలదు. అది నేటికి భ్రాంతిగానున్నా, రేపటి రోజు సత్యంగా ప్రకాశించగలదని భావిద్దాం.

నేటి దివ్య జ్ఞాన సమాజ స్థాపకులలో సుప్రసిద్ధులయిన మేడమ్ బ్లావట్స్కీ మనకు బ్రహ్మ విద్యను క్రొత్త రూపంలో మౌనవాణి (దివాయిస్ ఆఫ్ సైలెన్స్, అను పేరు **1889**లో ప్రచురించి అందించారు. ఇదే పాశ్చాత్య దేశాలలో టిబెట్టు రహస్య వాదము (టిబెటన్ మిస్టినిజమ్), బౌద్ధ రహస్య వాదము (ఈసోటెరిల్ బుద్ధిశమ్) అనుపేర్లలో ప్రసిద్ధిచెందినవి. ధ్యాన శ్లోకసంహిత (ది బుక్ ఆఫ్ ది స్టాంజాస్ ఆఫ్ జ్యాన్) సువర్ణోపదేశ సంకలనము (ది బుక్ ఆఫ్ ది గోల్డెన్ ప్రిసెప్ట్స్) ఈ రహస్య శాఖకు చెందిన ముఖ్యగ్రంథాలు, వీటిసహాయముతోనే మేడమ్ బ్లావట్స్కీ గుప్త విద్య (ది సీక్రెట్ డాక్ట్రిన్) మౌనవాణి ( ది వాయిస్ ఆఫ్ సైలెన్స్) అను ప్రామాణిక గ్రంథాలు రచయించి మానవాళికందించారు.

విదేశీయులు భారత దేశమును దండెత్తిన కాలంలో బౌద్ధ విహారాలెన్నో ధ్వంసముచేయబడినాయి. బౌద్ధమత గురువులనేకులు టిబెట్టు, నెపాల్ దేశములకు తమ వద్దనున్న బౌద్ధమత గ్రంథాలను తీసికొని వలస వెళ్ళారు. అట్టి విశేష గ్రంథాలలో నిక్షిప్తమైయున్న జ్ఞాన భండారమంతయూ పురాతన హైందవ మతంనుండి వలస వెళ్ళి నదనే భావించారు.

ఆత్మశక్తి (బ్రహ్మశక్తి) యొక్క విలాసమే ఈ విశ్వం ఈ విశ్వంలోని నిత్య సత్యమైన ఏకత్వం, మానవ సహజమైన అజ్ఞానం, భ్రాంతి మూలకంగా గోచరించే అనేకత్వంలో ఎలా సమన్వయంచేయబడిందో చింతన చేసి తెలిసికొనుడు. ఆధ్యాత్మిక

మార్గాలు శ్రేయోదాయకమనేవి ముమ్మాటికి నిజం. ఇదే గుప్త విద్యలోని చర్చనీయాంశం. కానీ పరబ్రహ్మము అను మాటకు ఊహకందని పరమతత్వమైనందున దానిని దైవ భక్త్యావేశములేని సాధారణ మానవులు తమ నిత్య జీవితంలో సాక్షాత్కరించుకొనలేరు. అట్టి తరి మౌనవాణి ఈ కొరతను తీర్చగలదు. కానీ ఏమి చదివినా, ఎంత విన్నా, నిస్వార్థ, నిరహంకార, సర్వాత్మభావం లేనిదే ఆధ్యాత్మిక గ్రంథాల లోతు తెలుసుకోలేము.

మౌనవాణి అన్నప్పుడు మౌనమంటే ఏమిటనే అనుమానం ఎవరికైనా కల్గుతుంది. సన్యాస పూర్వకంగా గ్రహించబడే ముని ధర్మమే మౌనమా? లేక ఇంద్రియ, మనో ప్రాణాలను నిగ్రహించుట మౌనమా? ఈ ప్రశ్నలకు 'సనత్సుజాతుడు' ఇలా సమాధానమిచ్చారు. (సనత్సుజాతుడు - యోగదక్షిణామూర్తి యొక్క ప్రాక్తవ చతుష్టయములోని వానిగా గ్రహించగలరు).

**యతో నవేదా మనసా సహైన**
**మను ప్రవిశంతి తతో థ మౌనమ్** (మ. భా. ఉ. 1-42-2)

ఎవని స్వరూపమును వేదములు సమగ్రముగా తెలుపజాలదో, ఎవనిని మనసులు గ్రహింపజాలవో ఆ పరబ్రహ్మమే మౌనశబ్దమునకు అర్థము.

అట్టి మౌన స్వరూప పరబ్రహ్మ తత్త్వమును అపరోక్షముగా సాక్షాత్కరింప జేసుకొనుటకు మౌనబోధయే శరణ్యమని తెలియజెప్పుటకే శ్రీ దక్షిణామూర్తి శ్లోకంలో శ్రీ శంకరభగత్పాదులు మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం'' అన్నారు. శబ్దరూపంలో ఉండని నిశ్శబ్దాను భూతికే మౌనవ్యాఖ్యా, మౌనవాణి అని పేర్లున్నాయి. మౌనం శబ్దార్థాలు ఏకమైన స్థితి లేక శబ్దమే అర్థంగా భాసించేస్థితి, మౌనవాణి - నిశ్శబ్దోపదేశము - సమాధి భాష - ఆత్మబోధ సమానములే. అంతర్ముఖుడైన యోగసాధకునికి ద్వంద్వ రహిత స్థితి - ఏకాత్వానాభూతి ఆత్మారామత్వము సిద్ధించును. ఏకత్వాన్ని అనుభవిస్తున్నవాడే నిర్భయుడై అనగా శోక మోహాలను వీడి ఆనందం అనుభవిస్తాడు. ఆ ఆనందమే స్వచ్ఛస్ఫటిక సదృశమైన జ్ఞానం. దీనినే కేవల జ్ఞానమంటారు. కావుననే విజ్ఞులు, కేవల జ్ఞానం, ఆనందం, శాంతం, మౌనం, సమాధి, నిర్వాణం, పరబ్రహ్మం సమానార్థాలుగా ప్రకటించారు.

**"మునయే ఆత్మారామాయ - కిం సాధనవశేన,**
**నహి నహి మౌనశీలినే, మౌన మాత్మారామతా,**
**తత్స్వ భావాయ"** అని శ్రీధర స్వామి వ్యాఖ్యానించారు.

మౌన మనగా ఆత్మారామత్వము (ఆత్మయందు రమించుట), అది స్వభావసిద్ధమేగానీ సాధన సాధ్యముకాదు. మహాత్ములు ఆత్మారాములై, మౌన రూపులై, మౌనబోధచే సర్వసందేహములను తీర్చెదరు.

దివ్య జ్ఞాన మహాత్ములనబడేపరిపూర్ణ మానవులు ఈ ప్రపంచమున ఎల్లప్పుడూ ఉండి ప్రపంచ సంరక్షణా బాధ్యతలను నిర్వహిస్తుంటారు. శ్రీ శంకరాచార్యుని వివేక చూడామణిలో

**శాంత మహాంతో నివసంతి సంతో**
**వసంత వల్లోకహితం చరంతః**
**తీర్ణాః స్వయం భీమ భవార్ణవం జనా**
**నహేతునాన్యానపి తారయంతః** (వి. చూ. శ్లో - 39)

ఇంద్రియవ్యాపారములను నిలిపివేసి, వాసనా రహితులై అనగా ప్రశాంతచిత్తులైన మహాత్ములు పత్ర పుష్ప ఫలములతో కూడి లోకహితము కల్గించు వసంత ఋతువువలె లోకోపకారము చేయువారు, వారు భయంకరమైన సంసార సాగరమును స్వయముగా తరించి ఇతరులను తమ నిర్హేతుకమైన కటాక్షముతో తరింపజేయటానికి ఈ ప్రపంచమున సదా కలుగుచుంటారు - అని భావన.

## ప్రాక్తన చతుష్టయం

దక్షిణామూర్తి శిష్యులెవరు? మెయి కంద దేవర "శివజ్ఞానబోధ" ఆవాహన గీతంలో "వటవృక్షం క్రింద కూర్చున్న నిశ్శంకుడు ప్రసాదించిన అసంస్కృత, అసమాన కుసుమాన్ని ఋషిపుంగవులు అలంకరించుకుంటారు".

ఇక్కడ సూచితమైన అసమాన కుసుమం శివలింగాకృతిలో వున్న శివుని మూడవ నేత్రంగానే భావించాలి. యోగానికి అంతిమదశ అయిన సమాధ్యావస్థలో భ్రూమధ్యంలో యోగికి ఈనేత్రం ఉన్మీల మౌతుందని భావించబడుతుంది. అత్యంత యౌగిక అనుభవం అంతిమ పరాకాష్టగా మెదడులోని వివిధ శక్తి కేంద్రాల పరస్పర చర్యకారణంగా ఈ విశ్వచేతన కుసుమంగా వికశిస్తుందని వివరించబడింది. ఒక శిల్పి శాస్త్రంలోని మరో అభిమంత్రణ గీతంలో "సత్యం పరిపూర్ణతకు అవతారమై దానిని వటవృక్షం క్రిందకూర్చున్న ఋషిచతుష్టయానికి ఆవిష్కరించిన "పరమ్"ను ప్రతిఒక్కరూ దైవంగా అంగీకరించారు. జ్ఞానం ద్వారా అవిద్య నశించగా వివేక బుద్ధి ప్రాప్తించుటతోడనే పురుషునకు ఆత్మజ్ఞానం కలిగి తాను 'నిర్లిప్తుడు, నిస్సంగుడ'ని తెలిసికొంటాడు.

**మం॥ సంప్రాప్యైనం ఋషయో జ్ఞాన తృప్తాః**
**కృతాత్మానో వీత రాగాః ప్రశాంతాః।**
**తే సర్వగం సర్వతః ప్రాప్యధీరాః యుక్తాత్మనః**
**సర్వమేవా విశన్తి ॥**

శ్రీదక్షిణామూర్తినుండి ఋషులు ఆత్మతత్త్వమును పొందిన పిమ్మట జ్ఞాన తృప్తిని పొందినవారై తమను ధన్యులుగా భావించుకొనుచున్నారు. నిష్కాములై వారు ప్రశాంతులగుచున్నారు. సర్వవ్యాపియైన యాత్మను సర్వత్ర చూచుచున్నవారై తాము స్వయముగా నాయాత్మ తత్త్వమునందుస్థిర పడుచున్నారు.

మహేంద్రగిరిపై మఱ్ఱిచెట్టు క్రింద కూర్చున్న తన శిష్య చతుష్టయానికి దక్షిణామూర్తి "పరమ్" ఉపదేశం కావించాడనిచెప్పబడింది.

ఇక్కడ చెప్పబడిన శిష్య చతుష్టయం 1) సనగర్ (సనక) 2) సనందర్ (సనందన) 3) సనతర్ (సనాత్సూజ) 4) సనత్ కుమారర్ (సనత్ కుమార) లనే విషయంపై అన్ని శైవ గ్రంథాలు ఏకాభిప్రాయాన్నే తెలియజేస్తున్నాయి. వారంతా యోగానుభవ అంతంలో ఋషిస్థితిని సాధించారని చెప్పటానికి వారందరికి "సన్" అనే ఉపసర్గ తగిలించబడింది. యోగమార్గాన్ని శివజ్ఞాన సిద్ధులు "సన్మార్గ"మని వ్రాకుచ్చారు. ఆ ఉపసర్గమ తీసివేసినట్లయితే వారు - నాగ, నంద, నాథ, కుమారులవుతారు. "నాగ" నామం బౌద్ధంలో బహుధాప్రసిద్ధి అలాగే జైనంలో "నాథ" హైందవంలో 'నంద' కుమార' ' నామాలు ప్రసిద్ధం.

వాస్తవానికి ప్రాచీన భారత దేశ చరిత్రలో పేర్కొన్న అత్యంత గొప్ప రాజవంశాలు నాగులు, నందులు, బుద్ధుని జీవిత చరిత్ర వ్రాసినవాడు ఆనందుడనేది జగద్విదితం. రాజా హర్షుడు తన బౌద్ధాకృతిని "నాగానందం" అన్నాడు. ఇందు త్యాగం మహోన్నతమైనదని తెలియచేయబడింది (జీముత వాహనుని కథ) విజిత ప్రజలు ఎందుకు రహస్యంగా తమ మత విశ్వాసాలను కొనసాగిస్తున్నారో ఈ నాటకం ఇతి వృత్తం చెబుతుంది. భ. గీ. ॥ 10 ప్ర. 24 శ్లో. శ్రీ కృష్ణుడు "సేనానులలో నేను స్కందుడను మయూర వాహనుడు, శూల నియంత్రకుడునయిన శివకుమారుణ్ణి" అతడే శివకుమారునిగా, ఇంద్రసేనానిగా అభివర్ణితుడైనాడు. శాతవాహన యుగంలో రచించబడిన తిరువళ్ళువర్ - తిరుక్కురళ్ హిందూ మతసారంగా అభివర్ణించవచ్చు.

## అణచబడ్డ వారసత్వం

కృష్ణలోయలో బ్రాహ్మణ విశ్వాసాన్ని ప్రతిబింబించే మొదటి దేవాలయ సముదాయం ఆపస్తంభూజ అఘోరమూర్తి శివాలయం, క్రీ. శ. మూడవ శతాబ్ది అంతంలో అభిరమంత్రి శిష్య శర్మ దీనిని నిర్మించినట్లు శాసనం.

ఋగ్వేద కాలమున పూజింపబడిన రుద్రుడు, శ్వేతాశ్వరోపనిషత్తులో ప్రశంసింపబడిన శైవ మత సంబంధియగు పరమేశ్వరుడు రెండు కాలముల యందు పూజింపబడిననూ, క్రమ పరిణామమున మార్పు చెందినట్లు భావించవచ్చును. యజ్ఞయాగములు తదితరవైదిక కార్యకలాపములానాడు ప్రాముఖ్యము సంతరించుకొన్నవి. దేవతలలోకొందరు యజుస్సామ వేదముల కాలమునాటికి ప్రాముఖ్యము కోల్పోయినారు.

ప్రజాపతి యజ్ఞ నిర్వహణలో ప్రధాన పాత్ర వహించును. ప్రజాపతి కన్నా ప్రజలారాధించు రుద్రుడు శివునిగనూ మహేశ్వరునిగనూ ప్రధాన దైవంగా పరిగణించబడినారు, తరువాత కాలమున విష్ణువు ప్రధాన ఆరాధ్య దైవంగా రూపొందినాడు.

శివుని మొదటి బ్రాహ్మణ పరప్రతీక చిత్తూరు జిల్లా రేణిగుంట దగ్గరగల 'గుడిపాలెం'లో క్రీ.పూ. 3వ శతాబ్దిలో నిర్మించబడ్డ శైవ దేవాలయంలో ఈనాడు మనకు లభిస్తుంది. "ప్రాచీన శైవ కళా వాస్తు వికాసం" అనే తన గ్రంథంలో (The Development of erly Saiva Art and architecture - Published by Sundeep Prakasan - Delhi - 1982) మరియు Page No. 32 of "Essays on SouthĪndia" by Burton Stein దీని ఆధారంగా పేజి. నెం. 55లో I. K. Shárma చెప్పినట్లు అన్ని ఆగమాలలో అవశ్యంగా భావించబడిన యాజ్ఞోపవీతం, మూడవ కంటితోపాటు అదృశ్య కావటం ఈ శిల్పంలో కనుపించే విశేషం. ఇక్కడ చెక్కబడ్డ శివుని నగ్నరూపం బహుశ్యా ఋగ్వేద శిశ్నదేవ లేదా మహానగ్న లేదా బహుళ బిక్షాటన రూపాన్ని ప్రస్ఫుటం చేయటానికై ఉద్దేశించి ఉండవచ్చని తన అభిప్రాయముగా వెళ్ళబుచ్చాడు.

ఒకే విశ్వకర్తకున్న సృష్టి, స్థితి, లయలు ముగ్గురు మూర్తులకిచ్చారు. అందులయకారకుడైన రుద్రుడు మండుచున్న స్మశాన వాటికలో మానవ కపాలాల కోసం పర్యటన చేసే స్మశాన దేవునిగా శివుని వర్ణించారు. అతనికి కపాలేశ్వర నామం కూడా ఇవ్వబడింది. నాగ ఋషి సర్పంగా పరివర్తమై శివుని మెడకు అలంకారమైనాడు, నందరుషి ఎద్దుగామారి శివుని మూక వాహనమైనాడు. నాద ఋషికి ఏనుగు ముఖాన్నిచ్చి భూతనాదుణ్ణి చేశారు, అతనే గణపతి అన్నారు. కుమార ఋషికి ఆరు ముఖాలు ఆఋసేనారక్షణ దుర్గాలనిచ్చి సేనానాయకుని జేసింది. ఆర్య ఆగమాలకు పూర్వమే భారతీయ ఆధ్యాత్మికత చింతనలలో ఉత్కృష్టమైన, శక్తిశాలి అయిన దేశీయుని స్వశక్తితో ఎదుర్కొన లేక అతనిని గణాధిపతిగా, స్మశానవాసునిగా తాము నిల్పిన అధిదేవతలలో తక్కువవానిగా చూడబడుట. అతని బృందాలను, ఉనికిని కించపరచే విధంగా ప్రచారం చేసింది స్కంధ పురాణం - విష్ణుపురాణంకూడా దాదాపుగా స్కంధ పురాణం తీరులోనే నడచింది. ఇలా బహుపురాతనమైన, శక్తి వంతములైన భారతీయ పురాతన సంస్కృతీ, నాగరికతలను కాలానుగుణంగా అనేక తీరుల వక్రీకరించబడి నేటి తరం వారా వాస్తవాలు తెలుసుకోలేనంత దృఢంగా విశ్లేషించి మన మహోన్నతమైన సాంప్రదాయాలు సత్య నిష్ఠను మరుగున పడవేశారు.

మతం విలువలు సార్థకం కావాలంటే మానవుని మనిషిని చేయాలి. జాతిని నిర్మించాలి. మానవాళి వ్యక్తి సేవ జేయాలంటే అది జీవితాన్ని సర్వదాతృప్తి పరచే మతం కావాలి. దానిని బోధించిన యోగి దక్షిణామూర్తి కాలంనుండి హిందూ మతం ఎన్నో విపరీత పరిణామాలకు గురైంది. పరమత సహనానికి, సార్వజనీన దృక్పధానికి పరిశుద్ధమైన ప్రాచీన హైందవం నేడు మనం చూస్తున్న, అనుసరిస్తున్న హైందవం

కానేరదు. ప్రస్తుత హిందూ మతం ముసుగు వేసుకొని అనేక మతోన్మత్త, శాఖాగత అర్థ వ్యర్థమైన వ్యవసన రూపాలతో ఆశక్తులు పనిచేస్తున్నాయి. అందువల్ల ఆధునిక ప్రగతి పూర్వక జాతి నిర్మించుకొనుటకు ప్రతి వారిలోను అంతఃకరణపై దృష్టి సారించి విశ్వ మానవతా వాదాన్ని ప్రచారం చేయవలసిఉన్నది.

## శివలింగపూజ

Edward Moor తన "Hindu Pantheon పేజి. నెం. 50లో శివుడు భౌతిక ప్రపంచమునకు కారణ కర్తగనూ, వేదయుగాని కన్నా పూర్వుడని, తదుపరి వేదముల, యజ్ఞములలో అతని స్తుతి కలదని, ఐశ్వర్య ప్రదాతయని, బాధలు నివృత్తి కల్గించు దయగలవాడని, మహాదేవునిగా లయకారకుడని ఏ ఇతర దేవతల కన్నా అత్యంత శక్తివంతుడని తెల్పియున్నారు. తదుపరి వేద యుగం. విష్ణు, బ్రహ్మలలో కలసి శివుని ఆరాధించిరని వ్రాసియున్నారు. దీనిని బట్టి శివుడు ప్రకృతి శక్తుల పూజా కాలానికి పూర్వమే పురాతన సంస్కృతి కల్గి ఆరాధించబడుట తెలియుచున్నది.

శివలింగ పూజను గురించి, Dr. D. R. Thapar గారి " Icons in Bronze" పేజి నెం. 77లో మరియు "Indian Art" పేజి నెం. 6లో ఇలా వ్రాసియున్నారు.

Siva has been depicted in Indian Art from the Indus Valley to our own times as an emblem or in human form. Both are deeply rooted in the metaphysical thought of the religious tradition of India. The folk-elements have been freely accepted but transformed sublimation of forms as a vechicle of ideas gives delight both to Indian seer and artist. Siva is shown as Pasupati, Ardhanariswara,Nataraja, Kamantaka, Gangadhara, Nandiswara, Yogeswara harihara, Umamaheswara, Chendra Sekhara, Mritunjaya and Jyotirling etc.

There is a clear evidence of SIVA worship in the Indus Valley. He is represented there in the form of Pasupati. It appears that the worship of SIVA continued as a wide spread cult throughtout the whole country. Even in the Gandhara, Bactria, Kapisa and the region of the oxus Siva worship was quite popular, Mr. Foucher has suggested that the Kusanas on their coming to India were converted to Saivism. The figure of Siva were shown on the Kusana coins. We know from the coins of Vema-Kadaphises

that he gave himself the title of Maheswara. On all his coins Siva or one of his emblems is depicted. In the Kusana period Mathura became an important centre of the Pasupata cult of Saivism. An inscription of the fourth century A. D. of the time of Chandra Gupta II refers to certain PASUPATA teachers who were tenth in descendance from the original founder of the sect who installed two Siva Lingas by the name of UPAMITESVARA and KAPILESVARA at Mathuraa. ఒక పురాతన శాసనంను అనుసరించి రెండవ చంద్రగుప్తుని కాలంలో ప్రముఖ శైవమతావలంబులలో వారి అనుయాయువులు పాశుపతులు పదవ వంతు వుండేవారని మథురలో, ఉపమితేశ్వర, కపిలేశ్వరగా, ఒకే పానమట్టంపై రెండు లింగములు ప్రతిష్టితమైనవిగా తెలియుచున్నది. శివుని అనాగరిక ఆకార, ఆచారములకు అసహ్యపడి దేవతలు అతనిని "లింగ" రూపమున నుండినట్లుగా శపించిరని ఒక కధ ప్రచారములో కలదు. Prof. D. R. థాపర్‌గారి "Icons in Bronze" పేజి 77లో ఇలా తెలియజేయుచున్నారు. "బహుశా శివుని ఆర్య హైందవ మతం నందు కలుపుకొనుటకు - ఆదిమ వాసుల సిగ్గులేని ఆచార పద్ధతులను మాపుట కొరకు అతనిని 'లింగ' రూపునిగా మార్చి యుండవచ్చునని" వ్రాసియున్నారు.

భారతదేశంలో అనాదిగా ఉన్న లింగపూజ స్వల్ప మార్పులలో, ఈజిప్ట్, గ్రీస్, బాబిలోనియాలోనూ ఎనిమిదవ శతాబ్దివరకు ఫ్రాన్స్‌నందు, పన్నెండవ శతాబ్దివరకూ జర్మనీలో వివిధ రూపాలుగా ఈ అనాది సాంప్రదాయం కొనసాగుచునే ఉన్నది. మరియు థాప్ గారి పరిశోధనాంశాలలో The worship of the Phallic emblem in India was started by Non-Aryans and was practised in many countries. In ancient Egypt the phallus of Orisis was idolised. The Greeks copied this custom by venerating Priapus, derived from Apis, the Bull God of Egypt. 'Mylitta' was the Goddess of fertility in ancient Babylon. The Romans called this Phallic emblem Mutinus which was taken out in a ground processions with dancing and singing. Such reverence was common in France in eighth century A.D. and was current in Germany till the twelfth century A.D. మరియు Edward Moor గారి పరిశోధనలలో ఋగ్వేద - 4 అధ్యాయములో 345-346 లలో వివరించినదిగా తెల్పుచూ

SIVA in the form of Linga, is a remnant of the Anti - Brahmanical religion of India. For such an opinion there are

strong reasons. In fact the LINGA has no natural alliance with elemental worship of the Vedas. We can quote the follcwing two references from Rigveda.

1. "May the glorious INDRA triumph over hostile beings, let not those whose God is SISINA approach our sacred ceremony".
2. "Desiring to bestow strength in the struggle, that warrior (INDRA) has besiezed inaccessible places, at the time when, irrestible, slaying those whose God is the SISINA, he, by his force, conquered the riches of the city with a hundred gates".

The above passages bear a clear reference to the LINGA as a deity worshipped by the pre-Aryan people who were at war with the Brahmanas. But there are scholars who say that phallic worship among the pre-Aryan inhabitants of India is inconclusive Sayana, the commenteror refers it simply to habitual unchastity.

శివలింగ ఆరాధనపై B. C. సిన్హాగారు, తన Hinduism and Symbol worship అను గ్రంథములో "Worship of Linga and Yone" అను శీర్షికన పేజి నం. 133. 134 ల యందు ఇంకా విపులముగా వివరించి యున్నారు. యోని, లింగాకృతిని పునరుత్పత్తి సంకేతంగాను, పృథ్వినుండి ఉద్భవించే ఫలంగానూ తలచి ఆరాధించారు. ఈ ఆరాధన పూర్వయుగంలో క్రీ. పూ. 5000 సం॥కన్నా పూర్వం నుండే యావత్ ప్రపంచమున వ్యాపించినవే.

ఫ్రాన్స్, బెల్జియమ్, రోమ్, ఎరిజోనా, ఈజిప్ట్ నాగరకతలలో కూడా విస్తరించియున్నదే, పురాతన రోమ్ నాగరకతలో వధువును వివాహానికి ముందు యోని, లింగాకృతులపై కూర్చొనబెట్టు ఆచారము కలదు.

భారతీయ మను ధర్మసూత్రాలలో (9-37) ననుసరించి ప్రొ॥ N.N. భట్టాచార్య "ఇండియన్ మదర్ గాడ్డెస్" పేజి నం. 34లో స్త్రీ (ప్రకృతి) జీవశక్తిని ఉత్పత్తిచేయు ప్రతీకగాను, పురుషుడు ఆ జీవ ప్రాణ ప్రదాతగాను అనుసంధానముగా, ఆధ్యాత్మిక పరంగా, పవిత్ర భావంగనే ఎంచి చూపించిన నాగరికతయని తెలియపరచియున్నారు.

The worship of male and female ... is closely connected with the mother-cult. It is a development of erotic rites of fertility. The LINGA symbolises the act of cultivation and the Yoni, the fruit bearing earth. According to ELLIS (EWE - SPEAKING PEOPLES

- Page No. 41) the worship the human generative organs was wide spread among the primitive peoples and its relies are still found in the backward countries all over the world. Even in the middle ages phallic worship was practised in France and Belgium. At Roman marriages the bride was required to sit upon the image of the Phallic God. Phallic worship have been found in the Aregean, Egypt, and in the land of Semites. Models of LINGA and YONI have been found in the Indus Valley Culture. Thus the phallic cult was deeply ingraind in the Hindu religion of third millinium B.C. The origin of the Yoni-cult of the later Tantras must be sought in the pre-historic culture of Harappa. In fact the Tantrik Srichakra is nothing but the representation of female generative organ. The word Tantra is derived from the root 'tan', the meaning of which is to multiply. Originally the male and female organs were worshipped as symbols of procreation and fruitfulness.

Symbolic meaning of LINGA and YONI finds support in a statement of MANU(IX - 37). In the words of N. N. Bhattacharyya (Indian Mother Goddess-Page No. 34), "The women, being the mother of race, is essentially the life producer, and her male partner the begether. In the matter of proceation the union of the two essential philosophically. But the agent about whose maternal functions there is no doubt is the woman". ఇదే విషయాన్ని E. O. James తన "Pre-historic Religion" లో పేజి నెం. 153లో బలపరచియున్నాడు.

శ్రీ V.D. మహాజన్ జాతీయ, అంతర్జాతీయ చరిత్రల పరిశోధనలనేక వ్యాసాలు ప్రచురించిన తన History of India (From Beginning to 1526 A.D.) అను గ్రంథంలో, మొహెంజదారో నాగరికత అంతకు పూర్వముకూడా హిందువులు శివుని ఆరాధించిరని, శక్తి ఆరాధన కలదని, యోగం ఆచరణలో ఉండి వుండవచ్చుని అభిప్రాయం (పేజి నెం. 35)లో వెలిబుచ్చినాడు.

SIVA : A male deity is shown on a seal with three faces and eyes and seated on a low Indian throne in the posture of a Yogi with animals on each side. The deity is considered to be "the prototype of the historic Siva". The figure has a pair of horns over its head

and that indicates that it is the figure of a deity. The presence of the animals justifies the title of Siva as Pasupati or Lord of Animals.

The people of the Indus Valley also practised the worship of Linga and Yoni symbols. Some of the polished stones have been identified with the Linga and other pierced stones have been identified with the Yoni. The likelihood that both Siva and Linga worship have been inherited by the Hindus from the Indus Valley people is perhaps reinforced by the prevalence of the bull (the Vehicle of Siva) or of bull-like animals amongst the seal-symbols. There was also the practice of Yona. The workship of the sacred "incense-burners" was also prevalent.

The cult of the Mother-Goddess did not dominate the Indus religion. The male gods loomed large on the horizon of that age. Pipal god was the supreme deity and a large number of subordinate male deities ruld over the destinies of the poor mortals inhabiting the Indus region.

## స్త్రీ - క్షేత్రము

EARTH and WOMAN అను శీర్షికన Frazer తన "INDIAN MOTHER GODDESS" పేజి 15లో మానవుని జీవన మనుగడకు అవసరమైన ఆహారం భూమి నుండి సంక్రమిస్తుంది. ఆ భూమిని తల్లిగా దేవతగా ఆరాధించి యున్న నాగరికత - తన జాతి అభివృద్ధి ఉత్పత్తి అంతయూ స్త్రీపై ఆధారపడినదిగా భావించి, స్త్రీని - భూమిని తమ ఆరా[illegible]ంచి పూజించే నాగరికత యని తెల్పియున్నారు. భారతీయ 'మనుధర్మశాస్త్రం'లో కూడా పురుషుని బీజముగను, స్త్రీని క్షేత్రంగనూ భావించి పూజించారని అనేక పురాణముల వలన కూడా తెలియగలదు.

## పూర్ణ కుంభకలశము

యావత్ భారత దేశం మరియు భారతీయ సాంప్రదాయం గల ఇండోనేషియాలలో అన్ని శుభ కార్యములయందు [illegible] దేవతగా, లక్ష్మి ఆరాధనగా పూజించటం చాలా సామాన్యం. [illegible], సింధు నాగరికత కాలనుంచే కాక, శ్రీ కుమార స్వామిగారి విశ్లేషణలో ఈ ఆచారం చరిత్రలో 'శుంగరాజ వంశ కాలంనుండి కనుపిస్తుందని తెల్పియున్నారు.

పూర్ణకుంభ కలశంలో కొంత నీరు వుంచి పద్మములు, ఆకులు బయటకు వంగునట్లుగా ఏర్పాటుచేసి అందు కొబ్బరి కాయను నిల్పియుంచుట శుభసూచకముగా ఫలప్రదముగా ఎంచేవారు. జైన సాంప్రదాయంలో ఎనిమిది పవిత్ర చిహ్నాలలో ఒకటిగా, త్రిశాలలో 14 సుస్వప్నాలలో ఒకటిగా, పూర్ణకుంభం నాగుల నదీ దేవతగా కొలిచేవారు. నేడు కూడా శుభ సమయంలయందు, వివాహాది శుభకార్యములయందు కలశస్థాపన కలదు.

ఋగ్వేద కాలంలో పూర్ణకుంభ కలశం 'సోమ' రసంతో నిండినదిగా, అధర్వణవేద కాలమున అమృతం నిండినదిగా బౌద్ధజాతక కథలయందు పూర్ణకుంభ కలశం ధరించిన కన్య లుంబిని వనమందు మాయా దేవి వద్దకు వచ్చినట్లుగా మరియు జైన కథలలో సర్వసుభిక్షమైనదిగా వర్ణించటమైనది.

శతపథ బ్రాహ్మణంలోనూ, కథాసరిత్సాగరంలోనూ పూర్ణకుంభకలశమును స్త్రీ దేవతామూర్తిగా, సంతాన సౌభాగ్యదాయినిగా, గర్భవతి అయిన స్త్రీమూర్తి పవిత్ర చిహ్నంగా భావించి పూజించేవారు.

D. P. ఛటోపాధ్యాయగారి పరిశీలనలో "లోకాయత పేజి నెం. 2946లో నూ N.N. భట్టాచార్యగారి "Indian Mother Goddess - P. No. 42 లో వారు కూడా పూర్ణకుంభకలశమును, పునరుత్పత్తి సంకేతముగా, అందుంచబడే బీజము మొలకెత్తి వృద్ధి పొందు ప్రతీకగనే వివరించే యున్నారు.

నవరాత్రి దుర్గా పూజలయందు రంగు రంగుల ముగ్గులు వేసి అందు "సర్వతో భద్ర" యను ముగ్గును వేసి దానియందు పూర్ణ కుంభ కలశమును ఆకులు, పూలతో అలంకరించి పూజించటం కూడా స్త్రీ దేవత దుర్గామాతగా ఆరాధించటం ఆచారంగా వున్నది.

ఈ వివరణ లన్నీ భారతీయ నాగరికతలో అనేక విధములైన ఆచారములుగా చోటు చేసి కొన్నప్పటికీ వీని మూల ధర్మములందు ఒకే సారూప్యత కల్గి పురాతన హైందవంలో వికసించిన నాగరికతనే స్పష్ట పరుచుచున్నది.

## అణచబడ్డ వారసత్వం అపప్రద

శైవ వాదం ప్రపంచంలోకెల్లా అత్యంత సజీవ ప్రాచీన విశ్వాసం.

- సర్ జాన్ మార్షల్.

అణచబడ్డ వారసత్వ - అపప్రదల శీర్షకననుసరించి భారతీయ మత సాంప్రదాయాలు - శైవ మతంపై కొన్ని అపప్రదలు కల్గియుండి, వాని వివరణలు తార్కిక దృష్టిలో, వివేచనా దృష్టితో పరిశీలించవలసినదిగా కోరు చున్నాము. ఈ వివరణ ల్వటం వలన శైవ సాంప్రదాయానికి కల ఉత్కృష్టతను తెలియపరచటమేనని గ్రహించ ప్రార్థన.

భారతీయ సంస్కృతిని క్రీ. పూ. 6, 7 శతాబ్దాలను ప్రమాణంగా తీసికొనినట్లయిన - పూర్వభాగంలో చాలా వరకు చరిత్ర కందని విషయాలే గోచరిస్తాయి. ఆర్య నాగరికత

అప్పటికే పూర్తిగా భారతీయ సంస్కృతిలో వికాసం చెందివున్నది. అప్పటికి మూడు ప్రధానమైన దార్శనిక శాఖలు పని చేస్తున్నాయి. 1) వైదిక ఆర్యులు, 2) అవైదిక ఆర్యులు, 3) అనార్యులు.

ఉపనిషత్ దార్శనికులలో దిగ్గజాలన దగిని జైవలి, అరుణి, యాజ్ఞవల్క్యుడు (క్రీ. పూ. 650) అను ఈ ముగ్గురు. "ఉపనిషత్ దార్శనిక యుగంనాటికి రక్త సంబంధపు పవిత్రతను కాపాడుకోవాలన్న, అనార్య సంస్కృతినుంచి ఆర్య సంస్కృతిని రక్షించుకోవాలన్న ప్రయత్నం బలంగానే సాగుతుందని వివరించారు".

"వేద సంహితలలోగానీ, బ్రాహ్మణాలలోగానీ ఎక్కడ కూడా అనార్యులమత సాంప్రదాయాలను గౌరవించాలనిగానీ, వారి ఆచారాలను పద్ధతులను స్వీకరించటమో, సమన్వయపరచుకోవటమో చేయాలన్న భావన కనపడదు". విశేషించి వారి పతనాన్నే కాంక్షించాయి.

అప్పటి స్వతంత్ర భావాలుగల దార్శనికులలో చార్వాకుడు, కపిలుడు ముఖ్యులు. తరువాత బుద్ధుణ్ణి అతని సమకాలికులయిన తీర్థంకరుల్ని చెప్పుకోవచ్చు.

ముఖ్యంగా చార్వాకుడు ; భగవంతుడులేడు. ఆత్మలేదు, పునర్జన్మ - పరలోకం లేవు. జీవిత భోగాలను వదులుకోవలసిన పనిలేదు, అవి అనుభవిస్తూనే సత్యాన్వేషణకు అనుభవాన్ని, బుద్ధిని మార్గదర్శనం చేసికోవాలంటారు.

క్రీ. పూ. 1500 నుండి 1300 వరకు గడచిన రెండు మూడు శతాబ్దాలలో భారద్వాజ, వశిష్టుడు, విశ్వామిత్రుడు లాంటి గొప్ప ప్రతిభావంతులయిన ఋషులు కనబడతారు. ఆ తరువాత 'ఆరుశతాబ్దాలపాటు' కర్మకాండ' రాజ్యమేలింది. తిరిగి క్రీ. పూ. 7, 6, 5 శతాబ్దాలు ప్రతిభకు పట్టం కట్టిన 'దార్శనిక బంగారు యుగాలు'. ఆ తరువాత క్రీ. శ. రెండవ శతాబ్దంలో యవన దర్శన ప్రభావం ప్రోత్సాహోన్నీయగా చివరకు నాగార్జునుని దర్శన రూపంలో భారతీయ ప్రతిభ ఒక్కమాటుగా ఉబికివచ్చింది. ఆ తరువాత నాల్గు శతాబ్దాల పాటు తీవ్ర వేగంతో ప్రవహించి మరల ఎనిమిదవ శతాబ్దంతో పన్నెండవ శతాబ్దంలో ఒక మాటు ప్రభవించింది.

ఉపనిషత్ కాలంతో - దాదాపుగా అదే సమయంలో (క్రీ. పూ. 700-600) మతం పేరుతో, స్వర్గం పేరునా జరిగిన జీవ హింసల పట్ల, మంత్ర -తంత్రాలపట్ల ప్రజలు నిరసించారు. మానవునికి సహజ విజ్ఞానం వాటిపై నమ్మకాన్ని సడలింపజేసింది. ఈ పరిణామాన్ని గమనించిన ఉపనిషత్తులు - యజ్ఞ యాగాదుల్ని కొంచెం క్రిందికి దించి, 'బ్రహ్మజ్ఞానానికి' పెద్ద పీటవేశాయి. అయితే ఈ క్రొత్త దారిలో కూడా, పురోహిత వర్గం బాగనే లాభపడింది. తదుపరి బుద్ధుని కాలం వచ్చింది. కులమతాలు, ఆర్థిక హెచ్చు తగ్గులు కారణంగా ప్రజల్లో వ్యాపించిన అసంతృప్తి, ధార్మిక విద్రోహ రూపంలో బద్దలయింది. అజితకేశ కంబలిలాంటి భౌతిక వాదులు బుద్ధుడు చెప్పిన 'ప్రతీత్య-

సముత్పాద సిద్ధాంత' ప్రచారకులు వెనుకటి ధార్మిక వాదుల విశ్వాసాలమీద చావుదెబ్బకొట్టారు.

బుద్ధుడి అనంతరం మౌర్యుల తరువాత వచ్చిన శుంగ వంశీయరాజులు అశ్వమేధ యజ్ఞానికి, ఇతర యజ్ఞాలను ప్రాణప్రతిష్టచేయాలనుకున్నారు.

మధురలో శక కాలానికి చెందిన యజ్ఞ యూపాలు లభించాయి కూడా. ఈ విధంగా జైమిని కాలానికి యజ్ఞయాగాదులు పూర్తిగా నామ రూపాలు లేకుండా పోలేదు. ఐతే వాటి తీవ్రత మాత్రం తగ్గింది.

జైమిన తరువాత గుప్తకాలంలో యజ్ఞయాగాదులు మళ్ళీ ముమ్మరమైనాయి. రాజులు, ధనికులు తమ ప్రసిద్ధిని పెంచుకోవటం కోసం యజ్ఞాలను ఒక సాధనంగా వాడుకోసాగారు. ఐతే అదే కాలంలో వసుబంధు, దిన్నాగుడులాంటి స్వతంత్ర ప్రవృత్తిగల తార్కికులు ఉద్భవించారు. ఈ స్థితిలో కుమారిల్ భట్టు జైమిని పక్షాన నిలబడ్డాడు.

ఈ విధంగా మీమాంసకులు వైదిక కర్మకాండను పునరుజ్జీవింపచేయటానికి విశ్వ ప్రయత్నం చేశారు. కానీ దాని పతనాన్ని ఆపలేకపోయారు. ఇది అలా పతనమవటానికి కొంతవరకు పురోహిత అనుయాయువులు కా[illegible]కాలంలో చాలా వరకు దేవాలయ నిర్మాణం పట్ల, విగ్రహప్రతిష్టాపన పట్ల మోజు పెరిగింది. అది కూడా బౌద్ధ స్థూపాల వినాశనానికి కొంతపాటు పడింది. క్రీ. శ. 400 బాదరాయణుడు - బౌద్ధధర్మానికి చెందిన ప్రముఖ శాఖలు నాల్గింటిని ఘాటుగా ఖండించాడు. ఇలా భారతీయ దర్శనం ఉచ్చనీచాలను ఎన్నో చవిచూస్తూనే వుంది.

ఇక్కడ భారతీయ దర్శనం యొక్క పరాకాష్టను కొంత వివరించవలసియున్నది. ప్రస్తుత గ్రంథాంశములు కొన్ని వివరణలు ఇందు మిళితమై యున్నందున, తదుపరి కల్గిన అనర్థములను విపులముగా అర్థము చేసికొనుటకు, నాటిల్లిన అపప్రదలను తొలగించుట కొరకు ఈ వివరణలు బహు క్లుప్తంగా నీయవలసి వచ్చినది. క్రీ. పూ. 6వ శతాబ్ది భారత చరిత్రలలో స్వర్ణయుగంగా వర్ణించబడింది. భారతంలో దాని ఉచ్ఛస్థితిని గీత, బౌద్ధం, జైనం అభివృద్ధి చెందినట్లే - చైనాలో కంఫూసియస్, ఇరాన్‌లో జోరాస్టర్, పాలస్తీనాలో జెవెస్, పైథాగరస్‌లు ఎంతో ఉన్నతంగా గుర్తించిన కాలానికి - యూరప్, అమెరికాలు ప్రపంచానికి పరిచయమే కాలేదు.

క్రీ. పూ. 5వ శతాబ్దం నాటికి భారతీయ దార్శనిక వికాసం పరాకాష్టనందుకున్నది. ఆనాటి దార్శనిక ప్రసిద్ధులుగా

1. భౌతిక వాదులు - అజితకేశ కంబలి

మఖ్ఖలి గోశాల

2. నిత్యతావాది - పూర్ణకాశ్యపుడు
ప్రక్రుధకాత్యాయనుడు
3. అనిశ్చితవాది - సంజయ్ వేలట్టి పుత్త
నిగంఠ నాధ పుత్త
4. అభౌతిక - క్షణిక - అనాత్మవాది - గౌతమ బుద్ధుడు.

**అజిత కేశ కంబలి :**

దానం, యజ్ఞం, హోమం వ్యర్థం, పాపం - పుణ్యం తాలూకు ఫలితాలు వుండవు. లోకం - పరలోకం లేదు, దేవ తల్లేరు. ఈ లోకంలో సత్యాన్ని చేరుకోగలవారు - బ్రాహ్మణశ్రమణులుకారు. ఈ లోకం -పరలోకం ఎవరూ చూచి చెప్పటంలేదు. మానవుడు పంచభూతాత్ముడు. తిరిగి అందులోనే కలసి పోగలడని, ఆస్తిక వాదులు చెప్పేదంతా అబద్ధం - తుచ్ఛమైనది. అజిత కేశకంబలి ఉపనిషత్తులలో సత్యారూఢుడైన బ్రహ్మజ్ఞాని వుండటానికే వీలు లేదన్నాడు.

**మఖ్ఖలి గోశాల (క్రీ. పూ. 523):**

జైవపిటకాల్నిబట్టి ఇతడు మొదట జైవసాధువని, చాలా నీచుడని, ఈర్ష్యాలుడని, ధర్మాంధుడని తెలుస్తుంది. మఖ్ఖలిగోశాల గురించి అసత్యాలతోకూడిన ఎన్నో కట్టుకథలు ప్రచారంచేశారు. అతడు జైన తీర్థంకరుడైన మహావీరుణ్ణి చంపబోయాడని, బ్రాహ్మణ దేవతా విగ్రహాలపైన మల, మూత్రాలు విసర్జించే వాడని అకారణంగా అతని పై అతని అనుయాయులపైని సనాతన బ్రాహ్మణులు కొట్టారని ప్రచారం చేశారు. "ఈ ప్రచారాలు సామాన్యుల నెంతో ప్రభావితం చేస్తాయి". ఒక మత విశ్వాసాలపై మరొక మత విశ్వాసాలకు వైషమ్యాలు తలెత్తి వికృత పరిణామాలు చెందే అవకాశం కలదు. అవి ముందు ముందు విపరీతంగా గోచరించాయికూడా.

ఈతని దార్శనిక చింతనలో ప్రాణుల చిత్తమాలిన్యానికి ఏ హేతువు అవసరం లేదు. నిర్హేతుకంగానే చిత్త మాలిన్యానికి గురి అవుతుంటని. బలం, వీర్యం, పరాక్రమంతో సంబంధం లేకుండానే ఆరు జన్మల వరకు సుఖ దుఃఖాలను అనుభవిస్తుంటాయని. ఇతడు పునర్జన్మను, దేవుళ్ళను అంగీకరించాడు.

**అక్రియతావాది - పూర్ణకాశ్యపుడు :**

ఇతడు బుద్ధుడి సమకాలికుడన్నది ఒకటి మాత్రం తెలుస్తుంది. దార్శనిక చింతనలో పూర్ణకాశ్యపుడు - మంచి చెడ్డలని విచేచన వ్యర్థం అంటాడు. ఈ లోకాన్ని గురించి, పరలోకాన్ని గురించి ఎన అభిప్రాయం స్పష్టంగా చెప్పాడు. ఇతని అభిప్రాయం ప్రకారం ఇక్కడ పుణ్యం చేస్తె పరలోకంలో సుఖం లభిస్తుందని, పాపం చేస్తే యాతనలు అనుభవించాల్సి ఉంటుందని - అనుకోవటం పొరపాటు - అలాంటి దేమీలేదంటాడు.

**నిత్య పదార్థవాది - ప్రకృధకాత్యాయనుడు (క్రీ.పూ. 523):**

బుద్ధుని సమకాలికుడు, ప్రసిద్ధుడైన తీర్థంకరుడు. ఇతను కూడా పూర్ణకాశ్యపుడు చెప్పినట్లే చెప్పాడు. ఇతడు ప్రతి వస్తువూ అచలమైనదని, నిత్యమైనదని అంటారు. కనుక మంచి పనిగానీ, చెడ్డపనిగానీ మూలంలో ఎలాంటి మార్పు తీసికొని రాలేదంటాడు.

**సంజయ వేలట్టి పుత్త (క్రీ.పూ. 523):**

బుద్ధుని సమకాలికుడు, సంజయవేలట్టి పుత్త, నిగంఠనాధ పుత్త (మహావీరుడు) వీరిద్దరూ అనే కాంత వాద సిద్ధాంతాన్ని విశ్వసిస్తారు. ఇద్దరి సిద్ధాంతంలో వ్యత్యాసం - మహావీరుడు "అవును" కు ప్రాధాన్యతనిచ్చాడు. సంజయవేలట్టి పుత్త "కాదు" కు ప్రాధాన్యతనిచ్చాడు. దేవతలు తథాగతులు ముక్తపురుషులు, పరలోకం గురించి ఇచ్చిన తమ అభిప్రాయాలు "అవును-కాదు" లను బట్టి కనబరచిన సందేహాలలో ప్రజలలో నమ్మకం సడలు తొంగని తెలుస్తుంది. మత కర్తలు ప్రజలకు ఎంత దూరమయ్యారంటే మహాపురుషుల్లా, దివ్య పురుషుల్లా కేవలం పూజలందు కోవటం వరకే పరిమిత మయ్యారు. ఈ స్థితిలో సంజయుడు ప్రజలబుద్ధిని విభ్రమింపచేసేట్టు తన సిద్ధాంతాన్ని ప్రకటించాడు. మానవ సహజబుద్ధిని సంశయంలో పడవేసి - అతడే విషయాన్ని గురించి ఒక నిర్ణయానికి రాలేని ఒక కుత్సిత స్థితిని కల్పించటమే సంజయుడి ఆదర్శం. "దీనిని ఛాందస వాదులు తదుపరి కాలంలో తమ వ్యతిరేకతను తీవ్ర రూపాలుగా నిరూపించారు".

**వర్ధమాన మహావీరుడు (క్రీ.పూ. 569-485)**

జైన మత సంస్థాపకుడు - సర్వజ్ఞతావాది. ఇతని దార్శనిక చింతనలో - తపస్సు - సంయమనాలే మూల సిద్ధాంతాలనుకోవచ్చు. అసలు వర్ధమానుడి సిద్ధాంతాలలో తాత్విక చింతన నామమాత్రంగానే కనుపిస్తుంది. హింసలకు దూరంగావుండాలని - ఎంత అతిచేశాడంటే - నీటిని త్రాగవద్దన్నాడు - భూమిమీద నడవ వద్దన్నాడు. వ్యవసాయపనులు నిషేధించాడు. ఇట్టి చర్యల వల్ల లక్షలాది సూక్ష్మ జీవులు నశించిపోతవన్నాడు. అందువల్ల ఈతని అనుయాయువులు మతం చేత ప్రేరేపింపబడి ఉత్పాదక శ్రమ నుండి తప్పుకొని ఇతరుల శ్రమను దోచుకునే వ్యాపారులుగా వడ్డీ వ్యాపారులుగా మారటం -మానవ జాతి జీవనంలోమతం ఎంతటి దుష్టపాత్ర వహించిందో తెల్సుకోవచ్చు. ఇతడు దేవతలు - పరలోకం గురించి నిశ్చయంగా చెప్పలేక ఉండనూ వచ్చు - లేకపోనూ వచ్చు - చెప్పలేమని సందేహాస్పదమైన జవాబులో ముగించాడు.

**గౌతమ బుద్ధుడు : క్షణిక, అనాత్మవాది (క్రీ.పూ. 563 - 483) :**

రెండు దశాబ్దాల పాటు భారతీయ దార్శనికులు సల్పిన నిరంతరమేధా పరిశ్రమ యొక్క ఫలితం బౌద్ధ దర్శనం. ఆ దర్శనం చెప్పింది క్షణిక వాదం - అనాత్మవాదం,

బుద్ధుడు తరువాత కూడా బౌద్ధ దర్శనం దార్శనిక రంగంలో అనేకమైన క్రొత్త క్రొత్త అన్వేషణలకు మార్పులకు అవకాశం ఇచ్చింది. నాగార్జునుడు, అసంగుడు, వసుబంధు, దిగ్నాగుడు, ధర్మకీర్తి లాంటి మహోన్నత భారతీయ దార్శనికులు బౌద్ధ దార్శనిక ప్రవాహంలోంచి పుట్టుకొచ్చారు. బౌద్ధ దర్శనంలో 1) దుఃఖంవుంది, 2) దుఃఖ్ఖానికి కారణం వుంది, 3) దుఃఖ్ఖాన్ని నిరోధించవచ్చు, 4) దుఃఖ నిరోధానికి మార్గముంది. ఈ నాలుగు ఆర్య సత్యాలు అంటే శ్రేష్టమైన సత్యాలు.

**ప్రజాతంత్ర భావాలు :**

భోగమయ జీవితాన్ని ఏవగించుకొనే వాడు, శరీరాన్ని హింసించుకోవటం వప్పుకొనేవాడు కాదు. అలా చేయటం మూర్ఖత్వమనేవాడు. కర్మకాండలకంటే - భక్తికంటె - జ్ఞానానికి -హేతువాదానికి ప్రాధాన్యత నిచ్చేవాడు. ఇన్ని ప్రయోజిత కారణాలవల్ల బుద్ధుడు తన జీవిత కాలంలోనే కాకుండా అనంతర కాలంలోనూ ప్రతిభాశాలులైన వ్యక్తుల్ని ఆకర్షిస్తూనే వున్నాడు. మగధకు చెందిన సారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు, మహాకాశ్యపుడు, ఉజ్జయిని రాజపురోహితుడు మహా కాత్యాయుని లాంటి బ్రాహ్మణులు కూడా అతడికి శిష్యులయ్యారు.

బ్రాహ్మణ ధర్మానికి, బ్రాహ్మణులకు, పురోహిత వర్గానికి - వారి స్వార్థానికి - బౌద్ధదర్శనం పూర్తి వ్యతిరేకి. ఈ కారణం వల్లనే మూర్ఖపురోహిత వర్గానికి బాగా ద్వేష భావం. బౌద్ధదర్శనం వల్ల ఏర్పడవలసినంతగా ఏర్పడలేదు దానికి కారణం బుద్ధుని శిష్యులయి! మేధావి బ్రాహ్మణులే. క్షత్రియులు, అనేక రాజులు బుద్ధుని శిష్యులయినారు. బౌద్ధ మత వ్యాప్తికి ఎంతో దోహదపడ్డారు. మగధ, వైశాలి రాజులు తమలోని శతృత్వాలనే మరచి పోయారు. ఇతర దేశాలలో ప్రచారానికి సైతం సిద్ధపడ్డారు. బహుళ ప్రచారంచేశారుకూడా.

బుద్ధుడి దార్శనిక చింతన మొత్తము "అనిత్యం - దుఃఖం, అనాత్మ" అన్న మూడు శబ్దాలలో ఇమిడి వుంది. ఈ మూడు భాగాలు స్కందాలు - ఆయతనములు - ధాతువులు ఈ మూడింటిలోనూ దేనికో ఒక దానికి చెందని పదార్ధమేలేదు. బౌద్ధ ధర్మం నిమ్న వర్గాన్ని ఆకట్టుకోగల్గింది. వర్ణ వ్యవస్థను తోసిరాజన్నది. జాతి గతమైన హెచ్చు తగ్గుల్ని తిరస్కరించింది.

**యవన - భారతీయ దర్శనాల సమాగమం :**

అప్పట్లో భారతీయుల్లాగనే యవనులూ ఒక గొప్ప సభ్యజాతి. దార్శనిక చింతనలో, వ్యాపారంలో, రాజనీతి, శిల్పకళలలో, నాట్య కళల్లో, భారతీయులకు తీసిపోలేదు. యవన దార్శనికులలో ప్రముఖులుగా -

| వాదం | దార్శనికుడు | కాలం క్రీ. పూ. |
|---|---|---|
| ★ ఆకృతి వాదం | పైథాగరస్ | 570 - 500 |
| ★ క్షణిక వాదం | హేరాక్లిటస్ | 534 475 |
| ★ బీజవాదం | అన్ ఖాగోర్ | 500 - 428 |
| ★ పరమాణువాదం | డెమొక్రటస్ | 400 - 370 |
| ★ విజ్ఞాన వాదం | ప్లేటో | 427 - 347 |
| ★ విశేషం | ప్లేటో | |
| ★ సామాన్యం | " | |
| ★ మూల స్వరూపం | " | |
| ★ సృష్టికర్త | " | |
| ★ ఉపాదాన కారణం | " | |
| ★ నిమిత్త కారణం | " | |
| ★ తర్కశాస్త్రం | అరిస్టాటిల్ | 384 - 322 |
| ★ ద్రవ్య వాదం | " | |
| ★ గుణం | " | |
| ★ కర్మ | " | |
| ★ దిశా | " | |
| ★ కాలం | " | |
| ★ పరిమాణం | " | |
| ★ ఆసనం | " | |
| ★ స్థితి | " | |

యవన దార్శనిక గ్రంథాలను అధ్యయనం చేసిన మేధావులెందరో భారత దేశంలో వుండిపోయారు. వారుబౌద్ధ దర్శనాన్ని అధ్యయనం చేశారు. ఆ విజ్ఞానంలోని గొప్ప తనాన్ని అవగతంచేసికొన్నారు. ఇలా యవన భారతీయ విజ్ఞానం ఎంతో పురోగమించింది. విస్తృత ప్రచారాలు లభించి సామాన్య ప్రజానీకాన్ని ఎంతో సచ్ఛీలతకు, సన్మార్గానికి దోహదపడింది.

ఇలా భారతీయ దార్శనిక విలువలు, సంస్కృతిని బహు క్లుప్తముగా ఇందు వివరించటం జరిగింది. ఎందువల్లనంటే బుద్ధుని కాలం ప్రమాణంగా చేసికొని ఆ కాలానికి ముందు - వెనుక వచ్చిన అనేక దార్శనికుల గురించి విస్తృతముగా వివరించవలసి యున్నది. గ్రంథ విస్తృతి గమనించి కొందరి ప్రముఖ దార్శనికుల ప్రమాణాలు కూడా క్లుప్తముగా తెలియజేసినాము. ఇంకా పాఠకులకు ఆసక్తి కల్గిన భారతీయ దర్శనం పై

వెలువడిన అనేక ప్రముఖుల గ్రంథములను పఠించవలసినదిగా అందు వివరించిన దార్శనిక విలువలను ఆకళింపుచేసికో వలసినదిగా కోరుచున్నాము.

ఈ గ్రంథమందు మరుగునవద్ద వారసత్వం - అపప్రద శీర్షికన శైవ సిద్ధాంతంపై వచ్చిన అపనిందలకు హేతువులను వివరించుటకొరకే ఈ భాగాన కొంత అధిక వివరణ ఇవ్వ వలసివచ్చినది. దీనిని సహృదయులగు పాఠకులు వివేచనాత్మక దృష్టితో పరిశీలించగోరతాను. కడపటి మౌర్య రాజగు బృహద్రథుని సంహరించి, క్రీ. పూ. 184-185లో శుంగవంశీయుడగు పుష్యమిత్రుడు మగధ నాక్రమించెను. ఇతడు వైదిక మతాభిమాని వీరి వంశీయులు క్రీ. పూ. 72 వరకు పాలించిరి. వీరి పాలనలో బౌద్ధ మత ప్రచారకులు, ఆరామాలు ఎన్నో దారుణ పరిస్థితులనెదుర్కొన్నవి. ఎన్నో హింసాయుత చర్యలకు పాల్పడి వైదిక మ౦ పునరుద్ధరణకు ఎన్నో అకృత్యాలు సల్పినారు.

పైనుదహరించిన దార్శనిక, సైద్ధాంతిక, సామాజికపరిణామాలకులోనైన భారతీయ దర్శనంలో భిన్నమైన అభిప్రాయాలు నాటి కాలంలోనే చోటుచేసికొని స్పష్టతలేక, సందిగ్ధావస్థలో నడిచిన కాలం స్వార్థపరులైన పురోహిత వర్గానికి కంటగింపైనది. తమకు రాజాశ్రయాలు కొరవడినాయి. సమాజంలో వారి ప్రాధాన్యతలు క్షీణించినవి. వారిలో విద్వేషాగ్ని ప్రజ్వరిల్లింది. లావాలాగా అంతర్దహనం చెందుతుంది, సమయం కొరకు ప్రతీక్షించింది. నూతన దార్శనిక యుగం మతం పేర్న తీసికొని రావాలని వేచి చూస్తుంది.

క్రీ. శకం మొదటి శతాబ్దినుండి రాజకీయ విదేశీ సంబంధాలు, సాంస్కృతిక సంబంధాలు అన్నీ ఒక పెద్ద కుదుపుకు మార్పులకు గురిఅవుతున్నరోజులు. క్రీ. శ. 124లోగౌతమీ పుత్రశాతకర్ణి శకులపై విజయము క్రీ. శ. 150లో శాతవాహనులపై రుద్రదమనుల విజయము. క్రీ. శ. 225లో శాతవాహనుల రాజ్యం అంతమొందటం మరియు క్రీ. శ. 4వ శతాబ్దిలో మిహిరగులుని నాయకత్వంలో హూణులు దండయాత్రలో సుమారు 1,600 బౌద్ధ చైత్యాలు, స్థూపాలు, నాశనముగావించబడినవి. విదేశీయుల దాడులకు అట్టడుగు వర్గం ప్రజల జీవన ప్రమాణాలు దిగజార్చినవి. ఆ సందర్భంలోమతకర్తలు, విదూషకులు, కళాకారులు, మతపరంగా, సాంస్కృతిక పరంగా తమ శక్తియుక్తులన్నింటినీ ఉపయోగించి చాతుర్వర్ణ వ్యవస్థను చెక్కుచెదరకుండా కాపాడటం, ప్రజల్ని మభ్యపెట్టడం, మోసగించటం, అబద్ధాలు కల్పించటం వాటిని - మహిమలతో - తాంత్రిక భావాలతో ముడిపెట్టి ప్రచారం చేయటంచేస్తుంది. సాధారణ ప్రజలు పస్తులతో అలమటించి పొంగల కోసం శ్రమచేయవలసిన వచ్చింది. వ్యాపార వర్గాల మోసాలకు బలైంది. అంతేకాక సాధువులు, బైరాగుల గుంపులు, వీరు ప్రపంచ త్యాగులమని నిష్పక్షము, నిర్లోభము ముఖ్య లక్షణాలని, సత్యాన్వేషకులమని చెప్పుకుంటూ "ఎంతటి అకార్యానైనా చేయ సంకల్పించారు". వీరికి సకలోపచర్యలుచేయవలసినది కేవలం సామాన్య ప్రజానీకమే.

**అణచబడ్డ వారసత్వం - అనుబంధంగా కొన్ని వివరణలు :**

క్రీస్తుపూర్వపు అంత్యకాలాలు, క్రీస్తు శకారంబం ఒక విశిష్టమైన మత సంఘర్షణలు చోటుచేసికొన్న కాలం. క్రీ.పూ. 5వ శతాబ్దినుండి బౌద్ధమతాచారం బహుళ ప్రజాదరణ పొందియుండటం, వైదిక మత చాందసులకు కంటగింపుగనే యున్నది. అప్పటి రాజకీయ సాంఘిక పరిస్థితులు ఏ రాజవంశమూ దీర్ఘకాలం రాజ్యంచేయలేక, దేశ మత సుస్థిరతను సాధించలేక పోయింది. అందు కణ్వులు, తుంగ వంశీయులు యవనులు, కుషాణులు, ఆటవిక గణతంత్ర రాజ్యములెన్నో బహుకొద్దికాలం మాత్రమే రాజ్యము లేలినవి.

తదుపరి శాతవాహనులు అజేయమైన బలపరాక్రమములు కల్గి సుస్థిరమైన సామ్రాజ్యాన్ని ఏర్పరచగల్గారు. మహాయాన బౌద్ధమత స్థాపకుడైన ఆచార్య నాగార్జునుడు, బౌద్ధమత తత్వవేత్తలైన అశ్వఘోషుడు, వసుమిత్రుడు, చరకసంహిత రచయిత చరకుడు వంటి మహామహులు కనిష్కుని ఆస్థాన మందుండిరి. అపర చాణక్యుడన బడిన మాఠరుడు కనిష్కుని అమాత్యునిగా నుండెను. కనిష్కుడు బౌద్ధమతానుయాయి అయిననూ అతను ముద్రించిన నాణెముల వెనుకవైపు గ్రీసు, సుమేరియా, ఎలమైట్, పర్షియా, భారత దేశముల దేవతల చిత్రములున్నవి. ఇది సర్వమత సమానత్వముగా భావించవచ్చు. కనిష్కుని తరువాత శాతవాహనుల ఔన్నత్యమునకు మధ్య కొన్ని గణతంత్ర రాజ్యములు ఏర్పడిననూ దేశసుస్థిరత లోపమేగానీ మతపరమైన కీడు సంభవించలేదు.

శాతవాహనులు ఆంధ్రులు. గోదావరి దక్షిణ తీరమందున్న ప్రస్తుత కరీమ్‌నగర్ మండలములోని కోటి లింగాల ప్రాంతముగా తెలియుచున్నది. ఈ వంశీయులు ఉత్తర భారతమున రాజకీయ అస్థిరత ప్రబలియున్న తరుణమున దక్షిణాపథ, దక్షిణ భారతములను తమ ఆధిపత్యములోనికి తీసికొని సుస్థిర సామ్రాజ్యము నెలకొల్పినారు. వీరిచరిత్ర నిర్మాణమునకు శాసనములు, పురాణములు (మత్స్య, వాయు పురాణములు) గ్రంథములు, దేవాలయములు, గుహాలయములు, [illegible] చరిత్రలు నాణెములు, శిల్పములు, బౌద్ధ విహారములు సుస్థిర రాజ్యస్థాపనను తెలియజేయుచున్నవి.

శాతవాహనులు సర్వమత సహనతలకు [illegible] - గుహాలయములైన కార్లే, ఎల్లోరా, అజంతా, నాసిక్ మున్నగు చిత్ర - శిల్ప కళాకృతులు చాటి చెప్పుచున్నవి. బౌద్ధ జాతక కథలు, జైన సాహిత్య గ్రంథములు, బౌద్ధ [illegible]ములు, వైదిక ధర్మములు శాతవాహన కాలపు మత పరిస్థితులను [illegible] చెప్పుచున్నవి. శాతవాహనులు వైదికమత నిరతులు. యజ్ఞయాగాది కర్మల నాచరించినవారు. కృష్ణుడు, వేదశ్రీ, శక్తిశ్రీ, స్కంద శాతకర్ణి, శివస్వాతి, యజ్ఞశ్రీ, మొదలగు నామములు

వారి వైదిక మతాభిమానమునకు ఋజువు. హల శాతవాహనుడు శాతవాహన రాజులలో ప్రసిద్ధిగన్నవాడు. "గాథా సప్తశతి' ఆనాటి ప్రజల జీవన సరళిని తెలియజేయు అనూహ్య గ్రంథము. ప్రజలు, శివుని. విష్ణువుని పూజించుచుండిరి. శివారాధకులు అధిక సంఖ్యలో నుండిరి. క్రీ.శ. 1వ శతాబ్దిలో గౌతమీపుత్ర శాతకర్ణి కాలమునాటికి బౌద్ధమతం మహోన్నత స్థానం ఆక్రమించింది. వైదిక మతంపై స్పర్థలేక రాజవంశీయులు, సామాన్య ప్రజలు బౌద్ధ, జైన, హైందవ మతాచారములయందు స్వతంత్రముగా వ్యవహరించు చుండిరి. శాతవాహన వంశీయులానంతరం ఉత్తర భారతమున సహపాణులు, క్షహరాట వంశీయులు, కర్దమ వంశీయులు ఏలుబడిలో బౌద్ధం యొక్క ప్రశస్తి క్రమేణా క్షీణింపచేసి వైదిక మతాచారములపట్ల అభిమానము, రాజాదరణలు పెంచినట్లు చేసిన సందర్భాలలో అనేక బౌద్ధారామాలు ధ్వంసము కావించబడుటకు, తీవ్రతరమైన వైదిక మతావలంబుల పాషండ ప్రవృత్తియనే చరిత్రవలన తెలియుచున్నది. అట్టి హేయమైన ప్రవృత్తిని సనాతన సిద్ధాంతమైన శైవ సిద్ధాంతం నిష్కర్షగా ఖండించియేయున్నది.

"భారతదేశ చరిత్ర - సంస్కృతి" అను గ్రంధమును శ్రీ r శాస్త్రిగారి రచనలో - 2వ భాగమందు - ఆంధ్ర దేశమున క్రిష్ణా తీరప్రాంతముల నేలిన క్రీస్తుశకారంభంలో అంధకశాఖ మహా సాంఘికుల కాచార్యుడును అగు భదంతా నందాచార్య డానంద గోత్రీకులకు మూలపురుషుడు. ఇతని వంశీయుడగు 'కందర రాజు (క్రీ.శ. 380-425) బౌద్ధుడు. ఇతడు సమ్యక్సం బుద్ధస్య అని శాసనముల తెలియబడినాడు. తరువాత ఇతడామతమును త్యజించి శైవ మతానుయాయియై ఆ మతోద్ధరణకు పాటుపడినాడు. అతని కాలముననే గుంటూరు జిల్లాయందుగల 'చేజర్ల, గుంటుపల్లి, నాగార్జున కొండలోని పుష్పభద్రస్వామి ఆలయములు బౌద్ధంనుండి శైవంగా రూపాంతరము చెందినవి. భారతావనిలో ఇట్లనేక ఆరామాలు దేవాలయాలుగా రూపాంతరం చెందటం చరిత్ర యెరిగిన విషయమే (భారతదేశ చరిత్ర - సంస్కృతి - రెండవభాగం - శ్రీ బి.ఎన్. శాస్త్రిగారి రచన).

బౌద్ధమత వినాశనానికి హైందవం కారణం కాదని తెలియపరచే అనేక వివరణలు "WM. Theodore De Bary వారి "Sources of Indian Tradition" అనుగ్రంథంలో Ch - VIII నందు The Vehicle of the thunderbolt and the Decline of Buddhism in India లో విపులంగా ఇచ్చియున్నారు. మరియు ప్రపంచ ప్రసిద్ధిగల్గిన క్రీస్తుమతముకూడా దానినుండి దూరము కాలేదని పై అధ్యాయమందు పేజి నె. 187లో ఉదహరించియున్నారు.

"Many authorities believe that early christianity was inflamed, directly or indirectly, by Buddist ideas. In the Eastern Churchs the story of Budda's abandonment of his

home for a life of asceticism," "The Great Going - forth', has been adapted as a christian legend, the name of its protogenist, St. Josaphat, being evidently a corruption of the word "Bodhisattavo".

మరియు D. D. కౌశాంబి గారి "Myth and Reality" అను గ్రంథములో బౌద్ధస్థూపాలు ఎలా కూలగొట్టబడినవో రాజా హర్షుని కాలంలో సాంఘిక పరిస్థితులను వివరిస్తూ - Emperor Harsha Silaaditya (Circa 600 - 640 A.D.) of Kanauj found no difficulty in worshippping Gauri, Mahesvara - Siva and the Sun, while at the sametime he gave the fullest devotion to Buddism (ఒకే ఆవరణములో బౌద్ధ స్థూపములు, విహారములు, మహేశ్వరుని గుడి, సూర్యదేవాలయములు - కనోజ్ పట్టణమునకు దగ్గిరలో కలవు.

His enemy Narendra Gupta Sasanka, raided Magadha from Bengal, cut down the Bodhi tree at Gaya, and wrecked Buddist foundations whereever he could. What was the difference? Why was a synthesis of the two religious, actually practised by others besides Harsha not successful ?

ఈ రాజకీయ, సాంఘిక అనిశ్చిత పరిస్థితులను అవకాశంగా తీసికొని వారి విశ్వాసాలను ప్రజలపై రుద్ది, వారిలో భయాలు సృష్టించి తిరిగి వార్ని తమ బానిసలుగా చేసికొనేందుకు అనేక దుష్కార్యాలకు ఒడిగట్టారు. ప్రజల్ని తిరిగి భయ భీతుల్ని చేశారు. పాపం - పుణ్యం - పరలోకం - కర్మకాండ జాలాల్లో వార్ని పడదోశారు. అందుకు ఎన్నో వినాశకర కార్యాలు చేపట్టారు. ఎన్నో బౌద్ధ చైత్యాలను నాశనం చేశారు. బౌద్ధ శ్రమణులను, బిక్షుకులను చెరబట్టారు, తిరిగి పాషండ ప్రకృతిని కల్పించి మాయ మహిమలుగా చూపి ప్రజలను తమ అధీనంలోకి తెచ్చుకునేందుకు పూజారి వర్గాల ప్రోత్సాహంతో జంతుబలి మాంస బక్షణ, సురాపానాలకు అలవాటుపడేటట్లు చేశారు. (సంకృతి కుమారుడు, రంతిదేవుడు దానశీలి, అతని భోజనశాలలో రెండు వందలమంది వంటవాళ్ళు, రోజూ రెండు వేల ఆవుల్ని వధించి వండుతుండేవారు. అతిథులకొరకు - ఇది వారి పూర్వ కైంకర్యాలే. మహాభారతం - ద్రోణపర్వం - 67/17, 18, శాంతిపర్వం - 20/28.

భారతీయ ప్రథమ సంస్కృతిలో అనగా ఆర్య నాగరికత భారతీయ నాగరికతలో సమ్మిళితం కాక పూర్వం లేని యజ్ఞయాగాదులు, జంతుబలి - సురాపానం ఆర్య నాగరికతతో వచ్చి, ఆర్య - అనార్య మిశ్రమ సంస్కృతిగా మారి వారి క్రతువులు యధేచ్ఛగా సాగిన కాలం తిరిగి ప్రవేశ పెట్టేందుకు దోహదపడ్డాయి. అట్టి విచిత్రకర

సమయంలోనే అనేక ఆరామాలు విధ్వంసం చేసిన తీవ్రవాదులు పాషండులు బలులు, యజ్ఞములు తిరిగి ప్రవేశపెట్టేందుకు నడుము కట్టారు. వీరు అలా చేసిన దురాగతాలకు ప్రాచీన భారత సిద్ధాంతం ఏ మాత్రం కారణంకాదు. ఈ అకృత్యాలన్నీ కొందరు స్వార్థపరులు నెఱపిన ఆ దురాగతాలన్నీ శైవానికి అంటగట్టారు. ఇది భారతీయ సంస్కృతి ఉత్కృష్టగా ఎదిగే సమయంలో జరిగిన దుష్పరిణామాల చరిత్ర శైవంపై ఎంతో దుష్ప్రచారం జరిగిందని గ్రహించ మనవి. సర్వ జనీయమైన, సౌభ్రాతృత్వం గల్గిన సనాతన భారతీయ శైవం పై కారణాలకు ఎట్టి పరిస్థితులలోనూ బాధ్యత వహించలేదు - ఈ సత్యాన్ని కాలాంతరంలో చరిత్రకారులు గ్రహించిన విషయమేనని మనవి.

**హైందవ నాగరికతలో సహనశక్తి :**

వేల సంవత్సరాల పూర్వంనుండి భారతీయ సంస్కృతిలో పరహితేచ్ఛ, సహనశీలతలే ప్రధానంగా కనుపిస్తున్నాయి. క్రీ. పూర్వంనుండి క్రీ. శకం 18వ శతాబ్ది వరకు, ఆర్యులు, యవనులు, శకులు, మంగోలురు, హూణులు, మహమ్మదీయులు, పోర్చుగీసు, ఇంగ్లీషువారు ఇట్లనేక దేశస్థులు భారత భూభాగంపై వలసగా వచ్చి ఇక్కడి నాగరికతతో కలసి మెలసి భారత జీవన స్రవంతిలో ఏకమై భారతీయులపైనే ఆధిపత్య నెరపిన వార్కి అట్టి అధికారము, దర్పము ఇచ్చినది కేవలం భారతీయ సాంప్రదాయంలోగల సహన శక్తి, ఉపేక్ష, సహానుభూతి, పరహితేచ్ఛ, పరమత సహనమనే గ్రహించాలి. అది ఈ హైందవ సాంప్రదాయంలోగల మహోన్నతమైన సంస్కృతిగా భావించాలి. అది ఈ జాతి సనాతన సిద్ధాంతమని గత చరిత్రలే రుజువు పరుస్తున్నాయి. ఇది ఒక మత విశ్వాసానికి సంబందించినది కాదు, అది ఈ భూ, జల, వాయు నైసర్గిక స్వరూపాధారమై ఇక్కడి ప్రజాజీవన నాగరికతలో సమ్మిళితమైన సహజ స్వభావమని తెలియుచున్నది. అదే ఇక్కడి ఆధ్యాత్మికావలంబులకు ఉత్తమ గుణ సంపన్నమై ప్రకాశించినది.

**జల ప్రళయాలు :**

ప్రకృతి శక్తులు విజృంభించినపుడు, భూతలంపై అనేక మార్పులు సంభవించటం సహజం. ఖండాంతరాలలో సంభవించిన విలయాల వలన భూభౌగోళిక రూపాలు మార్పు చెందుతాయి. మహాకొండ ప్రాంతాలు అగాధాలుగా అగాధాల జల రాశులుపైకి లేచి భూభాగాలుగా పరివర్తన చెందుతాయి. భూఖండం వేల సంవత్సరాల పూర్వం అనేక మార్పులు చెంది నేడు మనం చూస్తున్న ప్రపంచ పటంగా రూపుదాల్చినది. ఒకప్పుడు భారత దేశం, శ్రీలంక, ఆస్ట్రేలియా భాగాలు కలిసి వున్నవనే సత్యం నేటి తరంకు నమ్మశక్యంగాని విషయం. అలాగే ఆఫ్రికా ఖండంకూడా ఆసియా భాగంనుండి వేరైనదనే విషయం సత్యప్రమాణాలు.

అలా సంభవించిన ప్రళయాలవల్ల జీవరాశి అంతా నశించి నూతన జీవరాశులు ఆవిర్భవించటం, మిగిలిన జీవరాశి కూడా నూతన శీతోష్ణస్థితుల కనుగుణంగా జీవన

పోరాటంచేయటం సహజం. నదీ, నదాలు దిశలు మారటం, సారనంతాలు బీడు భూములుగా, కొండ ప్రాంతాలు జలమయాలుగా మార్పు చెందెననని భూగర్భ శాస్త్రజ్ఞులల అభిప్రాయాలు ఎన్నో ఋజు పరచినవి. భారత ఉపఖండంలో జరిగిన జలప్రళయాల వల్ల భూభౌతిక స్థితులు మార్పు చెందినవి.

ప్రస్తుత గ్రంథాంశమునకు పాక్షికముగా మాత్రమే సంబంధమున్న ఈ అంశాన్ని సేకరించిన అపూర్వమైన పరిణామాలను పొందుపరచటంలో పాఠకునకు భూభౌతిక మార్పులవల్ల జరిగే పరిణామాలు, నాగరికతా, సంస్కృతులలో వచ్చే మార్పులు, శీతోష్ణస్థితిగతులలో భేదాలు విపులంగా వివరించటం మాత్రమేగానీ గ్రంథ భాగానికి అన్వయించునది కాదని మనవి. ఈ వివరణల వల్ల ప్రకృతిలో జరిగే మార్పులు కొంత అవగాహన ఏర్పడగలదని భావిస్తాను.

రష్యన్ పరిశోధకుడు, విద్వాంసుడు అయిన ఇమ్మాన్యుయల్ వెలికోవిస్కి (I. Velikovsky) తను 30 సంవత్సరాలుగా ప్రపంచంలో అనేక మతగ్రంథాలపై చేసిన పరిశోధనా ఫలితంగా ఈ భూమి మీద సుమారు 3,000 B.C. ప్రాంతంలో అంతరిక్ష గ్రహాలు భూమిని ఢీ కొనేంత దగ్గిరగా వచ్చినందువల్ల పెద్ద ఎత్తున భూకంపాలు, జలప్రళయాలు జరిగినాయని ఋజువు చేసే అనేక సైన్సు ఆధారాలను కనుగొన్నాడు. ఇందులో అన్నింటికంటే ముఖ్యమైనది భూమి యొక్క అయస్కాంత శక్తి ఉత్తర ధృవం దక్షిణానికి, దక్షిణ ధృవం ఉత్తరానికి అకస్మాత్తుగా మారటం జరిగిందని దీని వల్ల ఈ ప్రళయాలు జరిగినవని తెలిపే! ఇంకా అనేక సైన్సు ఆధారాలను 'వెలికోవిస్కీ' భూమిపై ప్రళయాలు (The Earth in Upheavel) అన్న గ్రంథంలో ఉటంకించారు. తనపై పరిశోధనల భాగంగా అట్లాంటిక్, పసిఫిక్ సముద్ర జలాల అడుగు భాగాలలో అయస్కాంత క్షేత్రం భూ ఉపరితలంపై వున్న విధంగా కాక వ్యతిరేకంగా ఉన్నట్లు తెల్పియున్నారు.

ఫ్లింట్ (Flint) అనే భూగర్భ శాస్త్రజ్ఞుడు చేసిన పరిశోధనలో అట్లాంటిక్ సముద్రం అడుగునగల నేల అకస్మాత్తుగా కొన్ని వందల అడుగులు పైకి లేచినదని, దీనివల్ల సముద్రమట్టంలో మార్పులు జరిగాయని కనుగొన్నాడు. ఈ భూమి ధృవాలలోని మార్పులవల్ల సముద్ర గర్భంలో ఒక పెద్ద పర్వత పంక్తి వంటిది ఏర్పడినదని కనుగొనుటయే కాక ఈ ప్రళయం భూకంపాలతో మొదలైనదని సైన్సు సాక్ష్యాలతో ఋజువైనది. (Flint - "Glacial Geology - P. 523 - Late - Pleistocene mountain uplift occered in the Himalayan Region and in the Alps and large scale rifting took place in Eastern Africa. ఇవి ప్రపంచ దేశాల పటాల్నే మార్చేశాయి.

ప్రొ ॥ డాలి వ్రాసిన "Our mobile earth" p - 228 - 229 లో "During the building of the Alps gigantic slabs of rocks, thousands of feet

thick, hundreds of miles long and tens of miles wide were thrust and then over".

The direction of the relative over-thrushing movement was from Africa towards the main moss of Europeon on the North. The visible rocks of the Northern Alps of the Switzerland have thus been shoved north words, distances of the order of 100 miles. In essence the Alps used to be on the present site of the Northern Italy".

ఆల్ప్సు (ALPS) పర్వతాలు అకస్మాత్తుగా ముందుకు నడచి కొన్ని వందలమైళ్ళ పొడవు, వేల అడుగుల మందముగల, కొన్ని మైళ్ళ ఎత్తుకు తీవ్రంగా కంపించి ముందుకు కదిలాయి. పర్వత పంక్తి కదలిక ఆఫ్రికా ఖండంవైపునుండి ప్రస్తుత యూరప్ వైపుకు నెట్టుకు వచ్చింది. ఇప్పటి స్విట్జర్లాండులోని 'ఆల్ప్సు' శిఖరాలు సుమారు వందమైళ్ళ దూరం వరకు తోసుకొని పోయాయి. ఇప్పుడు ఇటలీ వుండే ప్రాంతంలో ఆ శిఖరాలు మునుపుండేవని తన సైన్సు పరిశోధనా గ్రంథంలో తెల్పియున్నాడు.

ఇదే పరిశోధనలను ప్రఖ్యాత భూగర్భశాస్త్రవేత్త F. K. మేథర్ (F.K. Mather) మరియు గామో (Gamow) వ్రాసిన Biography of the Earth" అనే వారి పరిశోధనలుకూడా దీనినే బలపరుస్తున్నవి.

ప్రఖ్యాత సైన్సు - పరిశోధకుడు టి. టి. పేటర్సన్ (T.T. P[illegible]son) హార్వర్డ్ యూనివర్శిటీలోజరిపిన పరిశోధనలో హిమాలయ శిఖరాలు పైకి లేచింది. ఈ చరిత్ర కాలంలోనే అని ఋజువు చేశాడు.

"Prof. R. Daly of Harward University found that 3,500 years ago, all over the world, the level of the Ocean water suddenly dropped", "Modern research confirms that many of the Alphine glaciers are less than 4,000 years old".

పర్వతాలు కదలి వెళ్ళటం ప్రళయంలో భాగమే. ఎత్తైన పర్వత శిఖరాలపైన సముద్రాలలో ఈదే చేపల అస్థిపంజరాలు, సముద్రజీవరాశుల అస్థిపంజరాలు, సముద్ర గర్భంలో ఉండే శంఖములు, ఆల్చిప్పలు - "ఎవరెస్ట్" శిఖరంపైన ప్రవహించన నీలి సముద్రాల జాళ్ళు, ఒక నాడు సముద్ర గర్భం అడుగున వుండిన "ఎవరెస్ట్" శిఖరాన్ని అనేక జలచరాలు నీటిలో పైనుండి క్రిందికి చూచేవి. అకస్మాత్తుగా సముద్రపు అడుగుపైకి లేచి ఇప్పటి "ఎవరెస్ట్" శిఖరాలై నిల్చాయి. 15000 సంవత్సరాల క్రితం జరిగిన ప్రళయాలలోని ఉత్పాతనలలో కొంత భాగం మాత్రమే. కొన్ని చోట్ల ఇప్పటి

కాశ్మీరు ఐదువేల అడుగుల ఎత్తుకు లేచింది. ఇవన్నీ మానవ చరిత్ర కాలంలోనే యిటీవల జరిగాయని బుజువైనది.

అమెరికాలోని "ఆరిజోనా" (Arizona) రాష్ట్రంలో 'ఉల్క' (Meteorite) వల్లపడిన గండి సుమారు 4, 5 మైళ్ళ వ్యాసంతోనేటికి కనిపిస్తున్నది. దానిని పరిశోధించిన ప్రొ. వెలికోవ్స్కీ, భూగర్భశాస్త్రపరిశోధనలో ప్రచురింపబడిన పరిశోధకుల అభిప్రాయం ప్రకారం ఈ ఉల్క - 4 వేల సంవత్సరాల క్రితం పడివుంటుందని తెలిపారు. ఇలా సముద్రాలను, భూభాగాలను కుదిపివేసిన మూడవ జలప్రళయం క్రీ. పూ. 3000 కు పూర్వం జరిగి ఉండవచ్చని శాస్త్రజ్ఞుల అంచనా.

**మూడు జలప్రళయాలు :**

భారత ఉపఖండంలో సంభవించిన భౌగోళిక పరివర్తనలో ఎక్కువగా జలప్రళయాలవల్ల జరిగినట్లు కనుపిస్తుంది. ఖగోళ సంబంధమైన లెక్కల ఆధారంగా ఆచార్య K. శ్రీనివాస రాఘవన్, మొదటి జలప్రళయం క్రీ. పూ. 14,715 లో సంభవించి వుండవచ్చన్నారు. An article in The Hindu 4-6-1977). లాబ్సాంగ్ రాంప టిబెటన్" రికార్డులను పరిశీలించాడు. "ఈ జలప్రళయం ఆ రోజులలో మెరక భూములను తప్ప మొత్తం చైనాను ముంచి వేసింది. (Page No. 163, "The Third eye" by T. Lobsang Rampa). శిలాజ సంబంధ శిలాస్తర సంబంధ ఆధారాలు, కాలాలను, యుగాలను, దిక్చక్రాలను ఉజ్జాయింపుగా చెప్పగలవే కానీ ఖచ్చితంగా శతాబ్దాలలో చెప్పలేవు - ఇందు భారతీయ భూగర్భశాస్త్ర సర్వే రికార్డులు కూడా తోడ్పడలేవు. (Page No. 13 "Tamil India" by M. S. Purnalingam Pillai)

ఈ జల ప్రళయాలు సంభవించిన కాలాలు ఏవైనా మొదటి జలప్రళయ దశకు ముందరి దశ "దక్షిణ అమెరికా, ఆస్ట్రేలియా, ఇండియా అంటార్కిటికా కూడా ఒకప్పుడు గండ్వానా ఖండంలో భాగాలనే విషయం భూగర్భశాస్త్రవేత్తలకు, జంతు శాస్త్రజ్ఞులకు, శిలాజ జీవాకృతు శాస్త్రజ్ఞులకు సుస్పష్టం (Page No. 124 of "The Riddles of three Oceans" by Alexander Kandrator). మొదటి జలప్రళయం సంభవించినపుడు ఈ ఖండాలన్నీ వేరైపోయినాయి. "ఇండియాను, ఆస్ట్రేలియాను కలిపిన **'లీమూరియా భూఖండం'** పూర్తిగా మునిగిపోయింది. ఫలితంగా భారతదేశంపెద్ద ద్వీపం అయింది". ఈ ద్వీపాన్ని జంబూదీవు' లేదా 'నవలాండివు' అని పిలిచారు.

రెండో జల ప్రళయం సంభవించినపుడు ఇండియా ఒక ద్వీపంగాలేదు కానీ దాదాపుగా ఇప్పటి ప్రస్తుత రూపాన్ని సంతరించుకున్నది. దక్షిణ భాగం బాగా నష్టపోయింది. ప్రధాన భూఖండంనుండి శ్రీలంక విడివడి పోయింది. తరువాత తృతీయ జల ప్రళయం సంభవించింది. ఇందులో ప్రధానంగా నదుల గతులను అమరికలను మార్చటమే గాక అంతకు ముందులేని భూకంప వాతావరణ సంబంధ

పరివర్తనలు తెచ్చింది. మరియు H. S. భాటియా గారి "Political, legal and Militory - History of India - Vol. I లో పేజి నెం. 17న Dr. నరేంద్రనాథ్‌లా గారు వ్రాసిన ఉపోద్ఘాతములో

THE FLOOD: It is stated that the Flood recorded in the 'Satapatha Brahmana' was "the greatest land mark in the Pre-dynastic history of India The Flood has been proved to be a historical fact byDr. Woolley's excavations. The area of the Flood was certainly the continuous land from mesopotania to Raja putana, and there is the commen tradition at both ends of the area, embodied in the ancient literatures of the Semites and Hindus. Our dynestic history in the puranas almost begins from the flood, and the Mohenjodaro civilization is post-Flood event". The purans are amongest the most ancient documents or race-history, and the tradition and data embodied therein. Go back to the Flood and even earlier". భారతీయ ప్రమాణ గ్రంథాలు, సత్పధ బ్రాహ్మణమందు కూడా జల ప్రళయములుసంభవించినట్లు అది చరిత్ర సత్యమని తెలియుచున్నది. Dr. ఉల్లీ గారి పరిశోధనలోకూడా జల ప్రళయములు మెసపుటోమియా నుండి రాజస్థాన్ వరకు గల భూభాగమందు సంభవించినట్లు అందిరువైపులా ఒకే నాగరికత కల్గియున్నదని తెలియుపరచినారు. భారతీయ పురాణాలలోగానీ, బాబిలోనియా పురాణాలలోగానీ జీవ సృష్టితిరిగి జలప్రలయానంతరము ప్రారంభించినట్లుగా తెలియపరచినవి. మొహంజదారో నాగరికతలు జలప్రళయాలకు ముందుగనే ఏర్పడినవని భూగర్భ శాస్త్రవేత్తలు పరిశోధనలు తెలియపరచినవి.

ఇలా చరిత్రకు - సామాన్య మేధస్సుకు అందని సత్యాలెన్నో కలవు. ఇందు లభించిన కొన్ని వివరణలు మాత్రమే ఇచ్చియుంటిమి. ఇందువల్ల ప్రకృతి విలయాలు, జలప్రళయాల వల్ల భూ భౌతిక మార్పులు కొంత అవగతము కాగలదని మనవి.

**శాస్త్రీయ పద్ధతుల ద్వారా కాలనిర్ణయం :**

కాలగర్భంలో కలసిపోయిన ఏ వస్తు విషయాన్నైనా పరిశీలించవలసినపుడు, కాలనిర్ణయంచేసేటపుడు

1. రేడియో ధార్మిక వస్తువుల అంచనాల ద్వారా కట్టబడే లెక్కలు. (Radio - Corbon Dating) ఇది పురావస్తు పరిశోధనలోని త్రవ్వకాలలో దొరకిన వస్తువులకే పనికి వస్తుంది.

2. గ్రహస్థితులను బట్టి ఖగోళశాస్త్రంలోని వైజ్ఞానిక గణనం మీద ఆధారపడికూడా మనం కాలనిర్ణయం చేయవచ్చునన్న విషయం శ్రీలోకమాన్య బాలగంగాధర్ తిలక్ నిరూపించారు. ఈ పద్ధతిని ప్రాశ్చాత్య చారిత్రికులు పండితులైన "మాక్సు ముల్లరు, జాకోబి, సర్ ప్లిండర్స్ పిట్రిలాంటి మహా మహులుకూడా ఎంతో శ్లాఘించారు. శ్రీ తిలక్ మహాశయుడు ఈ ఖగోళ, జ్యోతిష శాస్త్ర విషయాల ఆధారంతో చేయబడిన గణితంతోనే వేదకాల నిర్ణయం చేయవచ్చని నిరూపిస్తూ "ఓరియన్" (Orion) అనీ, "ఆర్కిటిక్ హోమ్" (Arctic Home of Vedas) అని తన రెండు గ్రంథాల ద్వారా ఈ పద్ధతిని ప్రతిష్ఠించాడు.

ఇది శాస్త్రీయమైనపద్ధతి, ఎందుకంటే గ్రహాల నడకలు దానికై చేసే గణితం అంతా కూడా ఇప్పుడు టెలిస్కోపుల సహాయంతో చూచి, కొలిచి ప్రత్యక్షంగా నిరూపించవచ్చు. ప్రత్యక్ష వైజ్ఞానిక సత్యంగా ఇది ఎవ్వరూ మార్చలేని ఖగోళ విషయాల మీద ఆధారపడివున్న విధానం కాబట్టి - పూర్వం ఎన్ని సంవత్సరాలక్రితం ఎలాంటి ఖగోళ పరిస్థితులున్నాయో, వాటిని వెనుకకు లెక్కించే విధానంలో సరిగా ఆనాటి కాలాలను గుణించటం వీలవుతుంది.

ఈనాటి సైంటిస్టుల ఖగోళ గణితానికి ఆధారమైన ఫ్రెంచ్ ఖగోళ శాస్త్రజ్ఞులు "కైసైని" (Cassini) "మైయర్" (Maier) ఇంకా తదితరులు, ఇంగ్లండు నుంచి ఆధునిక దేశాలలోకి తాము తీసికొని వెళ్లిన జ్యోతిష గణితం భారతదేశంలోని దక్షిణాది రాష్ట్రాలనుండి తీసికొన్నామని "ఫ్రెంచ్‌సైన్సు సదస్సు" లోని పరిశోధనా పత్రాలలో సైతం అంగీకరించబడినది. ది సీక్రెట్ డాక్ట్రిన్ (The secret doctrine) లో మేడమ్ H.P. బ్లావెట్స్కీ వీనిని టిబెట్ రహస్యవాదములుగా గుర్తించి యున్నవని కూడా తెలిపియున్నారు.

**మహేంద్రగిరి మహాయోగి - చారిత్రకాంశాలు :**

భారత చరిత్రలో పేర్కొన్నమూడు మహేంద్ర గిరులున్నాయి. ఒకటి మొదటి జలప్రళయంలో **"లిమూరియా ఖండం"**తోపాటు మునిగిపోయినదని భావిస్తారు (The Riddles of three Oceans" by Alexander Kondretor - నేటి ప్రపంచ పటం కొన్ని వేల సంవత్సరాల క్రింతం, ఆసియా భాగంలో ఆస్ట్రేలియా, శ్రీలంక, కొంత ఉత్తర భాగంలో ఉన్న ఆఫ్రికా ఖండాలు కలసి యుండి ఉండవచ్చుని, భూగోళ పరిశోధనా శాస్త్ర చెబుతున్నది). రెండవది ఆంధ్ర సరిహద్దులలో శ్రీకాకుళం దగ్గిర మహేంద్రగిరి, మూడవది తమిళనాడు నాగర్ కోయిల్ వద్ద గల మహేంద్రగిరి.

సంభావ్యతా బలాన్ని బట్టిచూసే ఆంధ్రా - ఒరిస్సా సరిహద్దులలోని శ్రీకాకుళం వద్దనున్న మహేంద్రగిరి నుంచే యోగదక్షిణామూర్తి ప్రాక్తనచతుష్టయానికి తన బోధను వినిపించాడని ఈ దిగువ కారణాలను బట్టినిర్ణయించవచ్చు.

క్రీ. శ. 7వ శతాబ్దికి చెందిన ప్రఖ్యాత తమిళ ఋషి "మానిక్కవసగర్" యోగదక్షిణామూర్తి బోధలుచేసినది. ఇక్కడ నుంచే నంటాన్నాడు (Page No. 124 of Tamilr Mundham by Devaneyan). ఇప్పుడున్న ఈ రెండింటిలో నాగర్‌కోయిల్ లోనున్న మహేంద్ర గిరికి మత పరంగా, ప్రశస్తి పరంగా ఆంధ్ర - ఒరిస్సా సరిహద్దులలోని మహేంద్ర గిరికి ఉన్న ప్రాశస్త్యంలేదు. మహేంద్రగిరిలో తూర్పున బంగాళాఖాతాన్ని తొంగి చూస్తున్న ఉత్తుంగ తూర్పు కనుమల శిఖరం పై పురాతనమైన శివుని గుడి కలదు.

ముప్పై అడుగుల ఎత్తున్న ఈ గుడి మొత్తము ఆరు శిలలతో నిర్మించబడి ఒక్కొక్క శిల సుమారు 20 నుంచి 30 టన్నుల బరువు గలవిగా ఉన్నాయి. ద్వారబంధ నిర్మాణంలేదు. రాకపోకలకు అనువుగా ఐదు అడుగులుగల ఎత్తులో రెండు ప్రక్కల మరియు రెండవ స్తరంలో గాలి వెలుతురులకు రెండు అంగుళముల ఖాళీ మాత్రము అట్టిపెట్టారు. ఈ గుడికి దాదాపుగా క్రీ. పూ. 2000 సం॥ల వయసు ఆపాదించవచ్చని భూగర్భ శాస్త్రజ్ఞుల అంచనా. బహుశా భూమి మీద ఎక్కడైనా మానవ నిర్మిత గుడులలోకెల్లా అత్యంతప్రాచీనమైనదిగా పరిగణించవచ్చు.

మహాశివరాత్రినాడు అతికష్టంతో రోజులకు రోజులు ప్రయాణిస్తూ, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్‌లలోని సుదూర ప్రాంతాలనుండి ఆటవికులు, గిరిజనులు, సంచార భిల్ల జాతులు ఈ గుడిని చేరుతారు. నేడు కూడా మహాశివరాత్రికి మాత్రం మొత్తము మూడు రోజులు ఈ గుడిని దర్శిస్తుంటారు. శ్రీకాకుళం నుండి - మందసకు - అక్కడినుండి చాపకోట అనే గ్రామం వరకు బస్సు సౌకర్యం అక్కడనుండి 25 కి. మీ కొండ గుట్టలపైన నడక ప్రయాణంచేయువలసియుంటుంది. శివరాత్రి తరువాత అక్కడ జనసంచారమే ఉండదు. దీనిని బట్టి పురాతన హైందవ నాగరికతలో సాంప్రదాయానుబద్ధంగా వస్తున్న ఆటవిక, పార్వతేయ, గిరిజన, భిల్ల అనేక సంచార జాతులకు ప్రభువైన - ప్రధమ యోగియైన ఆ పరమేశ్వరుని ఆరాధించే సాంప్రదాయంకలదని ఋజువు చేస్తుంది. ఇక్కడి కైలాస శిఖరాలలో సాలూరు వద్దగల 'పారోతమ్మ'అనే (పురాతన దేవి) ఆలయం కూడా శివరాత్రికి మూడు దినములు మాత్రమే దర్శిస్తూంటారు. కొండ శిఖరాన గల ఈ గుడికి కొండ నిలువుగా ఎక్కవలసియుండి సముద్రమట్టానికి సుమారు 1700 అడుగుల ఎత్తులో కలదు.

యోగదక్షిణామూర్తి ముఖ్య శిష్యుడు నంది లేకనంది. ఈ నంది జ్ఞాపక చిహ్నాలు తెలుగు దేశం అంతటా కోకొల్లలుగా ఉన్నాయి. మహానంది, నంద్యాల, నందిగామ, నందమూరులు పరిచితాలు. ప్రతి దేవాలయంలో శివుని అభిముఖంగా నంది స్థానం సుస్థిరం. భారతీయ అపర కర్మలలో లింగగ్రస్తి, నందీశ్వర పూజ ప్రముఖంగా ఆసేతు హిమాచలం వరకు కొనసాగుచున్న ఆచారమే.

త్రిలింగదేశం దాని ప్రాచీన రాజులందరూ ప్రఖ్యాత శైవులు రాజా ఖాలవేలుడు, శివశ్వతి, శివమఖ, శివలకుర్, శివశ్రీ, శివస్కంద, శివనాగ, స్కందస్తంబి మొదలయినివి ప్రాచీనాంధ్ర చరిత్రలో ప్రఖ్యాత నామాలు.

మహేంద్రగిరి పర్వత సాణువులలో భాగమైన ఆంధ్ర- ఒరిస్సా సరిహద్దులలో ఉన్న కోరాపుట్ జిల్లాలో 'కైలాస కోట' అనే దిబ్బ ఉన్నదని మనం గుర్తుంచుకోవాలి. విశాఖ జిల్లాలోని పోఖ పట్టణానికి భీముని పట్నానికి మధ్యలో "కైలాస పర్వతాలు" అనే మరొక పర్వతశ్రేణి ఉంది. రాష్ట్రకూట రాజులు నిర్మించిన ఎల్లోరా గుహాలలో 19వ నెంబరు గుహ కైలాస నాథ దేవాలయంగా ఉంది. ఈ మాదిరి రాష్ట్ర కూటుల మూలం తెలుగు గానీ కన్నడంగానీ శైవ సిద్ధాంత సాంప్రదాయంలో పూర్తిగా ఐక్యమైపోయి దానిని ఉత్సాహంగా పరిరక్షిస్తున్న ఒక తెగ తమిళనాడులోగల "వెల్లిల్లార్ల" తెగ, వీరి మూలాన్ని పరిశీలించినట్లయితే వీరు తెలుగు నాటనుండి తమిళభూమికి వచ్చినట్లు తెలుస్తుంది. 'సంగం' సాహిత్యంలో దీనికి కావలసినన్ని సూచనలున్నాయి. వెల్లార్లు, వెల్లల్లార్లు, అనార్యులు" - తమిళములోకి వలస వచ్చిన ఉత్తరాదులే, అని అగస్త్య గాథ వలన, 'నచినర్కకినియర్' చెప్పిన వెల్లిర్లను బట్టి బలంపుంజుకున్నట్లు కనిపిస్తుంది. (సుబ్రమణ్యాకవి వ్రాసిన "సంగం వ్యవస్థ"నుంచి గ్రహించవచ్చు).

ఆర్యులు దక్షిణాభిముఖ యాంత్ర వారినాయకుడైన విష్ణు నేతృత్వంలో జరిగినట్లు (ఋగ్వేదం 1-22 - 16 - 21) తెలుపుతుంది. దీనిని డా॥ హార్నల్ ప్రసిద్ధ సిద్ధాంతాన్ని సర్‌జార్జి గేయర్‌సన్' 'భాషాసర్వేక్షణం' అనువాదం ధృవీకరించింది. హిమాలయ ప్రాంతవాసులను ఆర్యులు కిరాతులు అనెడివారు, వారిది కిరాతభూమి, కృష్ణయోని అనెడివారు. హిమాలయాలలోని వైద్య నాథ్‌ను గురించి చెబుతూ అది 'కిర' గ్రామంగా మారిందని ఆ పర్వత భాగాలకు జలంధర ఖండమనే పేరుకూడా కలదు.

శంబరుడు - కిరాతజాతి నాయకుడు - నూరు పర్వత దుర్గాలకధిపతి. బలవంతుడు ఇతనిని జలంధర హరమూర్తిగా కాంగడా, కిరాతులు గౌరవించేవారు. దివోదాసు గణం పురుశాఖకు చెందిన భరతులు. మరియు కాంగరా కొండ జాతి వారెల్లరూ అజేయులైన దుర్గాధిపతులగుటచే ఆర్యులువార్ని వశపరచుకొనుటకు అనేక సంవత్సరములు జరిగిన యుద్ధమునే (సుమారు క్రీ. పూ. 1197-1190) దేవాసుర సంగ్రామంగా పరివర్తన చెందియుండవచ్చు. శంబరుని దుర్గమునకు 'ఉదవ్రజ' (నీటికోట) అది ప్రస్తుత 'కాంగడా' కావచ్చు. మహాబలశాలి అయిన శంబరుణ్ణి, మహాదైత్యుడిగా చిత్రించి, ఇంద్రునిచే సంహరించబడినట్లు కల్పన చేవారు. (ఋ. 6-31-4) డా॥ నిమియన్ స్మార్ట్" ప్రకారం సుసంపన్నమైన ప్రాచీన భారతీయ సంస్కృతిలో మార్పులకు ముఖ్య కారణాలలో ఒకటి ఆర్య - అనార్యుల మధ్య జరిగిన పరస్పర వైర ప్రక్రియ. భారతీయ వారసత్వంలో అభివ్యక్తమైన వైరుధ్యాలకు అదే కారణం.

సప్తసింధు ప్రదేశంలో ఉన్న పురాతన హిందువులు విజయులైన ఆర్యులకంటే, భౌతిక, సంస్కృతి, నాగరికతలలో మిన్నగా ఉన్నారు. వారు శిల్పాలు, తాంమ్ర యుగానికి చెందిన మొహంజోదారు, హరప్ప వంటి పట్టణాలను నిర్మించారు. ఆ శిల్ప విద్య, కళాకౌశలంపై ఆర్యులకున్న అపేక్ష, లాభాలను ఆశించి వారిని వదలుకో లేక వారితో సఖ్యతా, సంబంధాలను పెంచుకున్నారు. ముఖ్యంగా శిల్పులచేత పనులు, గృహ నిర్మాణాలు చేయించుకొని బాగా లాభ పడ్డారు(ఆర్యులు సంచార జాతి వారికి ఒక చోట నిలకడగా ఉండి గృహనిర్మాణాది కార్యాలు చేయటం ఎరుగరు).

దశ్యులు - ఋగ్వేద కాలంలో ఆర్యులకు ముఖ్యశత్రువులు కొండప్రాంత దశ్యులు హిమాలయాల కిరాతులే. క్రిష్ణయోని దశ్యులను ఇంద్రుడు నాశనం చేశాడు (ఋ. 2-20-7) ఇంద్రుడు కృష్ణత్వచులను (నల్లని చర్మం కలవారిని) నాశనం చేసెనని పరుచ్ఛేపుడు (ఋ. 1 - 130 - 8) ఇతడు శంబరుని జయించిన దివోదాసుకు పుత్రుడు, వశిష్ఠుడు వారిని 'శిశ్నదేవు'లన్నాడు. (ఋ. 7-21-5) శిశ్నదేవులను లింగపూజకులుగా వికేంద్రీకరించి హీనపరచబడ్డారు. ఈ సందర్భమున ఆర్య - అనార్య తెగల నడుమ సంభవించిన జాతి వైరాలు, ఆచార వికేంద్రీకరణలను గూర్చి కొంత విపులముగా వివరించవలసియున్నది. ఎందుకనగనంటేపూర్వ సంస్కృతిని అధ్యయనం చేసేటప్పుడు దానికి అనుసంధానంగా వున్న కొన్ని సంఘటనలను వివరించటం వల్ల చరిత్ర సులభంగా అవగతపరచవలెననే తలంపుతో గ్రంథాంతిక భాగాలను సంబంధంలేకున్నా, సాక్షికంగనే కొంత సంబంధం కలిగియుండుటవల్ల విశదపరచుచున్నాను.

**ఆర్యరాజు - మనువు :** "కామములను వర్షించు రుద్రుని తనయులగు మరుత్తులారా ! మీ పవిత్రౌషధములు సుఖమును కల్గించునవి. అట్టి ఔషధములను మా తండ్రియగు మనువు కోరినాడు. రుద్ర సంబంధమున నాకు హితమును, మంగళమును సమకూర్చునట్టి దివ్యౌషధములనుకోరుచున్నాను.

(ఋ. 2 - 33 - 13)

ఋగ్వేద కాలమునందు ప్రజాపతులుగానీ, ప్రజలుగానీ ఆరాధించు రుద్రుడు - పరమేశ్వరుడు సర్వశ్రేష్ఠుడుగా ప్రసిద్ధిచెందియున్నాడని తెలియుచున్నది. కాలక్రమమున ఆతని ప్రాముఖ్యతను తగ్గించి వ్యాసుని పరిధి విధముగా కల్పనలుచేసియుండిరని తెలియుచున్నది. కానీ నేటికీ ప్రజా విశ్వాసములో ఆయన స్థానము సుస్థిరముగనే యున్నది.

**దివోదాసు :** భరద్వాజ మహర్షి ఋగ్వేదం ఆరవ మండలమున వధ్రశ్యుని తనయుడుగా దివోదాసును వర్ణించాడు. ఇతని పురోహితుడు - భరద్వాజుడు. 50 వేల కృష్ణవర్ణులను సమరమున వధించబడినట్లు, గౌతముని తనయుడగు వాసుదేవుడు దివోదాసుకు యుద్ధమున సహాయపడినట్లు (ఋ. వే. 4-16-13) వివరించటమైనది.

ఇంద్రుడు శిలామయ శతపురములను దివోదాసుకై భేదించినట్లును వామదేవుడు తెలిపెను (ఋ. వే. 4-30-2) వివరించెను. "దస్యుడగు శంబరుని ఇంద్రుడు హిమపర్వతముపై మరణించునట్లుచేసెను. నాగలి సుఖముగా కృషి చేయుగాక (ఋ. వే. 4-57-4) అనియు, సఫలమైన నాగటి చాలు (ఋ. వ. 4-57-6) అను విషయములను కూడా వామదేవుడు పేర్కొనెను. దివోదాసు శంబర, కరంజయు, సంగృధుడాది దశ్య నాయకులను వారివందల దుర్గములను భేదించెను. దేవతలకు దివోదాసు ప్రియమైనవాడు. శంబరుని హత్యా సమయమున అశ్వినీ దేవతలతనిని కాపాడిరి. (ఋ. వే. 1-112-4).

**గృత్సమదుడు** : శౌనకుని తనయుడు గృత్సమదుడు. ఇతడు అత్రి సంతతి వాడని తెలిపినాడు (ఋ. వే. 9-86-48) గృత్సమదుడు శంబర, దివోదాసుల యుద్ధమును వర్ణించెను. (ఋ. వే. 2-19-6). "సారది యగు కుత్సునికై శుష్ణ, అశుష్ణ కుయవులను ఇంద్రుడు హతమార్చెనని, దివోదాసుకై ఇంద్రుడు 99 దుర్గములను కూల్చెనని (ఋ. వే. 2-19-6) గృత్సమదుడు తెల్పెను." ఇంద్రుడు దాసవర్ణమును నీచముగా భావించి నామ రహితమొనర్చెనని తెలిపెను (ఋ. వే. 1 - 12-4). "పర్వత నివాసి శంబరుడు అతడు నలుబది సంవత్సరములు యుద్ధమొనర్చి చివరకు ఇంద్రునిచే సంహరింపబడెను (ఋ. వే. 2-12-11) అను విషయము గృత్సమదుని యొక్క [illegible] తెలుపుచున్నది.

**కుత్సుడు** : ఋగ్వేదమున 15 సూక్తములకు ద్రష్ట. 'శుష్ణ, పిప్రు, వృత్ర, శంబరులను స్థానిక రాజులని, లేక దాసులను ఆర్యులు వర్ణించిరని పేర్కొనెను. (ఋ. వే. 1 - 103-8) భరద్వాజుని ప్రకారము చుమురి, ధుని, పిప్రు, శంబర, అశుష, వ్యంస, రుద్రిక ఆదులు దశ్య దాసులలో గొప్పవీరులని వశిష్ఠ, కుత్స, ఆంగీరస, గృత్సమదులు తెలిపిరి (ఋ. వే. 7-99-4., 1-103-8., 2-14-5). కుయవుని అతని ఇద్దరు భార్యలను ఇంద్రుడు వధించెను (ఋ. వే. 1-104-3) కుయవుని భార్యలు యుద్ధ విశారదులు. వారు కుత్స ఆర్జునేయునితో సంభవించిన యుద్ధమునపాల్గొని మరణించి యుండురు.

**శంబరుడు** : దివోదాసు, శంబరులకు 40 సంవత్సరములు యుద్ధము జరిగినది. ఇందు శంబరుడు అతనికి సహాయపడిన సామంతులు రాజులు, ప్రజలుని హతులైరి.

శంబరుడు కులితర తనయుడు. పర్వత ప్రాంతపాలకుడు, హిమాలయ ప్రాంతమున కాంగడా కోటయున్నది. శంబరుని పురము లాప్రాంతమందే యుండెను. ఇంద్రుడు శంబరుని 99 పురములను విధ్వంస మొనర్చెను. నూరవపురము నింద్రుడు దివోదాసుకొసంగెను. (ఋ. వామదేవసూక్తము 4-6-3). భరద్వాజ తనయుడగు గర్గుడు "శంబరుడు అతని సేనాని వర్చి, ఉదవ్రజమున చంపబడినారని తెలిపెను (ఋ. వే. వామ దేవసూక్తము 6-47-21) కాంగడా = జలంధర్ (కాశ్మీర్ లోయలోనిది)నేపాల్, కూర్మచలము (కుమాయి) కేదారము (గర్వాల్) గోగ్రా = దుర్గర (కాశ్మీరుకు తూర్పున సట్లెజ్ నది వరకు విస్తరించియున్న భూమి) డోగ్రా = దుర్గ (కాంగడా సరిహద్దులుగా రావినది యున్నది)

జలంధర దానవుని దేవి వధించినది, జలంధర్ కోటలో భవానీదేవి ప్రతిష్ఠింపబడినది. జలంధర దానవుని చెవి తెగిపడినచోటు కనగఢ్, లేక కాన్‌గఢ్ = కాంగడాయైనది. కొందరు శంబర యుద్ధమునే ఇంద్ర వృత్రాసుల సంగ్రామమని, ఈ యుద్ధము జలంధర, భవానీదేవి మధ్య జరగినదిగా అభివర్ణించినారు.

**నహుషుడు, యయాతి :** ప్రాచీన కాలమున భారతావని నేలిన రాజులలో శక్తివంతులు అగ్నిహోత్రుడు నహుషుని బలస్వాతునిగా నియమించె (ఋ. వే. 7-6-5) నని వశిష్ఠుడు తెల్పెను. "దేవతలు నహుషుని విశ్పతిగానో సర్చిరని (ఋ. వే. 1-31-11) హిరణ్యసూప్తుని ఋక్కు తెల్పుచున్నది. యయాతి నహుషుని తనయుడు. ఇతడు గొప్పశక్తిగల రాజు. రాక్షస గురువగు శుక్రాచార్యుని కుమార్తె దేవయాని, రాక్షసరాజుకుమార్తె శర్మిష్ట ఇతని రాణులు.

ఇట్లు ఋగ్వేదమున అనేక ఋక్కులలో ఆర్యులు, భారతావనిలో అప్పటికే పూర్తి నాగరికత కల్గిన రాజ్యాలను, శక్తిమంతులైన రాజులను అనేక రీతుల, మాయోపాయములననుసరించియూ, వార్ని దాసులు, దశ్యులు, రాక్షసులుగా చిత్రించి వారి స్వకీయమైన రాచరిక, ఆచార వ్యవహారములలో తలదూర్చి వారిని వధించిరని, వారి మత సాంప్రదాయాలు అవహేళన చేసిరని ఋగ్వేదప్రమాణములుగనే తెలియుచున్నది.

పూజార్థమున్న రాతిలింగాలు మైదాన దశ్యులు, పురాతన నగరములగు మొహంజదారో, హారప్పాలలో దొరికాయి, వారు నాగులను దేవునిగా కొలిచారు. నేటికీ అమలులోవున్న ప్రకృతిశక్తులుగా వృక్షాలను, నాగులను, నదులను, పర్వతాలను సూర్య చంద్ర, నక్షత్రాదులను పూజించే విధానానికి మూల సాంప్రదాయ మెంత పురాతనమైనదో తెలియుచున్నది. అనార్యులలో తేజోవంతులయిన వారిని ఆర్యులుగా చిత్రించారు. (Hindu History - P. No. 11, 12 By A. K. Mazundar).

పాశుపత దర్శనం - పంచరాత్ర దర్శనం ఈ రెండూ ఋషిప్రోక్తంకావు - పాశుపతం దేవుణ్ణి అంగీకరిస్తుంది. శివునికి మరో పేరే పశుపతి. పాశుపత దర్శనం - పశుపతి నుండి వచ్చినదే. మొహంజోదారోనాగరికతకన్నా ముందు కాలం నుండి లింగపూజ ఆచారంగా వస్తూవుంది. ఈ పూజా ధర్మమే కాలాంతరంలో పాశుపత ధర్మంగా, శైవధర్మంగా ప్రసిద్ధిచెందింది. ఒక దార్శనిక సిద్ధాంతాన్ని కూడా ఏర్పరిచింది. నేటి శైవులు పూజా విధానంలో నాటి పాశుపత దార్శనికుల ఆచారాన్నే కొనసాగిస్తారు. దర్శన విషయంలో శ్రీ శంకరుడి మాయావాద అద్వైత వాదాన్ని అంగీకరిస్తాడు. పాశుపత దర్శనాన్ని అనుసరించే శైవులు - జీవుడు (పశువు) జగత్తు, ఈశ్వరుడు (పశుపతి) ఇలాగ త్రైతవాదాని ప్రతిపాదిస్తారు. పాశుపత ధర్మావలంబులు "ఈశ్వరుడు జగత్తుకు నిమిత్తకారకుడు" అంటారు. బాదరాయణుని వివరణకూడా పాశుపత దర్శనం ఈశ్వరుణ్ణి నిరాకారుడంటుంది. అందువల్ల లింగ రూపాన్ని పూజించటం.

లింగాకృతిని పవిత్రతతో కూడిన పునరుత్పత్తి సంకేతంగానే గ్రహించాలి. వృషభమును వ్యవసాయ ప్రాధాన్యతగనే భావించాలి. స్త్రీయోనితో కూడిన ధాన్యపు కంకుల గుర్తులుగల ప్రాచీన గుహచిత్రాలు ప్రకృతి ఆరాధనతో కూడిన పునరుత్పత్తి సంకేతాలే. కళ్యాణ తిలకం, శ్రీమంత వేడుకలు కూడా పునరుత్పత్తి సంకేతాలే అందు అశ్లీల భావనలకు ఏ మాత్రం తావులేదని గ్రహించాలి.

**పాశుపతాస్త్రం :** భారత దేశంలో మొహంజదారో నాగరికత కన్నాముందు వున్న శైవదర్మంలో పాశుపత దర్శనం - పంచరాత్ర దర్శనం శివలింగ పూజాచారంగనే వస్తున్నవి. ఈ పూజా విధానమేమార్పుచెందినేటి శైవ పూజా విధానంలో నాటి పాశుపత దర్శనికుల ధర్మాలనే ఆచరించటం తెలిసినదే. ఆదిను తెగలన్నిశైవ సాంప్రదాయానురక్తులె. కిరాతులు, శంబరులు, పాశుపతులు తెగువకల్గిన యుద్ధవీరులు.

మహాభారతంలో అర్జునుడు మహేశ్వరుని తపస్సుచే మెప్పించి పాశుపతాస్త్రమును వరంగా పొందినట్లు చెప్పబడింది. వాస్తవానికి పాండవాదులు అరణ్యావాసమున కిరాతులు, పాశుపతులలో చెలిమి చేసి వారి అధినాయకులైన పశుపతుల సహాయముతో భారత యుద్ధమున సాహసులు, అజేయ పరాక్రమం కల్గిన పాశుపతుల సహాయంపొందియున్నారు. నేటికీ వీరు కాశ్మీరు కాండవా ప్రాంతము, మధ్య ప్రదేశ్ బస్తర్ ప్రాంతము. తమిళనాడు, కర్నాటక, కేరళ రాష్ట్రాలలో పాశుపతావలంబులు కలరు. నాటి కాలంలో మధురలో పాశుపతావలంబులు కలరని ఆ ఆచారమే కొనసాగుచున్నదని తెలియుచున్నది.

ఆర్య, అనార్య విభేదాలలో దేశీయ పరాక్రమవంతుల సహాయంతోనే దాయాదులను ఎదుర్కొని వారికి విశిష్టతనీయ లేక ఈ సహాయమును అభిమంత్రించిన అస్త్రంగా రూపొందించటం జరిగిందని తెలియుచున్నది.

**నాగులను - చెట్లను పూజించే ఆచారం :**

నాటి నాగరికతలో ప్రజలు ముఖ్యంగా చెట్లను, జంతువులను ఆరాధించెడివారని, దేవతలుగా, స్త్రీమూర్తులుగా శివునిగా (Phallus) కొలిచెడివారని 'ఎద్దు' ను సీల్‌గా రాజముద్రగా లభించినవి. (A new History of India - P. No. 17. By Ishwari Prasad, Allahabad) మరియు K. R. శ్రీనివాసు తన Temples of South India లోకూడా తెల్పియున్నారు. ఆ సాంప్రదాయాలను అనాగరికమైనదిగా, రాక్షసమైనదిగా అవి ఆచరించే వారు నరహంతకులుగా చిత్రించి వారిని హింసించితమ ప్రాబల్యములను మహిమలను ప్రచారంచేసిన ఆర్య నాగరికత పూర్తి సఫలీకృతమైనది. (India from the earliest Ages - By J. Tal boys wheeler (Vol. III)

నాగదేవతారాధన గురించి The History of the Brohminical re-vival" VII అధ్యాయములో "It may however, be remarked that the worship of the serpent was allmost universal in ancient times.

ఇండియా, ఈజిప్ట్, జరూసలేమ్, బర్మా ఇంకా అనేక దేశాలలోసర్పములను సంతాన దేవతలుగా అరాధించటం చరిత్ర ఎరిగినదే.

Prof. V.S. Agrawala గారి పరిశోధనలలోకూడా సింధులోయ నాగరికతపై వారు వెలిబుచ్చిన అభిప్రాయములు - In India, the tree worship became quite common in the third or fourth millinium B.C. When there was -a-highly evolved Harappan culture. Among the seals of Mohanjodaro one is depicting a stylised pipal tree with two heds of unicorn emerging from its stem. (ఒక రావిచెట్టు మ్రానునుండి నొసట కొమ్ములుగల రెండు తలల జీవి బయటకు వచ్చుచున్నట్లుగల చిత్రమును మొహంజదారో ముద్రలయందు చిత్రించియున్నదని తెలియుచున్నది.

A seal from Harappa is engraved with the likeness of weeping willow tree with hanging branches. Painted pottery of the Indus Valley often includes palms ad pipal tree etc. In an environment full of danger to life the trees were the best friends of men. That is why the Indus people regarded them as beneficient devotes. In fact it was supposed to be a symble of fertility. "On a seal from Harappa a woman is represented with a plant coming out of her womb, a flamboyant (అచ్చెరువు కల్గించెడు) symbol of fertility".

ప్రొఫెసర్ S.K. రామచంద్రరావు తన "The folk origens of Indian temples" లో హైందవ నాగరకతలో వృక్షాలను పూజించటంలో అనేక పరిశోధనలు చేసిన వారు తమ అభిప్రాయాలలో అలా పూజించటంలో వానిలో ఆత్మలు కలవనే విశ్వాసం, రక్షణ నీయగల్గినవిగా, ప్రేమ సంబంధమైన గుర్తులు గనే భావించారు. ఇందు కొన్ని వృక్షాలనుమాత్రమే పూజార్హమైనవిగా తీసికొన్నారు. అవి రావి, వట, బిల్వ, వేప వృక్షాలను మాత్రమేనని వివరించారు.

నాగపూజ సింధూలోయ నాగరికతా కాలంనుండి వున్నదని, నాగులను, చెట్లను పూజించే పురాతన భారతీయ తెగవుండేదని మొహంజదారో, హరప్పా నాగరికతావశేషాలలో బయల్పడిన సత్యాలే. వేదాలలో కూడా, వ్రిత్ర (AHI) అనే నాగరాజు ఇంద్రునికి ప్రధానశత్రువని వచించబడినది. దక్షిణాదిన సుబ్రమణ్య స్వామి (స్కంద)ని "వాల్మీకేశ్వరుని" గా కొలుస్తుంటారు. వైష్ణవంలో కూడా మహావిష్ణువుకు పాన్పుగా (అనంతశయన)ను, తమిళనాడు, కేరణ రాష్ట్రాలలో దుర్గాదేవత దారుశిల్పాల కిరీటాలపై నాగు ప్రతిమలు చిత్రించినవి కలవు. సంస్కృత శబ్దమైన 'నగ'లో నగము, కొండ, నాగ - నాగు పాముయొక్క సమ్మిళిత అర్థము గోచరిస్తుంది.

ఆంధ్రా, తమిళనాడు రాష్ట్రాల తీర ప్రాంతాలలో పర్వదినాలలో ఎరుపు, పసుపు, తెలుపు, పచ్చరంగులలో ముగ్గులు నాగమండలాలుగా ఏర్పరిచి అందు నాగుల నృత్యం చేయటం బహు పురాతన కాలంనుండి వచ్చినదే.

పర్వాతారాధన పురాతన కాలంలో ఎన్నో దేశాలవారు భక్తి భావంతో ఆరాధించే వారని తెలియుచున్నది. జపనీయులు - "కామి", చైనీయులు - "షెన్", పర్షియన్‌లు - 'అల్‌బర్జ్", గ్రీకులు - 'వలంపియర్స్", సెల్‌టేస్ - "సోసిస్యూసర్స్", బాబిలోనియాలో - 'ఇన్‌లిన్" గా పూజించేవారు. భారతదేశంలో, హిమాలయాలు (గౌరిశంకర శిఖరం, నందాదేవి) విధ్య, సహ్యా, మలయ, కుమార, శ్రీశైలాదులను పూజించటం మనమెరిగినదే.

బహుపురాతన లింగ రూపాలు కొండ యొక్క సూక్ష్మరూపాలుగనే ఎంచి పూజించేవారు. అవి గుండ్రంగా వుండక కొండ ఆకారం కలిగి సూక్ష్మాకృతిగా, దైవశక్తిగా పూజించేవారు.

ఒక శైవ ఆగమధర్మంలో శివలింగాకృతి సూక్ష్మ రూపమైన కొండ గురుతుగా వానిని చుట్టి పడగ విప్పిన నాగును చెట్టుగా కూడా భావించటం. ఈ మొత్తం ఆకృతి చెట్ల క్రిందనే వుండటం మనకు సర్వత్రా కనుపిస్తుంది.

కాశీక్షేత్రంలో విశ్వనాధలింగము చరిత్ర చెప్పలేని కాలములో నర్మదాతట మందుండి తెచ్చినట్లు, ఉజ్జయినిలోని మహాకాళేశ్వరుడు, రామేశ్వరమునందలి శైకతలింగము, వైద్యనాద్ నందలి వైద్యనాధేశ్వరుడు, శ్రీకాళహస్తియందలి వాయులింగములు నల్లని గ్రానైటు రూపంగానూ ఇవి అన్ని స్పష్టత లేని లింగరూపాలు పర్వతములయొక్క సూక్ష్మరూపాలుగా మహాశక్తివంతమైనవిగా ఎంచే పూజాచారం నేటికీ వున్నది.

"ఈ విశ్వానికి ఒక కర్త ఉంటాడని ఊహించి అతడు నిరాకార ఈశ్వరుడే అనటం సరికాదు. నిరాకారుడుని కర్త అని ఎలా నిరూపించగలం?" నిరాకారుడైన జీవుడు శరీరానికి, ఇంద్రియాలకు అధిపతి కాలేదా?" అలాగే నిరాకార ఈశ్వరుడు ఈ జగత్తుకు కర్త ఎందుకు కాకూడదు? జీవుడు కర్మ ఫలం అనుభవించాల్సిన పని వుంది కనుక ఇంద్రియాలకు, శరీరానికి కర్త అయినాడు. "కర్మ బంధన ముక్తుడైన పశుపతికి కర్మఫలంతో సంబంధం ఉండదు. అందువలన శరీర ధారణ చేయవలసిన పని వుండదు". అందువల్లనే ఈశ్వరుడు నిరాకారుడు, నిరంజనుడు, నిర్గుడు, నిత్యుడు, సర్వజ్ఞునిగా ఎరగవలెను.

సత్యానికి సంబంధించిన ద్వైత సిద్ధాంతాన్ని సాంఖ్య దర్శనం విస్తృత పరచిందని ప్రఖ్యాత సామాజశాస్త్రవేత్త "మాక్స్ వెబర్" - భారతీయ మతం (Religion of India) అనే తన గ్రంథంలో వ్రాశాడు. సాంఖ్య దర్శనాన్ని మొదట వ్యవస్థాపించినవాడు కపిలుడు. విశ్వమాయాద్వైత సిద్ధాంతం (The Monistic doctrin of cosmic illusion)

వేదాంతం అనే పేరుతో ప్రసిద్ధమైనది. సాంఖ్యం నిస్పందేహంగా భారతీయ మేధావుల ప్రామాణిక తత్వమైన వేదాంత సిద్ధాంతం కంటే ప్రాచీనమైనదిగా తెల్పియున్నారు.

క్రీస్తుపూర్వమే ఎన్నో వేలసంవత్సరాల క్రితం భారతీయులు గ్రీకు, శిరియా, బాబిలోనియా అరబ్ ప్రాంతాలలో ఉండిరని ఎన్నో చారిత్ర ఆధారాలు కలవు. క్రీ. శ. 1888లో ఏమిల్ బుమౌట్ (Emile Bumount) "ఈ శతాబ్దంలో గొప్ప పరిశీలనలో వెల్లడయిన నిజాలు 1) క్రైస్తవ మతమునకు సంబంధించిన చాలా విషయాలు హిందువులనుండి వచ్చినవని 2) గ్రీకు పురాణాలు స్వతసిద్ధములు కావని తెలిసిందని వ్రాశారు. సిరియా, పాలాస్తినా ప్రాచీన రాజుల పేర్లు సంస్కృత నామాలలో కూడి వున్నవని, అర్తతమ, (ఋతతమ) తుష్రత్, సుబంధు అనునవి కొన్నిపేర్లు, సిరియా ప్రాంతమందు హిందువులు క్రీస్తుకు పూర్వం సుమారు మూడు వేల ఏండ్ల క్రిందిటే వెళ్ళియున్నరని ప్రాశ్చాత్యులే వ్రాసియున్నారు.

ఇలా మన భారతీయ పురాతన సంస్కృతి ఒనేక ఒడుదుడుకులకు లోనైనప్పటికీ దానియందు గల సత్యప్రమాణాలే దాని ఔన్నత్యాన్ని నేటికీ నిలిపియుంచినవని తెలియుచున్నది.

**మతం - మానవతా వాదం :**

హిందూ మత తార్కిక భావనలను ఉపనిషత్తులు చాలా ఎక్కువ గ్రహించాయి. చింతనా ప్రపంచంలో వచ్చిన సాహసోపేతమైన నూతన పరికల్పనలను "సమన్వయం, రాయితి, రాజీ"లను ఆయుధాలతో సాంప్రదాయ వాదులు ఎదుర్కొన్నారు. (P. No. 12. The cultural Heritage of India, By Haridas Bhattacharya).

ఈ సంస్కృతీకరణ ప్రక్రియ భగవద్గీతలో వైరుధ్య తత్వాలలో పరాకాష్ఠచెందిందనే విషయాన్ని గ్రహించటం కష్టమేమికాదు. సత్యానికి సంబందించిన ద్వైత సిద్ధాంతాన్ని సాంఖ్యా దర్శనం విస్తృతపరచిందని ప్రఖ్యాత సమాజ శాస్త్రవేత్త మార్క్స్ వెబర్ (భారతీయమతం) అనే తన గ్రంథంలో వ్రాశాడు. సాంఖ్య దర్శనాన్ని మొదట వ్యవస్థాపించినవాడు కపిలుడు. విశ్వ మాయాద్వైత సిద్ధాంత, వేదాంతం" (The Moniotic Doctrine of cosmic illusion) అనే పేరుతో ప్రసిద్ధమైనది. సాంఖ్య బోధనలను ఉపనిషత్తులు ముందుగనే ఊహించాయి. సాంఖ్యం నిస్పందేహంగా భారతీయుల మేధావుల ప్రామాణిక తత్వమైన వేదాంతసిద్ధాంతం కంటే ప్రాచీనమైనది, ముందరిది. యోగంతో దానికున్న సంబంధం దీనిని ఋజువు చేస్తుంది. యోగ విధానం దాని నిర్మాణాలకు పూర్వ నిబంధనలను తయారు చేసింది. బౌద్ధంలో సహా తొలిమత శాఖలు భిన్న ధర్మాలు రూపొందటంలో అది చూపిన ప్రభావంకూడా దాని కాలాన్ని ఋజువుచేస్తుంది. మహా భారతంలోని ముఖ్య విషయాలన్నీ మొదట సాంఖ్యం

ప్రభావంలోనే రూపొందించబడి, ఆ తరువాతనే వేదాంత పరిభాషలోకి మార్చబడ్డాయనే సంగతి మరొక ఋజువు (P. No. 176 of the religion of India ^ By Max-Vebar) ఇప్పటి భగవద్గీత D.D. కౌశాంబి చెప్పినట్లు బ్రాహ్మణ మత సారంగా రూపొందించింది.

**సమసమాజం :**

శ్రీ రామలింగ అదిగలరు శైవాన్ని "సమర్ధసన్మార్గం" లేదా "ఉద్ధారవాద పథం" అన్నారు. 'తిరుఅరుత్పా' అనే తన తమిళ ప్రామాణిక గ్రంథంలో మానవాత్మల సమానత్వాన్ని ఆధ్యాత్మికత ప్రగతిని, ఆనందాన్ని పొందటానికి ప్రయత్నించటానికి, వాటికి అంతర్గతంగా వున్న హక్కులను స్పష్టంగా వివరించారు. ఉద్ధార వాదానికి, ఆత్మల సమానత్వానికి ఇచ్చిన ఈ ప్రాముఖ్యం సిద్ధులు, నాయనార్లు రచించిన దాదాపు అన్ని కృతులలోనూ మనకు కనుపిస్తాయి. 20వ శతాబ్దానికి చెందిన శైవతాత్విక ఋషి తిరు కళ్యాణ సుందరనరు శివ, మురుగల భక్తి గీతాలను రచించారు. అనేక పీఠాధిపతుల కంటే సమతావాదులు లౌకికవాదులు శైవవాదం కేవలం పరమత సహనాన్ని చూపటమేకాక పరమతాల అంతర్గత విలువలను ఒకరు తన ఆధ్యాత్మిక యత్నాలను మెరగు పరచుకోవటంలో వాటి ఉపయోగాన్ని ఏవేచిస్తాయి. మానవ కుటుంబ మంతా ఒకటే అయితే మానవాళి విధికూడా ఒకటే కావాలి. శివజ్ఞాన బోధనల ప్రకారం మానవాత్మదేవునికి దివ్య ఏశ్వస్వభావాలను పంచుకొంటుంది. ఆత్మ దేవునితో తనకున్న తాదాత్మ్యాన్ని, విశ్వంతో తనకున్న భేదాను గుర్తించినప్పుడే ఆత్మ యదార్థీకరణం లేదా జ్ఞానోదయం పొందినట్లు భావించబడుతుంది. మిగతా మానవాళి అంతా ఒకటేననే జ్ఞానం వ్యక్తికి వుండాలి. ఈ ఆత్మ ఐక్య ఆధారంగానే స్వేచ్ఛ, సమత, సౌభ్రాతృత్వాల భావనలు రూపొందించబడ్డాయి. ఈ అంతర్గత సంబంధతత్వమే సమసమాజానికి ఆధ్యాత్మికాధార భూమి అవుతుంది.

స్వేచ్ఛ, లౌకిక వాదంగా ఒక వ్యక్తి నిస్వార్థంగా, నీతిలో వున్నంత కాలం అతడి స్వేచ్ఛను గౌరవించమని సమాజాన్ని అడిగే హక్కు అతనికున్నది. స్వామి వివేకానందుడు చెప్పినట్లు "పరిశుద్ధంగా నిస్వార్థంగా వుండు. అదే మతసారం మొత్తం". అటి పరిశుద్ధత, నిస్వార్థతలైన లేదా స్వేచ్ఛ, సమత, సౌభ్రాతృత్వాలయిన పరిపూర్ణత అనేది ప్రపంచానికి సంబంధించినది. ఇది సత్యం. కానీ ఆధ్యాత్మికాచరణానందం ఇంకా సరళంగా చెప్పాలంటే విధి నిర్వహణలోని సంతోషం, ప్రయత్నాలు చేయటంలో ఎంతవుందో లక్ష్యసాధనలోనూ అంతేవుంది. స్వామి వివేకానందుడన్నట్లు "భారతదేశంలో సంస్కర్తలంతాఒకే తప్పిదంచేశారు. పురోహిత వర్గంచేసిన దోషాలన్నిటికి భారత దేశ హైన్యానికి మతాన్ని తప్పుపట్టారు. అందువలన వారంతా నాశనముచేయువీలులేని

దుర్నీతిని కూల్చటానికి పూనుకొన్నారు. ఫలితం- వైఫల్యం. బుద్ధుడు మొదలు రాజా రామ్‌మోహనరాయ్ వరకు ప్రతి ఒక్కడు కులాన్ని మత సంస్థగా భావించి మతాన్ని కులాన్ని కలిపి పెకలించివేయ ప్రయత్నించి విఫలమైనారు. అది నేడు భారతదేశ వాతావరణాన్ని దుర్గంధంతో నింపుకొంది. ప్రజలకు తాము పోగొట్టుకొన్న సామాజిక వ్యక్తిత్వాన్ని తిరిగి ఇవ్వటం ద్వారా మాత్రమే దాన్ని తొలగించ సాధ్యమౌతుంది. భారత దేశంలో పుట్టిన ప్రతి ఒక్కరూ తాము సమాజానికి బానిసలమనే భావన, ఇప్పుడు వికాసానికి కావలసింది స్వేచ్ఛ, స్వాతంత్ర్యం వచ్చి ఇన్ని సంవత్సరములు గడిచినా భారతీయ వాతావరణాన్ని దుర్గంధంతో నింపుతున్నది మతనాయకులే.

మతస్వేచ్ఛ అందరికి సామాన్యమైన అమూల్యమైన సంపద. ఆధ్యాత్మిక స్వేచ్ఛా ఫలితాలు అందరికి అందుబాటులో ఉండాల. సమాజంలోని మతాధికారులు సంకుచితశాఖ మత దృక్ పథంలో వారికి ఉపదేశం చేయరాదు. తమ అనుచరుల సంఖ్య గూర్చి మాత్రమే లేక వారి ఆధ్యాత్మిక ఆరోగ్యాన్ని గురించి కూడా మత గురువులు ఆలోచించాలి.

మానసిక వికాసం, చేతన ఉపచయం ప్రతిమనిషి జన్మహక్కు, సమతకు అర్హతనిస్తుంది. జ్ఞానమనే మూడవనేత్రం తెరవటంచేతన స్థాయిని వృద్ధి పరచటం ప్రతి ఒక్కని విధి. ఇది ఒకరిది ఒకరికి రాదు. ఒకరు సంపాదించిన భౌతిక సంపదను మరొకరు అనుభవించవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ఎవరికి వారు మాత్రమే ఆర్జించుకోవాలి. దానిని అప్పుగా ఇవ్వలేము, అప్పుగా గ్రహించలేము. దానిని అపహరించలేము. కాదనలేము. మానవులందరిలోను పెంచిపోషించవలసిన ఆధ్యాత్మిక శక్తివుంది. ఇది ఆధ్యాత్మిక సమతా భావన ఇందులో మాత్రం ప్రతివ్యక్తికి ఎవరి స్వతం వారి కుంది. ప్రస్తుత హిందూ మతంలోని బ్రహ్మజ్ఞాను లనదగిన ఆధ్యాత్మిక వాదులెల్లరూ వారు వారికి తెలిసినది బోధించడంద్వారా శతాబ్దాలుగా ఆధ్యాత్మిక వికృత రూపాలననుసరించి వస్తున్న మూఢ సాంప్రదాయాలను విడనాడే సంస్కృతిని వెదజల్లడం ద్వారా భారత ప్రజలను ఉద్ధరించడానికి గట్టిగా కృషిచేయాలి. నిజమైన బ్రహ్మజ్ఞానమేమిటో ప్రతి భారతీయునికి బోధించాలి. వ్యక్తి తన జీవితంలోని నిస్వార్థ సేవా దృక్పథంలో తనకు విదితమైన విధులను నిర్వర్తిస్తే అతడు అట్టి నిర్వహణద్వారా భగవంతుని పూజిస్తాడు. భారతావనిలో మొట్టమొదటి సారిగా వర్గరహిత, వర్ణరహిత సమాజానిచ్చింది పురాతన హిందూ శైవసిద్ధాంతమే. తదుపరి దాని స్థానాన్ని మరల బౌద్ధం కొంత ఉద్ధరించింది. ఈ సమ సమాజ స్థాపనకు వ్యతిరేకించిన వర్ణ వ్యవస్థాపకులు పురాతన శైవ సిద్ధాంతాన్ని కించపరచటానికి, దాని సంకేతాలను అవహేళన చేయటానికి, వారిని అనాగరికులుగా చూపి వారి సిద్ధాంతాలలో మార్పుతీసుకొని వచ్చే దానికి బౌద్ధాన్ని భారతంనుండి వెడల గొట్టటానికి, ఎన్నో తాంత్రికాలు అవలంభించి చాలా వరకు

సఫలీకృతమైనది. నేరం, పాపాలు బాగుచేయటానికి ఏలులేనంతగా విజృంభించాయి. న్యాయసూత్రాలను విశ్మయం గొలిపే మత గాథలలో మునిగిపోయాయి. ప్రతి బుద్ధిహీన ఆచారాన్ని ఈ మతగాథలు హాస్యాస్పద సమాధానాలతో బలపరుస్తాయి.

క్రీ. పూ. ఐదు ఆరు శతాబ్దాలలో వర్ణ వ్యవస్థ దేశంలో విశ్వసించిన ప్రేరణ అప్పటికే సమతా ప్రేరణ అయింది. సిద్ధార్థుడు ఈ లౌకిక సోషలిజం పంథాను ఎంతో ప్రాచీనమైన శైవ సిద్ధాంత సాంప్రదాయపథంలో మాత్రమే అనుసరించాడు. దాదాపు సిద్ధులంతా అతనికి ముందరివారే. తిరుమలరు, తిరువళ్ళువరు లాంటి అతనికి తరువాత వచ్చినవారు అధోకులాలనుండి వచ్చినవారు కావటంవల్ల ఆధ్యాత్మిక స్వేచ్ఛ, సమతా సూత్రాలను అవలంభించినందు వల్ల అతడి లాగే లౌకిక సమాజ వాదులు కాగలిగారు.

సౌభ్రాతృత్వ సూత్రం ద్వారా మాత్రమే స్వేచ్ఛ, సమతలను ఒక దానికొకటి పరిపూర్ణ కాలం చేయటం సాధ్యం. శైవమతప్రకారం వ్యక్తి జ్ఞానోదయం తాను మిగతా మానవాళికిచెందిన వాడని సత్యానికి దారితీయాలి. ప్రస్తుతం అనేక శతాబ్దాల ముందు వ్రాయబడిన కవి పునగుంటరు తన పద్యాలలో ఆధ్యాత్మికతతో సమతా, సహానుభూతి, ప్రేమ, త్యాగం తత్వాలనేకం బోధించాడు.

భారతదేశంలో ఒక వ్యక్తి ముందు బ్రాహ్మణుడు, బనియా, లేదా శూద్రుడు, ఆదిమ జాతి ఆ తరువాత అతడు "మనిషి" భారతీయుడౌతాడు. జన్మ లేదా గుణర సూత్రం ఆధారంగా కులదాస్యం. మతంలోదోషమేమిలేదు. పారమార్థిక, వ్యవహారిక సిద్ధాంతాల రూపాలలో అన్ని రకాల జనపీడన యంత్రాంగాన్ని కనిపెట్టిన హిందు మతం కాపటి కులదే దోషమని గ్రహించగల్గిన వివేకం ఏర్పడాలి. హిందూ మతంలోమానవ ప్రతిష్టను అంత ఉన్నతంగా బోధించే మరోమతం ఈ భూమి మీదలేదు. పేదలను, అధోవర్గాలను ఆపద్ధతిలో అంతగా కాలరాచిన మతం కూడా మరొకటి ఈ భూమి మీద లేదు. సిద్ధాంతానికి ఆచరణకు మధ్య ఈ వ్యత్యాసం ఎందుకు వచ్చిందంటే సిద్ధాంతం సిద్ధాంత శైవబోధనలమీద, ఆచరణ విధి వాదం మీద ఆధారపడ్డాయి. అందువల్లనే సిద్ధాంతం చెప్పుకునేందుకు ఉన్నతంగా కనుపిస్తుంది. కాని ఆచరణంలో పాషండ ప్రకృతులయి, విధి, ఆచారం, వర్ణం, పరంపరలు భావదాస్యం రాజ్యమేలు తున్నాయి.

ప్రస్తుత కాలాలలో వాటి ఫలితంగా కలిగే అరిష్టాల శృంఖలాలనుండి రక్షించబడాలి. సౌభ్రాతృత్వానిపంచే గట్టి మార్గంపైనడవాలి. శతాబ్దాలతరబడి పేరుకుపోయిన చారిత్రక ప్రక్రియ దుష్ఫలితాను అధిగమించాలంటే చరిత్రనడకను మళ్ళించటానికి, చరిత్రపై మనకు సరిఐన అవగాహన వుండాలి. దృఢమైన సంకల్పం వుండాలి. ఆ విశ్వసంపదను బయటకు తేవాలి, అందరికి పంచాలి.

ఈ మానవతా వాద సూత్రాలను భారతీయ సమాజం అంగీకరించి వాటి ఆధారంగా నడచుకోనంత కాలం అత్యంత భవిష్యత్తులోగాని జాతికిముక్తిలేనట్లు కనుపిస్తుంది. జాతి ఖండమూర్తిమత్వాన్ని గుర్తించాలి. ముందు వెనుకలు విరుగుడు చర్యలు చేపట్టాలి. శాస్త్రీయ, సాంకేతిక ప్రగతిలో ప్రపంచం వేగంగా కుంచించుకుపోతుంది. మానవ కుటుంబం భావన రానురాను వాస్తవికతను సంతరించుకొంటుంది. శైవ పరిహితేచ్ఛ, బౌద్ధ అనుకంప, జైన అహింస, క్రైస్తవ సహానుభూతి, ఇస్లామ్ సమతావాదం, మొత్తం మానవాళి ఉమ్మడి వారసత్వం. ప్రతిమతం ఇతరులలో ఆధ్యాత్మికానుభవాన్ని పంచుకొని పరస్పరం ప్రయోజనం పొందటానికి ముందుకు రావాలి. దిన దినాభివృద్ధిచెందుతున్న శాస్త్రీయ విజ్ఞానం యొక్క అనుభవాలను ఆస్వాదించి వాటిని మానవజాతి ప్రయోజనాలకు ఉపయోగించే విశాలమైన మనస్సేర్పడాలి. ఏ సమాజం, ఏ దేశం ఏ ప్రజ వెనుకబడి కలకాలం మనలేదు. ఆత్మ అంతరాళాలలో ప్రాథమికమైన పరివర్తన లేకుండా కలకాలం కొనసాగే భౌతిక లేదా ఆధ్యాత్మిక ప్రగతి వుండే వీలులేదు. వ్యక్తిగానీ దేశంగానీ ముఖ్యమైనది మత బోధకాదు. ఆధ్యాత్మికాచరణ ముఖ్యం అని గ్రహించాలి. మానవుడు ఆర్జించే సంపదలన్నింటిలో ఏదీ కూడా పరద్వేషంనుంచి ముక్తికి సమంకాదు. అందువల్ల ఈ రకమైన సహజ నైతిక ప్రపంచం. జీవితాల స్వీకారం, బ్రాహ్మణ మతంలో, బౌద్ధంలో, భగవద్గీతలో, హిందూ మతంలో అటువంటిదేమీ ఆచరణలో లేక పోయినప్పటికి, నాటినుంచి నేటి వరకు మన భారతీయ జీవన స్రవంతిలో వుంది. ఏవర్ణాలనుంచి వచ్చినా, ప్రజల మధ్య నివశించి, వారిలో సహానుభూతి పొందిన మహామత గురువుల ద్వారా హిందూ చింతనలో క్రమంగా చొచ్చుకుపోతుంది. వాని అత్యున్నతి విలువలు ఎన్నో వేల సంవత్సరాలకు పూర్వమే ప్రపంచానికి విస్మయం కలిగే విధంగా చాటి చెప్పింది భారత దేశమొక్కటే. ఆ పవిత్ర భారతావని యొక్క ఉత్కృష్ట సిద్ధాంతాలను కాలగతిలో కల్పివేయక, అంతే సద్భావనలతో తిరిగి తిరిగి ప్రచారం చేయవలసియున్నది. అదే దేశ సౌభాగ్యం, వ్యక్తి, సమాజ సౌభాగ్య కాగలదు.

## పరిశీలన గ్రంథములు (BIBLIO GRAPHY)

1. భారతీయ దర్శనం - రాహుల్ సాంకృత్యాయన్ & తెలుగు అకాడమీ.
2. ఋగ్వేద, యజుర్వేద దర్శనములు - Dr. K. V. Raghavacharya.
3. తిరుక్కురళ్ - తిరువళ్ళువర్ - Dr. C. Rajagopalachari
4. భగవత్ గీత
5. రూపధ్యాన రత్నావళి, కాశ్యపశిల్పశాస్త్రము - A.P. దేవాదాయ ధర్మాదాయశాఖ.
6. The New History of India - Dr. Eswari Prasad.
7. India - The Land and People - K. R. Srinivasan
(Temples of South India) National Book Trust.
8. Daily Life in Ancient India
By Jeannine Auboyer - Tranby.
Simon Watson Taylor.
9. Introduction to oriental Civilization Source of Indian Tradition.
Edt : WM. Theodore De Bary.
10. Ancient India and Iran.
A Study of Their cultural Contants.
By Nalinee M. Chapekar.
11. India from the earliest Ages
(Hindu, Buddhist & Brahmanical Revival)
Vol. III. of the history of India.
By J. Talboys Wheeler.
12. The History and Culture of the Indian people.
"The Vedic Age"
By R. G. Majumdar.
13. The cultural Heritage of India.
(Itihasas, Puranas, Dharma and other sastras)
By Dr. C. P. Rama Swamy Aiyar.
14. Myth and Reality.
(Studies in the formation of Indian Culture)
By D. D. Kosambi.

15. Mohenjo-daro and the Indus Civilization.
By Sir John Marshall.
16. The cultural Heritage of India.
P. No. 63, By - K. A. Nilakantha Sastri.
17. Origin and Evolution of Religion.
P. No. 22, By - E. W. Hopkins.
18. Tree and serpent worship.
P. No. 1, 2, By - James Fergussion.
19. Hinduism and Symbol worship.
By B. C. Sinha (G. K. University - Hardwar)
20. "Indian Art" by V. S. Agrawala.
21. భారతదేశ చరిత్ర - సంస్కృతి
"వేదయుగం" By B.N. Sastri.
22. ఋగ్వేదార్యులు - శ్రీరాహుల్ సాంకృత్యాయన్
23. The Folk Origins of Indian Temples
By Prof. S. K. Ramachandra Rao
24. Ten Saints of India. By T.M.P. Mahadevan
25. A. History of Ancient India
By Arun Bhattacharjee
26. The Script of Harappa and Mohenjo-daro.
By G. R. Hunter
27. prehistoric civilization of the Indus Valley.
By K. Dikshit.
28. Mohenjo-dro and Indus civilization - 3 Vals.
By Sir John Marshall.
29. Religious Tought and life inIndia.
By Monier - Williams.
30. Geographical Factors inIndian Hisotry
By K. M. Panikkar.
31. The Arctic Home of the Aryans.
By B. G. Tilak.

32. Parallels and opposites in Indian Iconography

By C. Sivaramamurti.

33. The wonder that was India.

By A.L Basham.

34. Incredible India. By P. Thomas.

P. No. 15, Fig. XV., Fig. XXXVII.

35. India's contribution to world thought and culture.

By B. B. Lal

Publi : Vivekananda Rock Memorial Committee P. No. 193.

36. Caste, Culture and Socialism - P. No. 66.

By Swamy Vivekananda.

37. Religion and Society

Dr. S. Radhakrisnan.

38. History of India

(From beginning of 1526 A.D.)

By V. D. Mahajan.






*Seals from Mohenjodaro.*







*Sealings from Mohenjodaro.*



Naranārāyana, Deogarh, Jhansi dt.

# పురాతత్వశాఖ గుహ చిత్రాలు, శిల్పాలు



పశుపతి





శివుని ప్రతిమలు



సింధు నాగరికత నాటి శకటము





లిపి ముద్రికలు



Śiva, Guḍimallam, Chittoor dt



Martandabhairava, Konarak, Puri dt



Sūryachaturmukha from Java.



1
కర్నూలు



2
ఈస్టర్ ద్వీపం



3
పెరస్



4
కొలంబియా



5
పాలనేసియా

ఈ చిత్రాలు సుమారు క్రీ.పూ. 4000 నుంచి క్రీ.పూ 5000 మధ్య కాలంలోని సమాచారాన్ని అందిస్తున్నాయి.



bricks and food for the wild elephant and rhinoceros, and Balūchistān, now almost a waterless desert, was rich in rivers. This region supported many villages of agriculturists, who had settled in the upland valleys of Balūchistān and in the then fertile plain of the Makrān and the lower Indus.

These people belonged to several cultures, primarily distinguished by different types of painted pottery. Each culture had distinctive features of its own, but all were of the same generic pattern as those of the Middle East. Though their settlements were small, rarely more than a few acres in extent, their material standards were comparatively high. The villagers dwelt in comfortable houses of mud brick with lower courses of stone, and made good pottery, which they painted with pleasant patterns. They knew the use of metal, for a few copper implements have been discovered in the sites.




Terracotta Figurines of Goddesses. a. Kullī, c. 2500–2000 B.C. b. Zhob, c. 2500–2000 B.C. c. Harappā, c. 2000 B.C. d. Kauśāmbī, c. 100 B.C.



A composite fugure with an inscription in Tocharian script, mentioning the names of the Iranian form of the Sun-God, Viṣṇu and Siva, Nicolosea, c. 5th century A.D. (After pl. XI, fig. 2 in the Development of Hinau Iconography by J.N. Banerjea).




Some Prehistoric Sites of N.-W. India


PROTOHISTORIC ROCK-ART SITES
IN ANDHRA PRADESH
78
80'
82
84
18
16
14
MAHARASHTRA
ORISSA
MADHYA PRADESH
KARNATAKA
TAMILNADU
BAY OF BENGAL
ADILABAD
NIZAMABAD
KARIM NAGAR
WARANGAL
MEDAK
HYDERABAD
KAMMAM
ELURU
MAHABUB NAGAR
NALGONDA
V JAYAWADA
GUNTUR
KURNOOL
ONGOLE
ANANTAPUR
CUDDAPAH
NELLORE
CHITTOOR
MADRAS
BANGALORE
SRIKAKULAM
VISHAKAPATNAM
KAKINADA
R. Godavari
R. Krishna
R. Tungabhadra
R. Penna
REFERENCE
NEOLITHIC
MEGALITHIC
ROCK PAINTINGS
DISTRICT HQ
1 Husnabad
2 Ragonda
4 Vargal
6 Kokapet
7 Bollaram
8 Durgam
9 Kethavaram
10 Bommavaram
11 Hulikal
12 Polakonda
13 Kadambapur
14 Jonnawada
15 Nagarjunakonda
16 Chatakwaram
17 Yelleswaram
18 Kalakonda
19 Devarappala
20 Kethireddypally
21 Raigir
22 Hamnatpet
23 Siddipet
24 Uppalapadu
26 Lingampally
27 Tenneru
28 Agripally
29 Mudumala
30 Pudicharla
31 Huyyaram

# శ్రీ దక్షిణామూర్తి - దర్శనమ్

## ఉత్తరభాగము - ఆధ్యాత్మిక పరిణామం

ఆధ్యాత్మిక పరిణామం పొందటం జీవిత లక్ష్యంగా ఎరిగినదే. ఆధ్యాత్మిక మొత్తం మానవాళి ఉమ్మడి సొత్తు దాని పెరుగుదల తరుగుదలలు వారు ఉమ్మడి నిధికి కలిపేదానిపై ఆధారపడి ఉంటుంది. నలుగురుతో పంచుకొంటే భౌతిక సంపద తరుగుతుంది. కానీ పంచుకొన్నకొలది ఆధ్యాత్మిక సంపద పెరుగుతుంది. శతాబ్దాలుగా మానవ ప్రకృతిలో వారు సృష్టించుకొన్న సామాజిక ఉద్రేకాలు, రాజకీయ కలహాలు, మత మౌఢ్యాలవల్ల ఆధ్యాత్మిక సంపదనెంతగా క్షీణింపజేసినా శ్రీ దక్షిణామూర్తి, జోరోస్టర్, గౌతమ బుద్ధుడు, కన్ఫ్యూషస్, క్రీస్తు, మహమ్మద్‌లలాంటి ఆధ్యాత్మిక మహనీయుల ప్రబోధాలు ఈ భువినుంచి అంతర్ధానము కాలేదు.

నీలోను అందరిలోను ఉన్నది అదే ఆత్మయని తెలిసికో ఒక వ్యక్తి ఒక మనిషిగా కాకమొత్తం మానవాళిలో ఒక అంశం. దేవుడు మానవుని త్యాగ, ప్రేమ సూత్రాధారంగా సృష్టించాడు. ఆధ్యాత్మిక పరిణామంగా అతడు ఆత్మను తన ప్రతిరూపంగా మలిచాడు. అట్టి ఆత్మ లక్షణాన్ని పరిగ్రహించటానికి అతడు తన నిర్గుణాన్ని, నిత్యానందాన్ని త్యాగంచేసి తన సత్యాన్ని తాను ఎరిగి దానిని మానవాళి ద్వారా అభివ్యక్తంచేయాలని తలపోశాడు. ఆభావనే సృజనాత్మక శక్తులన్నింటి బీజంగా తెలుసుకోవలసియున్నది. ఈ శక్తుల అనేకత్వ విశ్వభావంగా పరిణమించేటట్లు చేశాయి. ఆ భవ (Being) భావ (Becoming)ల మధ్య ఉన్న మార్మిక బంధాన్ని, నిష్ఠను సత్యాన్వేషకులు ఆత్మగతానుభవం ద్వారా ఆ పరాత్పరుని మౌనవ్యాఖ్య ద్వారా తెలిసికొన్నారు. "సత్యమేది? అది ఎట్టిది?' అని తెలిసికోదలచిన ప్రాక్తన చతుష్టయానికి శ్రీ దక్షిణామూర్తి మౌనమే వహించాడు. అతని మౌనానికి అర్థం వివరించలేనిది, సంకేత సూన్యమైనది. అనుభవం ద్వారా తెలిసికోదగిన దివ్యజ్ఞానమే సమాధానమని తెలియుచున్నది.

వ్యక్తి ఆత్మ విశ్వాత్మలో ఐక్యమై వుంటుంది. తన ఆత్మ వికాసమే అతడు సమాజం కొరకు చేసే త్యాగంపై ఆధారపడి వుంటుంది. విత్తనం తనను తాను త్యాగం చేసికోవటం ద్వారా మొలకకు జన్మనిచ్చి ఫలపుష్పాదులనిచ్చి ఎలా తరిస్తుందో అట్లే మానవాళి సత్య సన్మార్గావలంబులై సమాజాభివృద్ధికి **పాటుపడే ప్రకృతే నిజమైన** ఆధ్యాత్మిక విలువగా గురించవలసినది.

మానవాళికి సంబంధించిన ప్రతి దానినీ తన ఆత్మస్వరూపంగా కావించుకోవటం పరమావధి. ఒకసారి బాహ్య బంధాల ముడిని తొలగించి ఎవరైతే తనను 'బ్రహ్మం' తో ఒకటిగా ఎరుగుతాడో అతను మన్య ప్రయత్నంతో పని ముక్తి మెప్పులేకుండా పొందగలడు. శ్రీ తిరువళ్ళువరు సెలవిచ్చినట్లు "మనిషిని ఏకాగ్రత తగినంత తీవ్రతలో ఉంటే ప్రతిదీ అతనికి అందుబాటులోనే ఉంటుంది". చింతన అత్యంత ఉన్నతంగా వున్నప్పుడు భూత, భవిష్య, వర్తమానాలు లేని అనంతవేగంతో పయనిస్తుంది. అన్ని దిక్కులా ప్రసరిస్తుంది.

దీక్ష, మాయ, కర్మ సిద్ధాంతాలు మూడింటిలో ఉన్న సామాన్య లక్షణం వ్యక్తి ముక్తి, ఆధ్యాత్మిక పరిణామ సూత్రం అంటే ప్రేమమాత్రం. దేవుడే ప్రేమ అని మనప్రాచీన వారసత్వం విస్పష్టంగా నొక్కి చెబుతున్నది. శివుడు - ప్రేమ వేరుకారని మానవాళి కోరుకొనే వాటిలోకెల్లా ఇది అత్యంత గొప్ప వారసత్వం. మనిషి తనను తాను పరిపూర్ణునిగా చేసికోవటమే. తనను తాను పరిపూర్ణునిగా చేసికొనే శ్రమలో అంతరంగ దేవాలయాన్ని నిర్మించుకోవటం ద్వారా, అదిప్రేమతో పొంగిపొరలుతుంది. ఇతరులతో మిళితం కావాలని అన్నిటి వ్యాపిస్తుంది. మానవాళి కొరకు ఒకడు చేయగల త్యాగం, పంచగల ప్రేమలు ఆధ్యాత్మిక ప్రగతికి గీటురాళ్ళు. అవే నిజమైన దైవభక్తి, అర్చన, కీర్తన, ప్రార్ధనలూ సమస్తమునూ అంతకు మించిన దైవ సాక్షాత్కారము లేదు.

- బ్రహ్మాజీ

**శ్రీసిద్ధ గణపతి ధ్యానము :**

పక్వచూత ఫలపుష్ప మంజరీ ।
ఇక్షుదండతిల మోదకై స్సహ ॥
ఉద్వహన్ పరశు మస్తు తే నమః
శ్రీ సమృద్ధియుత హేమపింగళ ॥

శ్రీ సిద్ధ గణపతి బంగారు వంటి రంగుగల శరీరముతో, నాలుగు చేతులలో కుడివైపున గొడ్డలిని, మామిడి పండును, ఎడమవైపున పూలగుత్తిని, చెరకు గడను, తిలండముతో నువ్వుల కుడుమును ధరించి యుండును.

శ్రీ దేవి సమృద్ధ దేవియు ఎవారితో కూడియుండి, హేమపింగళ వర్ణముగల సిద్ధ గణపతి, నీకు నమస్కారము (పింగళ వర్ణం)

**శ్రీ విశ్వకర్మ ధ్యానము :**

"యోనః పితా జనితా యో విధాతా
ధామాని వేద భువనాని విశ్వ,
యో దేవానాం నామధా ఏక ఏవ
తం సం ప్రశ్నం భువనా యన్త్యన్యా". (ఋ. 10-82-3)

ఏ విశ్వకర్మ మనకు జనకుడును, రక్షకుడును అయి యున్నాడో, ఇంకనూ సర్వదేవతల స్వరూపము తానే అయి ఎల్లరి నామములను తానొక్కడే తల్చుచున్నాడో, అట్టి విశ్వకర్మయందు, ప్రళయకాలమున అతనినుండి వచ్చిన భూతములు అతనిలోనే లీనమై పోవుచున్నవని భావము - అట్టి విశ్వకర్మ భగవానుని నేను స్మరించుచును.

"త్ర్యంబకం యజా మహే సుగంధిం పుష్టివర్ధనం
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యో ర్ముక్షీయ
మామృతాత్". (తై. సం. 1-8-11)

బ్రహ్మ, విష్ణు, రుద్రులకు నేత్రమువంటి వాడును, సర్వత్రా వ్యాపించిన వాడును, గాఢ శక్తి కలిగి జగత్తులకు బీజమైనవాడును అగు దేవుని పూజించి సాక్షాత్కరింపజేసికొను మృత్యుయోగము నుండి విడివడుదుముగాక.

**శ్రీ విష్ణుమూర్తి ధ్యానము :**

ధాతవర్ణో భవే ద్విష్ణు శ్చక్ర శంఖ గదాబ్జ భృత్ ।
హేమాంబర ధరః స్రగ్వీ కేయూరాంగద భూషితః ॥

శ్రీ విష్ణుమూర్తి తెల్లని శరీర ఛాయలతో, బంగారు వలె పచ్చని వస్త్రముతో, పూల దండలతో, దండ గడియములు, కంకణములు మొదలగు సకల భూషణములతో, కుడివైపున గదను, పద్మమును ఎడమవైపున చక్రము, శంఖములను నాలుగు చేతులలో ధరించియుండును.

## శ్రీ రుద్ర ధ్యానము :

బ్రహ్మాండ వ్యాప్త దేహో భసితహిమరుచో
భాసమాన భుజంగైః ।
కంఠే కాలాః కపర్దకలిత శశికలా -
శ్చండ కోదండ హస్తాః ।
త్ర్యక్షా రుద్రాక్ష భూషాః ప్రణత భయ హరా :
శాంభవా మూర్తి భేదా : ।
రుద్రాః శ్రీ రుద్రసూక్త ప్రకటిత విభవ
నః ప్రయచ్ఛన్తు సౌఖ్యమ్ ।

బ్రహ్మాండమునందంతటను వ్యాపించిన దేహముకలవాడును, భస్మముచేత మంచుకాంతివంటి దేహకాంతి కలవాడును, సర్పములతో ప్రకాశించువాడును, కంఠమునందు నలుపు వన్నె కలవాడును, జటాజూటమునందు చంద్రకళను కలవాడును, భయము గొలుపు ధనువులు హస్తములందుకలవాడును, మూడు కన్నులతో, రుద్రాక్షమాలలను అలంకారములుగా కలవాడును, తనకు ప్రణమిల్లిన వారి భయము పోగొట్టువాడును, పూజ్యమగు రుద్రసూక్తమంత్రములచే ప్రకాశింపజేయబడిన విభవము కలవాడు అగుచూ శంభునిమూర్తి భేదములే అగు రుద్రులు మాకు సౌఖ్యములు కలిగింతురుగాక -

## శ్రీ దక్షిణామూర్తి ధ్యానము :

1. మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్వం యువానం ॥
వర్షిష్ఠాంతే వసదృషి గణై రా వృతం బ్రహ్మనిష్ఠైః ॥
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందమూర్తిం ॥
స్వాత్మా రామం ముదిత వదనం దక్షిణామూర్తి మీడే ॥

2. వట విటపి సమీపే భూమి భాగే నిషణ్ణం ॥
సకలముని జనానాం జ్ఞాన దాతార మారాత్॥
త్రిభువన గురు మీశం దక్షిణామూర్తి దేవం ।
జనన మరణ దుఃఖ చ్ఛేద దక్షం నమామి ॥

3. చిత్రవట తరోర్మూలే వృద్ధా శ్శిష్య వయోద్గురుః ।
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యస్తు ఛిన్న సంశయాః ॥

4. గురవే సర్వలోకానం భిషజే భవరోగినామ్ ।
నిధయో సర్వ విద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

5. ఓం నమః ప్రణవార్థాయ శుద్ధ జ్ఞానైక మూర్తయే ।
నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః ॥

**స్వప్న లోకాన :**

1. వెండి గుబ్బలి మీది వ్రేలుపు ప్రామనా
వెలిగిబ్బ రాజుపై వెలయు వాఁడు ।
నెలిదమ్మి పూవుపై తేఁటి చందంబున
మెలఁత దాకురునందు మెలఁగు వాఁడు ।
పొంగట్టు పైతెలి పుల్గు చందంబున
జడముడి శశి రేఖ జెలఁగువాఁడు ।
పున్నమ నెలయందుఁ బొలుచు వెన్నెలబోల్కి
మొగమున జిఱునవ్వు మొలచువాఁడు ।
పెక్కు జేజేల మ్రెక్కులఁజొక్కువాడు ।
మునుల కైవారముల మెచ్చి వినెడివాడు ।
మిక్కుటంబగు మక్కువ పిక్కటిల్లఁ
గావవచ్చెను నాదు ముంగలను గలను ॥

2. కాంచగలరా కలకాలం కన్నవారు
కలలపంటే పసిడిపంటగ
కాలమొక కరుణ జూపునా
కాలగతిని మార్చగల్గునా ?
కాలగతియే చెల్లిపోయె లోకరీతి
వయసుమల్లె వసంతమొనసె
చింత మొదలై ఒకింత కాంతి గనగ
చుప్పనాతి కాలమెమొ చెప్పుకుందు వీలులేక చెల్లుచెసె
పద్ధతిని కలసిన కన్నవారె, కాంతి రేఖై కానరాగ
కాకపికలు తోడులేచె - కొత్తకాలం మరలవచ్చె ॥

**రూపధ్యానములు - మాతృకలు (ప్రమాణములు) :**

శ్రీ జగద్రక్ష, జగత్పిత, జగత్ కర్తయగు ఆ పరమేశ్వరుని దివ్యరూపాల్ని ధ్యాన శ్లోక సహితంగా పఠించుటకు నాగర లిపిలోని శిల్ప శాస్త్ర, తాళపత్రాల నాధారం చేసికొని

శ్రీ శ్రీశ్రీ [illegible] దివ్య ఆశీస్సులతో

శ్రీ ఎస్. ఎమ్. గణపతిస్థపతిగారు

శ్రీ దురిశేటి వెంకట రామాచార్యులు

శ్రీ స్వర్ణ సుబ్రమణ్యకవిగారు

శ్రీ చిలుకూరి మాడభూషి వెంకట రాఘవాచార్యులు

శ్రీ ఆమూరి శ్రీనివాస అయ్యంగారు

శ్రీ పెదపాటి నాగేశ్వరరావుగార్ల

సమష్టి పరిశ్రమ సాఫల్యమై జిజ్ఞాసువులకు, శిల్పాచార్యులకు కరతలామలకం చేసి అందించిన శ్రీ రూపధ్యాన రత్నావళి. 'శ్రీ కాశ్యప శిల్ప' శాస్త్రము భారతీయ శిల్ప సంస్కృతి వైభవాలను సుస్పష్ట [illegible]. వారి అకుంఠిత దీక్ష, శ్రీ స్వామివారి ఆశీస్సులకు అక్షర భారతి [illegible] ప్రమోదవలసి యున్నది.

పై ప్రమాణ గ్రంధములనుండి [illegible] విశ్వకర్మ విశ్వకర్తల బహురూప భేదములను ఇందు అర్థ సహితముగా [illegible]. [illegible] కైంకర్యమును సహృత్ భావముతో స్వీకరింపగలరు.

శ్రీ ఎస్. ఎమ్. గణపతి స్థపతిగారు పూర్వులనుండి పారంపర్యముగా, అనువంశికముగా భద్రపరచిన [illegible] గ్రంధములనుండి సేకరించిన కాశ్యప శిల్పంలో ప్రమాణికమైన 'మూర్తికలను' సంపాదించిరి. దాదాపు 82 సం॥ క్రితమే దీనిని నాగరలిపిలో 'ఆనందాశ్రమము' పూనావారు ముద్రించినారట. అంతియే కాక తంజావూరు 'సరస్వతీమహల్', లైబ్రరీ వారు అనేక తాటియాకుల ప్రతుల నాధారంగా 1960లో తమిళగ్రంథ లిపిలో కాశ్యప శిల్పమును వివరణతో ప్రచురించియుండిరి. మరియు ఆళ్ళగడ్డ (కర్నూలుజిల్లా)లోని శిల్పాచార్యుల సహకారములతో సేకరించిన ప్రమాణములు మూర్తికలు (కారికలు) భగవత్ స్వరూపములను సత్ ప్రమాణములుగా వర్ణించియుండిరి. ఇవి అన్నియూ అర్థసహితముగా ఇందు ప్రచురించియున్నాము. తత్ ధ్యానములను గ్రహించిన ఆ దివ్య రూపములను మీ మనోఫలకములపై భాసించగలవని ఆకాంక్షించుచూ

**శంభుః పినాకీ గిరీశః స్థాణుర్భర్గః సదాశివః**
**శివో హరస్తథా శర్వః కపాలీ భవ ఏవచ ॥**
**ఏకాదశైతే కథితా రుద్రా లోకహితే రతాః ॥** **(శైవాగమము)**

**కాంచీ ప్రతిష్ఠిత సువిశ్రుత కామకోటి**
**పీఠే శంకర జగద్గురు సంయ మీంద్రాన్**
**శ్రీ చంద్రశేఖర మహేంద్ర సరస్వతీ శ్రీ**
**పాద స్సృపారస సుధాంబు విధీ సృజామి ॥**

# ఓం
# శివమూర్తి ధ్యానములు

## 1. మహేశ్వర ధ్యానము :

**(శివ పంచాక్షరి మంత్రమునసుసరించి)**

శాంతం పద్మాసనస్థం శశిధర ముకుటం
పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం
దక్షభాగే వహంతమ్ ॥
నాగం పాశం చ ఘంటాం ప్రళయ హుత వహం
సాంకుశం వామభాగే
నానాలంకార యుక్తం స్ఫటికమణి నిభం
పార్వతీశం నమామి ॥

శ్రీ మహేశ్వరస్వామి స్ఫటికము వలె మిక్కిలి తెల్లనయిన శరీరకాంతితో, పరమశాంతమైన రూపముతో, చంద్రవంకచే నలంకరింపబడిన కిరీటముతో సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అను [illegible] గములతో, మూడు కన్నులతో, పదిచేతులతో భూషణములన్నింటిని నలంకరింపబడిన సర్వాంగములతో నుండును - కుడిభాగమందు క్రింది నుండి పైకి వరుసగా 1. అభయముద్రను, 2. [illegible], 3. [illegible], 4. వజ్రమును, 5. శూలమును, [illegible] భాగమున 1. నాగమును, 2. [illegible] 4 [illegible] పది చేతులతో ధరించియుండును.

ఇట్టి రూపముతో ప్రకాశించు పార్వతీ ప్రియుడగు శ్రీ మన్మహేశ్వర స్వామిని నమస్కరించుచున్నాను. (శ్వేత వర్ణము)

## 2. శ్రీ గౌరీ ధ్యానము :

**(నృసింహ ప్రసాదము)**

గౌరీ శుక్లాంబరా దేవీ రూపేణాప్రతిమ భువి
పృథ కృతుర్భుజా కార్యాదేవిసింహాసనే శుభా ॥
సింహాసనే ౩ స్యా: కర్తవ్యం కమలం చారుకర్ణికమ్

అష్టపత్రం మహో భాగా కర్ణికాయాం శుసంస్థితా ॥
వినాయకవదాసీనా దేవీ కార్యా మహో భుజా
బృహన్నాలం కరే కార్యం తస్యాశ్చ కమలం శుభమ్ ॥
దక్షిణే యాదవశ్రేష్ట కేయూర ప్రాంత సన్నిభమ్
వామే s మృతఘటః కార్యస్తథా రాజన్ మనోహరః ॥
తస్యా అన్యౌకరౌ కార్యౌ బిల్వశంఖధరా విత్తి ॥

ఎనిమిది దళములు కల్గి, చక్కని కర్ణికతో సింహాసనమందున్న పద్మకర్ణిక యందు సాటిలేని రూపముతో తెల్లని వస్త్రములతో, నాల్గు చేతులతో, వేరుగా వినాయకునివలె కూర్చుండిన శ్రీ గౌరీదేవిని నిర్మింపవలెను.

కుడి భాగమున క్రిందినుండిపైకి పెద్దకాడ కల్గిన 1. పద్మమును, 2. మారేడు పండును, అట్లే యెడమ భాగమున 1. అమృత కలశమును, 2. శంఖమును ధరించి యుండును.

ఓ యాదవ శ్రేష్ఠుడగు మహారాజా ! ఈ గౌరీదేవి మరకత మణుల వలె ఆకు పచ్చని రంగుకలది.

(మరకత వర్ణము)

### 3. అఘోరమూర్తి ధ్యానము :

**(శివ తత్వ రత్నాకరము)**

ఏకవక్త్రం సదానందం ద్వాత్రింశద్భుజ సంయుతమ్
జటామకుట సంయుక్తం త్రినేత్రం చంద్ర శేఖరమ్ ॥
అభయం ఖడ్గశూలం చ చక్రం డమరుకం తథా
దధాన మష్టి బాణౌ చ గదాం పద్మం కపాలకమ్ ॥
జ్ఞాన ముద్రాం కుంతహస్త మంకుశం చాక్షమాలికామ్
ఖట్వాంగం పరశుం చైవ దధానం దక్షిణైః కరైః ॥
వరంచ ఫలకం చైవ టంకం పాశం చ ముద్గరమ్
వాగ్ర మగ్నిం మృగం ఘంటాం ధనుశ్చ కటిహస్తకమ్ ॥
రత్నం చ కుముదం కుంభం ముసలం పుస్తకం తథా
ఏకాదాయుధ సంయుక్తం రుండమాలావిభూషితమ్ ॥
వస్త్రా వ్యూహం కాలముండ శిరస్థ మభయ ప్రదమ్ ॥

ఈ అఘోరమూర్తి ఒక ముఖముతో, మూడు కన్నులతో, ముప్పది రెండు చేతులతో, జటాజూటముతో, నెలవంక శిరో భూషణముతో, కపాలముల దండలతో, కాలముండుడు అను వాని శిరమునందుండును.

కుడి భాగమున క్రిందనుండి పైకి వరుసన 1. అభయముద్రను, 2. కత్తిని, 3. శూలమును, 4. చక్రమును, 5. డమరుకమును, 6. ఎముకను, 7. బాణమును, 8. గదను, 9. పద్మమును, 10. కపాలమును, 11. జ్ఞానముద్రను, 12. కుంభమును, 13. అంకుశమును, 14. జపమాలను, 15. ఖట్వాంగమును, 16. గొడ్డలిని.

అట్లే ఎడమ భాగమున వరముద్రను 1, ఖేటకము 2, టంకమును 3, పాశమును 4, ముద్గరమును 5, నాగమును 6, అగ్నిని 7, మృగమును 8, గంటను 9, ధనుస్సును 10, కటిహస్తమును 11, రత్న పాత్రమును 12, కలువపువ్వును 13, కుంభమును 14, ముసలమును 15, పుస్తకమును 16.

కుడి ఎడమల ముప్పది రెండు చేతులతో ధరించి అన్ని భయములను పోగొట్టునట్టి శుభమూర్తియైన ఈ అఘోర మూర్తికి నమస్కారము చేయుచున్నాను. (నీలవర్ణము)

## 4. దశభుజాఢ్యైన అఘోరమూర్తి ధ్యానము :

**(పాంచరాత్రము)**

**పరశుం డమరుం ఖడ్గఖేటే బాణశరాసనే**
**శూలం కపాల మభయ వరౌ దధిత మిష్టదమ్ ॥**
**త్రిలోచనం భీషణాస్యం నీలాంగం రక్తవాసనమ్**
**అహిభూషిత సర్వాంగంతమఘోర ముపాస్మహే ॥**

ఈ అఘోరమూర్తి నల్లని శరీర ఛాయతో, భయంకరమైన మొగముతో, మూడు కన్నులతో, పది చేతులతో, ఎఱ్ఱని వస్త్రములతో, పాముల నలంకరించిన సర్వాంగముతోనుండును.

కుడి వైపున క్రిందనుండి పైకి క్రమమున అభయముద్రను 1, శూలమును 2, బాణమును 3, కత్తిని 4, డమరుకమును 5, అట్లే ఎడమ వైపున వరముద్రను 1, కపాలమును 2, వింటిని 3, ఖేటమును 4, గొడ్డలిని 5.

కుడి ఎడమల పదిచేతులతో ధరించిన ఆ యఘోరమూర్తిని మేమెల్లరము ఉపాసనము చేయుచున్నాము. (నీల వర్ణము)

## 5. శ్రీ మహాకాళీ సమేత మహాకాల ధ్యానము :

**(లలితో పాఖ్యానము)**

మహాకాలో ఘనశ్యామః కాల్యాలింగిత విగ్రహః
శ్యామకంచు కధారీచ మదారుణ విలోచనః ॥
బ్రహాండ చషకే పూర్ణం పిబన్విశ్వరసాసవమ్
మహాకాళీం ఘనశ్యామా మనం గార్ద్ర మపాంగ నమన్ ॥
సింహాసనే సమాసీనః కళ్యాణ కలనాత్మకే
కాలమృత్యుము ఖైర్యుక్తః సర్వలోకైక భక్షక : ॥
లలితాధ్యాన సంపన్నో లలితా పూజ నోత్సుకః
వితన్వన్ లలితాభక్తే ష్వాయుషో దీర్ఘతామ్ ॥

శ్రీ మహాకాలస్వామి మేఘమునవలె నల్లనగు శరీర కాంతులతో శ్రీ మహాకాళీ దేవి చేత కౌగలించు కొనబడిన విగ్రహముతో, నల్లని వస్త్రముంను ధరించిన రూపముతో మదముచేత ఎఱ్ఱబడిన కన్నులతో, సుఖాత్మకమైన (శుభమైన), సింహాసనము నధిష్ఠించి, కాలమృత్యువు మున్నగు పరిజనముచేత పరివేష్టి [illegible] యుండును.

మేఘమువలె నల్లనై, అనురాగముచేతని [illegible] శ్రీ మహాకాళీ దేవిని తన కడగంటి చూపులచేత చూచుచుండును.

ఇట్టి సర్వలోక భక్షకుడగు ఈ స్వామి బ్రహ్మాండమును గిన్నెయందు విశ్వరసమును మద్యమును నింపి త్రాగుచు, శ్రీ లలితాదేవి ధ్యానముతో శ్రీ లలితాదేవికి భక్తులగు వారల యొక్క ఆయుష్షులను పెంచుచుండును వారలను చిరకాలము జీవించువారినిగా చేయుచుండును. (నీల వర్ణము)

## 6. అమృత మృత్యుంజయ ధ్యానము :

**(కారణాగమము)**

చంద్రోపరిష్టా త్యం బద్ధపద్మాసన విరాజితమ్
చంద్రవర్ణం ప్రపద్దివ్యామృత చంద్రకళాధరమ్ ॥
యోగముద్రైక సంబద్ధాధర హస్తద్వయాన్వితమ్
అమృతాపూర్ణ కనకకలశాప్త కరద్వయమ్ ॥
సోమ సూర్యాగ్ని నేత్రం చ బద్ధ పింగళ జటాధరమ్
నాగాభరణ సంభూషం నాగయ జ్ఞోప వీతినమ్ ॥
వ్యాఘ్ర చర్మాంబర ధరం దేవం భక్తానుకంపినమ్
భస్మాను లేపినం రుద్రం మృత్యుంజయ [illegible] ॥

ఈ అమృత మృత్యుంజయమూర్తి చంద్రునివలె తెల్లనగు శరీరచ్ఛాయలతో శిరమున నలంకరింపబడిన అమృతమును స్రవించు చంద్ర రేఖతో, యోగధ్యానముద్ర చేత బంధింపబడిన రెండు చేతులతో, రెండు చేతులతో, అమృతమును నింపిన బంగారు కలశమును పట్టు కొనిన, మరి రెండు చేతులతో లేత పసుపు రంగుగల జడలచేత కట్టబడిన జటాజూటముతో చంద్రుడు, అగ్ని, సూర్యుడు అను మూడు కన్నులతో, పాముల భూషణములతో, పాముల జందెముతో, పులితోలు వస్త్రముతో, భస్మమును పూసికొనిన సర్వావయవములతో చంద్రుని పై భాగమునయున్న పద్మాసనమునందు ఉపవిష్టుడై ఉండును.

భక్తులను అనుగ్రహించు మృత్యుంజయుడగు ఇట్టి రుద్రుని స్మరింపవలెను.

(శుభ్రవర్ణము)

## 7. నీల కంఠ ధ్యానము :

**(పాంచరాత్రము)**

**జటా బద్ధ కలానాథం భోగిభూషణ భూషితమ్**
**అక్షమాలాంచ శూలం చ కపాలం దధతం కరైః ॥**
**ఖట్వాంగ మపి పంచాస్యం వసానం వ్యాఘ్ర చర్మం చ**
**త్రినేత్ర మబ్జ నిలయం బాలార్క సదృశ ప్రభుమ్ ॥**
**సాధకా భీష్టదాతారం నీలకంఠ మహం భజే ॥**

శ్రీ నీలకంఠస్వామి బాలసూర్యుని వలె ఎఱ్ఱనగు శరీర కాంతులతో, జటాజూటమున అలంకరింపబడిన చంద్రరేఖముతో, పాముల నగలతో, ఐదు మొగములతో, ప్రతి ముఖమునందు మూడు మూడు కన్నులతో, నాలుగు చేతులతో పులితోలు వస్త్రముతో, పద్మమను ఆసనముననుండును.

కుడి భాగమున క్రింది నుండి పైకి శూలమును 1, జపమాలను 2, అట్లే ఎడమ భాగమున కపాలమును 1, ఖట్వాంగమును 2, నాలుగు చేతులతో ధరించిన ఈ నీలకంఠ స్వామి భక్తుల కోరికలను తీర్చుచుండును. అట్టి శ్రీ స్వామిని నేను భజింతును.

(అరుణ వర్ణము)

## 8. శ్రీరుద్రమూర్తి ధ్యానము :

**కైలాసాభం పంచవక్త్రం దేవ్యా యుక్తం త్రిలోచనమ్**
**నీలకంఠం సర్పభూషం వ్యాఘ్ర చర్మాంబరా వృతమ్ ॥**
**అక్షమాలా వరాభీతి కమండలులసత్కరమ్**

శ్రీ రుద్రమూర్తి హిమకైలాసము వలె తెల్లనగు శరీర కాంతులతో, ఐదు మొగములతో, ప్రతి ముఖమునందు మూడు మూడు కన్నులతో, నాల్గుచేతులతో, నల్లని (విషమువలన నల్లనైన) కంఠముతో, పాముల భూషణములతో, పులితోలు వస్త్రముతో, చంద్రకళచేత గంగాదేవిచేత అలంకరింపబడిన జటాజూటముతో నుండును.

కుడి భాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమ వైపున వరముద్రను 1, కమండలమును 2, ఈవిధముగ నాల్గు చేతులతో, ధరించి పరమేశ్వరీ దేవితోనున్న శ్రీ రుద్రమూర్తిని నేను నమస్కరింతును.

(శ్వేతవర్ణము)

## 9. సపరివారుడైన ఉమా మహేశ్వరుని ధ్యానము :

**(కారణాగమము)**

**వామే శైలసుతా పురస్తు వృష భః**
**పశ్చాత్సురేంద్రాదయో**
**దైత్యారి శ్చ విధి శ్చ పార్శ్వతల యో**
**ర్వా య్వాది కోణేషు**
**భృంగీనారద బాణ భైరవ గజా**
**స్యస్కంద వీరేశ్వరా**
**మధ్యే శుభ్ర సరోజ కోమల రుచం**
**శంభుం భజే పాండురమ్ ॥**

ఎడమ భాగమున ఉమాదేవి, ముందు భాగమున వృషభము, వెనుక భాగమున ఇంద్రాది దేవతలు కుడిఎడమల ఉభయ పార్శ్వములయందు నారాయణుడును, బ్రహ్మయును, వాయవ్య కోణమున భృంగియును, నారదుడును, ఈశాన్య కోణమున బాణా దైత్యుడును, కాల భైరవుడును, ఆగ్నేయ కోణమున గణపతియును, కుమారస్వామియును నైరుతి కోణమున వీరభద్రుడు పరివేష్టించి యుండి ఈ పరిజనుల నడుమ స్ఫటికము వలె మిక్కిలి తెల్లనగు తామర పుష్పకాంతులుగల కోమల శరీర చ్ఛాయలతో ప్రకాశించు ఉమామహేశ్వర స్వామిని భజింతును.

(శ్వేతవర్ణము)

## 10. శ్రీ సభాపతి ధ్యానము :

**(కారణాగమము)**

**కైలాస శైల శిఖరే త్రిజగజ్జని త్రీం**
**గౌరీం నివేశ్య కనకాంచిత రత్న పీఠే ॥**

వృత్యంత మాది పురుషం శశి శేఖరం తం
దేవా : ప్రదోష సమయే ఽ ను భజంతి సర్వే ॥

బ్రహ్మా తాల ధరో హరి స్సపటహో వీణాకరా భారతీ
వంశ ద్వంద్వయుతౌ సుభా స్వరరౌ
మార్తాండ సోమౌ శుభౌ ॥

గాకౌ తుంబురు నారదౌ సమురజే నందీ కుమార స్తథా
రుద్రో నృత్తర: స్వభావ జనితం నాట్యం సదా పాతు వ: ॥

ఆది పురుషుడైన శ్రీ మన్మహా పరమశివుడు సాయం సమయమున కైలాస పర్వత శిఖరమునందు బంగారు పీఠమున ముజ్జగములకు మాతృమూర్తియగు శ్రీ గౌరీదేవిని ప్రతిష్ఠించి ఆ దేవియందలి భక్తి పారవశ్యమున నృత్యముచేయసాగెను. అంత నాపరమేశ్వరుని పరివార సభ్యులగు దేవతాశ్రేష్టు లెల్లరూ అతని ననుసరించి ఈ క్రింది విధమున భజింపదొడగిరి.

బ్రహ్మతాళమువేయ సాగెను, విష్ణువు మృదంగమును మ్రోగించెను. సరస్వతీదేవి వీణా నాదనమును చేసెను. సూర్యుడును, చంద్రుడునుచేత పిల్లన గ్రోవులను పట్టి పాడిరి. తుంబురుడును, నారదుడును పాటల పాడిరి. నందియు, కుమారుడును మురజములను మ్రోగించిరి. ఈ సంగీతకమున కనుగుణముగా భక్తుల దు:ఖమును పోద్రోలి శుభములనిచ్చు రుద్రుడగు శంభుడు నృత్యమును చేసెను.

సహజ సిద్దమగు ఈ నృత్యమును మనల నెల్లరనూ రక్షించుగాక.

(గౌరవర్ణము)

## 11. సద్యో జాతాది పంచమూర్తుల ధ్యానము :

**(శైవ కారణాగమము)**

### శ్రీ సద్యోజాత ధ్యానము

కుందేందు శంఖ స్ఫటికావభాసో
వేదాక్ష మాలా వరదా భయాంక: ॥

త్ర్యక్ష శ్చతుర్వక్త్ర ఉరుప్రభావ :
సద్యో ఽ ధిజాతో ఽ వతు మాం ప్రతీచ్యామ్ ॥

ఈ సద్యో జాతమూర్తి మొల్లపువ్వు, చంద్రుడు, శంఖము, స్ఫటికము మున్నగు వానివలె మిక్కిలి తెల్లని కాంతులతో, మూడు కన్నులతో, నాలుగు మొగములలో,

కుడి భాగమున క్రిందనుండి పైకి అభయ ముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమ భాగమున వరద ముద్రను 1, పుస్తకమును 2, కుడి ఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

మహా ప్రభావశాలి యగు శ్రీ సద్యోజాతమూర్తి పడమర దిక్కునందు నన్ను రక్షించునుగాక.

(శ్వేతవర్ణము)

## 12. శ్రీ వామదేవ మూర్తి ధ్యానము :

**వరాక్ష మాలా భయటంక హస్త :**
**సరోజకిం జల్క సమానవర :॥**
**త్రిలోచన శ్చారు చతుర్ముఖో మాం**
**పాయా దు దిచ్యాం దిశి వామ దేవ : ॥**

శ్రీ వామ దేవమూర్తి పద్మమునందలి కింజల్కమువలె బంగారు శరీర కాంతులతో నాలుగు మొగములతో, ప్రతి మొగమునందును మూడు మూడు కన్నులతో, నాలుగు చేతులతో నుండును.

కుడి భాగమున క్రిందనుండి పైకి అభయముద్రను 1, టంకమును 2, అట్లే ఎడమ భాగమున వరద ముద్రను 1, జపమాలను 2, కుడి ఎడమల నాల్గు చేతులతో ధరించిన శ్రీ వామదేవమూర్తి ఉత్తర దిక్కునందున్న వాడై నన్ను రక్షించునుగాక.

(కనక వర్ణము)

## 13. శ్రీ అఘోర మూర్తి ధ్యానము :

**కుఠార వేదాంకుశ పాశశూల**
**కపాల ఢక్కాక్ష గుణాన్ దధాన : ॥**
**చతుర్ముఖో నీలరుచి స్త్రినేత్ర :**
**పాయా దఘోరో దిశి దక్షిణ స్యామ్ ॥**

ఈ అఘోరమూర్తి నల్లని శరీర కాంతులతో, నాలుగు మొగములతో, ప్రతి ముఖమునందు మూడు మూడు కన్నులతో, ఎనిమిది చేతులతో నుండును.

కుడివైపున క్రిందనుండి పైకి శూలమును 1, గొడ్డలిని 2, జపమాలను 3, అంకుశమును 4, అట్లే ఎడమ వైపున కపాలమును 1, ఢక్కను 2, పుస్తకమును 3, పాశమును 4 ఎనిమిది చేతులతో ధరించిన శ్రీ అఘోరమూర్తి దక్షిణ దిక్కునందున్న వాడై ఎల్లరునూ రక్షించునుగాక.

(నీలవర్ణము)

## 14. శ్రీ తత్పురుషమూర్తి ధ్యానము :

ప్రదీప్త విద్యుత్కనకావ భాసో
విద్యా వరాభీతి కుఠార పాణి : ॥
చతుర్ముఖ స్త త్పురుష స్త్రి నేత్ర :
ప్రాచాం స్థితో రక్షతు మా మజస్రమ్ ॥

శ్రీ తత్పురుషమూర్తి మిక్కిలి కాంతులుగల మెఱుపుతీగల వలె, బంగారు వలె పచ్చని, శరీర చ్ఛాయలతో, నాల్గు మొగములతో, ప్రతి ముఖమునందు మూడు మూడు కన్నులతో నాల్గు చేతులతో నుండును.

కుడి భాగమున క్రిందనుండిపైకి అభయ ముద్రను 1, గొడ్డలిని 2, అట్లే ఎడమవైపున వరద ముద్రను 1, విద్యాముద్రను, కుడి ఎడమల నాల్గు చేతులతో ధరించిన శ్రీతత్పురుషమూర్తి తూర్పున నున్న వాడై నన్ను ఎల్లప్పుడు రక్షించును గాక.

(కనక వర్ణము)

## 15. శ్రీ ఈశానమూర్తి ధ్యానము :

వేదాభయేష్టాంకుశ పాశ టంక
కపాల ఢక్కాక్షక శూలపాణి : ॥
సిత ద్యుతి: పంచముఖో ఽ వతా న్మా
మీశాన ఊర్ధ్వం పరమ ప్రకాశ: ॥

ఈశానమూర్తి తెల్లని శరీర కాంతులతో, ఐదు ముఖములతో పదిచేతులతో నుండును.

కుడి భాగమున క్రిందనుండి అభయముద్రను 1, శూలమును 2, జపమాలను 3, అంకుశమును 4, టంకమును 1, అట్లే ఎడమ భాగమున వరద ముద్రను 1, కపాలమును 2, వేదమును 3, పాశమును 4, ఢక్కను 5 కుడి ఎడమల పది చేతులతో ధరించి ఊర్ధ్వ దిక్కునందు మిక్కిలి ప్రకాశించు శ్రీ ఈశానమూర్తి నన్ను రక్షించుగాక.

(శ్వేతవర్ణము)

## 16. శ్రీ భిక్షాటనమూర్తి ధ్యానము :

చతుర్భుజం త్రినేత్రం చ నగ్నంచైవ స్మితాననమ్
భస్మదిగ్ధం విద్రుమాభం కట్యాం పన్నగసంవృతమ్ ॥
ఆవృత్తాలంకృతో భృంగీ పాదం పాదుక సంయుతమ్
దక్షిణం తత్కరాగ్రం తు హరిణా స్యానుగం భవేత్ ॥

దక్షిణే పరహస్తేతు డమరుం చైవ కారయేత్
వామేత్వపరహస్తే తు త్రిశూలం పింఛధారిణమ్ ॥
కుంచితం దక్షిణం పాదం వామపాదం తు సుస్థితమ్
సమభంగ స్థానకం చ గమనోన్ముఖ రూపకమ్ ॥
కపాలోపేత హస్తం చ వృషనాభి సమం భవేత్
ఏవం భిక్షాటనం ప్రోక్తం గుండోదర మథో శృణు ॥
దేవస్య వామపార్శ్వేతు గుండోదర మథః స్థితమ్
హస్తద్వయ సమాయుక్తం కపాలం శిరసి న్యసేత్ ॥
భూతాకార సమాయుక్తం కుండలే కర్ణయోర్న్యసేత్
దంష్ట్రా కరాళ వక్త్రం చ పూర్వోక్తం లక్షణాన్వితమ్ ॥

శ్రీ భిక్షాటనమూర్తి దిగంబరుడై నాలుగు చేతులతో, మూడు కన్నులతో చిఱునవ్వు మొగముతో, విభూతి పూసిన అవయవములతో, పవడము వలెఎఱ్ఱనయిన శరీరముతో, నడుమునందు అలంకరింపబడిన పాములతో ఉండును. - శ్రీ స్వామి కుడినిజ హస్తము లేడి వైపునకు తిరిగినదై యుండును. కుడి పరహస్తమునందు డమరుకయుండును. ఎడమ నిజహస్తమునందు కపాలము, పరహస్తమునందు నెమలి ఈకలచే నలంకరింపబడిన త్రిశూలము ఉండును. కపాలము వెనుకనున్న వృషభము నాభికి సమతలముననుండును.

శ్రీ స్వామి కుడి పాదము కుంచితమై ఉండును. ఎడమ పాదము తిన్నగా నిలచినదై యుండును. అతని శరీరము సమభంగమై నిలచి ప్రయాణమునకు సిద్ధపడుచున్నట్లుండును.

కుడివైపుననున్న భృంగి భూషణములతో అలంకరించుకొని యుండును, ఎడమన నున్న గుండోదరుడు రెండు చేతులలో శిరమున కపాలముతో స్వామికి కొంచము క్రింది భాగమున నుండును. అతడు కోరలచేత భయమును గొలుపు మొగము భూతాకారము కలిగియుండును. వాని చెవులకు కుండలములుండవలెను.

## 7. శ్రీ కామదహనమూర్తి ధ్యానము :

ఉగ్రరూపం తు కామారిం చతుర్భుజ సమన్వితమ్
కృష్ణటంక సమాయుక్త మభయం వరదాన్వితమ్ ॥
కామనిగ్రహరూపం తు పద్మపీఠోపరిస్థితమ్
దక్షిణే లంబితం పాదం వామపాదంతు శాయితమ్ ॥
కారః కామరిపు స్త్వేవం వక్ష్యే ఽ హం కాలనాశనమ్ ॥

శ్రీ కామదహనమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, భయం కరమగు రూపముతో, నాలుగు చేతులతో, పద్మాసనమునందుండును. కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, టంకమును 2, అట్లే ఎడమ వైపున వరద హస్తమును 1, లేడిని 2, కుడి ఎడమల నాల్గుచేతులతో ధరించి యుండును.

ఆ స్వామి కుడికాలు ఆసనమునుండి లంబితమై (వ్రేలాడుచున్నదై) ఎడమకాలు శాయితమై (కుడికాలునందు వంచి పెట్టబడినదై) యుండును. శ్రీకామ దహన మూర్తిని ఈ విధముగా నిర్మింపవలెను.

(రక్త వర్ణము)

## 18. శ్రీ త్రిపురారి మూర్తి ధ్యానము

చతుర్భుజం త్రినేత్రం చ మృగం పరసుధారిణమ్
దనుర్బాణ సమాయుక్త ముమయా సహితం తథా ।
సర్వాభరణ సంయుక్తం దివ్యాంబర సమావృతమ్
పత్రం దధం వాసుక ర్ణే దక్షిణే కుండలాన్వితమ్ ॥
ఉపవీత సమాయుక్తం సమభంగయుతం శివమ్
జటాముకుట సంయుక్తం విలస ద్వి ద్రు మాంగకమ్ ॥
ఏవం త్రిపుర సంహారం (రూపం ప్రోక్తం మహాత్మభిః)

శ్రీ త్రిపురసంహారమూర్తి యొక్క రూపమును పెద్దలిట్లు చెప్పుచున్నారు. శ్రీ స్వామివారు పవడమువలె ఎఱ్ఱనగు శరీరచ్ఛాయతో, నాల్గుచేతులతో, మూడుకన్నులతో, యజ్ఞోపవీతముతో, ప్రకాశించుచున్న ఆభరణములతో, వస్త్రములతో ఎడమ భాగమున ఉమాదేవితో, సమ భంగయుతముగా జటాజూటముతో ఉండును.

కుడివైపున క్రిందినుండి పైకి బాణమును 1, టంకమును 2, అట్లే ఎడమ వైపున ధనుస్సును 1, లేడిని 2, నాలుగు చేతులతో ధరించును. ఆ స్వామి ఎడమ చెవియందు తాటంకము (ఉమాదేవిది) కుడిచెవియందు కుండలము (పరమశివునిది) ఉండును.

(విద్రుమ వర్ణము)

## 19. శ్రీ జలంధరహర మూర్తి ధ్యానము :

రక్తాభ ముగ్రనయనం ద్విభుజం చత్రినేత్రకమ్
ఉపవీత సమాయుక్తం సర్వాలంకార శోభితమ్ ॥
పాదయోః పాదుకాయుక్తం కించి ద్వేగమనో న్ముఖమ్
దక్షహస్తే స్థితం ఛత్రం వామే పూర్ణకమండలమ్ ॥

సువికీర్ణ జటాభారం గంగా చంద్ర సమన్వితమ్
కర్ణకుండల సంయుక్తం హారనూపుర సంయుతమ్ ॥

## శ్రీజలంధర స్వరూపమ్

ద్విభుజం చ ద్వినేత్రం చ కిరీట కటకాన్వితమ్
సర్వాలంకార సంయుక్తం కక్షే ఖడ్గ సమన్వితమ్ ॥
కృతాంజలి పుటోపేతం హస్తే చక్రం దధం పరమ్
జాలంధర మథ ప్రోక్తం పీత రక్తా వయం హర :) ॥

శ్రీ జలంధర హరుడైన పరమశివుడు ఎర్రని శరీర కాంతులతో, భయంకరములగు మూడు కన్నులతో, రెండుచేతులతో, జందెముతో, సర్వాంగములయందు నాగభూషణములతో, పాదములయందు పాదుకలతో, ప్రయాణమునకు సిద్ధపడుచున్న రూపముతో, గంగాదేవి, చంద్రకళలతో కూడి విరిసిన జటాజూటములతో, చెవుల కుండలములతో, హారములతో పాదములందు నూపురములతో నుండును.

ఆ స్వామి కుడిచేతియందు గొడుగు, ఎడమ చేతి యందు నీటితో నిండిన కమండలము ఉండును. ఇట్టి స్వామికి నమస్కరించుచున్నాను.

జలంధరుడు రెండు చేతులతో, రెండు కన్నులతో కిరీటము, హారములు, కేయూరములు (దండ గడియములు) కటకములు మున్నగు సర్వాలంకారములతో, కక్షమునందు (బాహుమూలమున చంకలో) ఖడ్గముతో, చక్రముగల చేతులతో నమస్కారమును చేయుచుండును.

శ్రీస్వామిది రక్త వర్ణము - జలంధరునిది పీతవర్ణము.

## 20. శ్రీ గజాసుర సంహార మూర్తి ధ్యానము :

స్థిత్వా హస్తిశిర స్య దక్షచరణే
నోద్వృత్య దక్షం పదం
ధృత్వో ర్ధ్వం గజచర్మ భిన్న మపరై
ర్దక్షై స్త్రి శూలం హ్యసిమ్ ॥
టంకం సూచి విషాణ కృష్ణ హరిణం
వామైః సుథాంశు ప్రభం
భీష్మాస్యం భయ భీతయా ససుతయా
గౌర్యా యుతం తం భజే ॥

శ్రీ గజాసుర [illegible] ఎడమ కాలితో నిలచి, [illegible] చర్మమును పైకెత్తి, [illegible] చేతులతో నుండును.

కుడివైపున [illegible], కత్తిని 2, టంకమును 3, [illegible] 1, [illegible] 2, [illegible] 3 మిగిలిన ఆరు [illegible]

గజాసుర [illegible] నున్న శ్రీ స్వామి వారిని చూచి, [illegible] నున్న శ్రీ గౌరీదేవి భయముతో కంపించుచుండును.

ఇట్టి శ్రీ గజాసుర [illegible] ధ్యానింతును.

## 21. శ్రీ వీరభద్రమూర్తి ధ్యానము :

అ) చతుర్భుజం త్రిణేత్రం చ జటామకుట సంయుతమ్
దక్షిణే ఖడ్గ బాణౌచ వామే చాపం గదాధరమ్ ॥
దంష్ట్రా కరాళ వదనం భీమం భైరవ గర్జితమ్
రుండమాలా సమాయుక్తం పాదుకోపరి సుస్థిరమ్ ॥
భద్రకాళీ సమాయుక్తం కరాళ హృది విన్యసేత్ ॥

శ్రీవీరభద్రమూర్తి నల్లని శరీరచ్ఛాయలతో, నాలుగు చేతులతో, మూడు కన్నులతో, జటాజూటముతో, కోరలుగల భయంకరమగు మొగముతో ప్రచండమగు సింహనాదముతో (గర్జనము) కపాలముల దండలతో, పాదములయందు పాదుకలతో, వక్షస్థలమున కరాళముద్రతో, భద్ర కాళీ మహాదేవితో కూడియుండును.

కుడివైపున క్రిందినుండిపైకి ఖడ్గమును 1, బాణమును 2, అట్లే ఎడమ వైపున గదను 1, వింటిని 2 కుడిఎడముల నాలుగు చేతులతో ధరించియుండును.

(నీలవర్ణము)

ఆ) నీలాభం రక్తవస్త్రం భ్రుకుటియుత ముఖం
జ్వాలా కేశం త్రినేత్రం
సవ్యే ఖడ్గం చ దండం త్రిశిఖరపరశుం
వామ భాగే కపాలమ్ ॥
ఖేటం ఘంటా వహంతం ముసలమపి దధత్
కింకిణీమాల యాఢ్యం

సింహ త్వగ్బద్ధసక్తి స్ఫురతు మను పురో
వీరభద్ర స్వరూపమ్ ॥

శ్రీ వీరభద్రస్వామి నల్లని శరీర కాంతులతో, ఎఱ్ఱని వస్త్రములతో, కనుబొమలు ముడివడిన (కోపించిన) ఒక్క ముఖముతో, ఎఱ్ఱని (అగ్నివలె) నున్న కేశములతో, మూడు కన్నులతో, ఎనిమిది చేతులతో, సింహ చర్మముతో కట్టబడిన మోకాళ్ళ క్రింద ప్రదేశములతో నుండును.

ఆ స్వామికుడి భాగమున క్రిందనుండి పైకి కత్తిని 1, దండమును 2, శూలమును 3, గొడ్డలిని 4, అట్లే ఎడమ భాగమున ఖేటమును 1, కపాలమును 2, గంటను 3, రోకలిని 4 కుడి ఎడమల ఎనిమిది చేతులతో ధరించియుండును.

చిరుగంటల దండలతో నొప్పారు ఇట్టి శ్రీ వీరభద్ర స్వామి యొక్క రూపము నా కన్నులముందు ప్రకాసించునుగాక.

## 22. శ్రీ హరిహర ధ్యానము :

స్వంగే విద్రుమాభం శశిధర మకుటం
భస్మ రుద్రాక్ష భూషం
వామాంగే శ్యామ లాభం మణి మకుటయుతం
పీత వస్త్రాతి శోభమ్ ॥
సవ్యే టంకాభయం స్వాదితరకరయుగే
శంఖ కౌమోదకీ స్యాత్
కించి ల్లలాటనేత్రం విలసతు పురతః
శ్రీహరే రర్ధ దేహమ్ ॥
సవ్యే టంకం పరస్మిన్ కటక సుజలజం
సింధు వేణీ సువద్ధం
వామార్ధే సత్కిరీటం రుధిర జల విభం
వ్యాఘ్ర చర్మాంబరాఢ్యమ్ ॥
ఫాలార్ధే లోచనార్ధకలిత సమ పదం
శుభ్ర యజ్ఞోపవీతం
హర్యర్థం నౌమి శంభుం సకల శుభకరం
సర్వసం పత్కరాఢ్యమ్ ॥

కుడి భాగమున శంకరుడు, ఎడమ భాగమున విష్ణువుగల శ్రీ హరిహరమూర్తి రూపము వివరించబడుచున్నది.

కుడి భాగమున శివుడు [illegible] [illegible] [illegible] [illegible], వాని పూయబడిన సర్వాంగములతో, [illegible] [illegible], రుద్రాక్షమాలలతో, నొసట మూడవ కంటితో, శిరమున గంగాదేవితో, పులితోలు వస్త్రముతో, తెల్లని జందెముతోనుండును.

ఎడమ భాగమునందు విష్ణువు నల్లని శరీరచ్ఛాయతో, రత్నములు పొదిగిన బంగారు కిరీటముతో, పచ్చని వస్త్రములతో, కుండలములు హారములు, దండ గడియములు, కంకణములు మున్నగు బంగారు నగలతో నుండును.

ఈ హరిహరమూర్తికి నాలుగు చేతులు. కుడి భాగమున (ఈశ్వరునిది) నిజహస్తమునందు అభయముద్రను 1, పరహస్తమున టంకమును 2 ధరించిన శివుడును. ఎడమ భాగమున (విష్ణువుది) నిజహస్తమునందు గదను 1, పరహస్తమునందు శంఖమును 2, ధరించిన విష్ణుడును తమతమ ఆయుధములతో నుండురు.

ఎల్ల సంపదలను ఇచ్చునట్టి శుభకరుడైన ఈ హరిహరమూర్తియగు శంభునకు నమస్కరించుచున్నాను.

(ఈశ్వరుడు రక్త వర్ణము, విష్ణువు శ్యామ వర్ణము)

## 23. శ్రీ అర్ధనారీశ్వరమూర్తి ధ్యానము :

చతుర్భుజం త్రినేత్రం చ శివాంశం దక్షపార్శ్వకే
వామార్ధం వామభాగేతు సీమంతతిలకాలకమ్ ॥
నేత్రార్ధం తు లలాటే తు సంయుక్తం దక్షిణాంశకే
దక్షిణే కుండలం కర్ణే దధం వామేతు పత్రకమ్ ॥
కట్యాం వా కలితం వామే ऽ భయటం కౌ చ దక్షిణే
వరదోత్పుత్పలకే వామే కేయూర కటకాన్వితమ్ ॥
ఉమాంశేతు స్తనం కుర్యా త్వ్యాహోకారయుతం తువా
శ్రోణ్యర్థం దక్షిణే శంభో ర్వ్యాఘ్ర చర్మ కృతాంబరమ్ ॥
ఉమార్ధం కటిసూత్రం తు చిత్ర వస్త్ర పరిచ్ఛ దమ్
నూపురాలంకృతం వామే సవ్య పాదం తు కుంచితమ్ ॥
స్వయం ప్రవాల వర్ణః స్యాత్ సుకృష్ణం వామ భాగకమ్
అర్ధనారీశ్వరం ప్రోక్తం రూపం సర్వసుభప్రదమ్ ॥

కుడి భాగమున శంకరుడు, ఎడమ భాగమున పార్వతి గల అర్ధనారీశ్వరమూర్తి వరింపబడుచున్నది.

కుడి భాగమునందీశ్వరుడు ఎఱ్ఱని శరీర చ్ఛాయలతో, గంగాదేవి, చంద్రరేఖగల జటాజూటముతో, సగము నొసటికంటితో, చెవియందు కుండలముతో పులితోలు వస్త్రముగల సగము భాగము నడుముతో నుండును.

ఎడమ భాగమున పార్వతి నల్లని శరీరచ్ఛాయలతో, పాపటతో, తిలకముతో, ముంగురులతో కూడిన మొగముతో, తాటంకము (కర్ణభూషణము) గలచెవితో, వామస్తనముతోనుండును.

కుడి ఎడమలందు నాల్గు చేతులు, ఈశ్వరుడు నిజహస్తమునందు అభయ ముద్రను, పరహస్తమునందు టంకమును, పార్వతి నిజహస్తమును నడుమునందుంచుట చేత (లేక) ఆ హస్తమునందు వరముద్రను, పరహస్తమునందు కలువ పుష్పము ధరించి యుండును.

కుడిపాదము (ఈశ్వరునిది) కుంచితమై (కొంచెము ముడుచబడినదై) యుండును. ఎడమ పాదము (పార్వతిది) నూపురములతో (ఆభరణములతో) అలంకరింపబడియుండును.

(ఈశ్వరుడు రక్తవర్ణము, దేవి శ్యామలవర్ణము)

## 24. శ్రీ కిరాతార్జున ధ్యానము :

చతుర్భుజం త్రినేత్రంచ జటామకుట సంయుతమ్
సర్వాభరణ సంయుక్తం దివ్యాంబర సమావృతమ్ ॥
ధనుర్బాణయుతం రక్తం కృష్ణాపరశు సంయుతమ్
ఉపవీత సమాయుక్తం సమభాగతనుం కురు ॥
వామే గౌరీ సమాయుక్తం దక్షిణేత్వర్జున : స్థిత :

అర్జున స్వరూపము

ఏక వక్త్రం ద్వినయనం జటామకుట సంయుతమ్ ॥
సర్వాభరణ సంయుక్తం కృతాంజలి పుటం స్థితమ్ ॥
ఏవం కైరాత మాఖ్యాతమ్ ॥

శ్రీ కిరాతార్జునమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, నాలుగు చేతులతో, మూడు కన్నులతో, జటాజూటముతో, అన్ని నగలతో, దివ్యములై ప్రకాశించు వస్త్రములతో, ఎడమ భాగమున గౌరీదేవితో, కుడిభాగమున అర్జునునితో ఉండును.

కుడి భాగమున క్రింది నుండిపైకి బాణమును, టంకమును అట్లే ఎడమ భాగమున ధనుస్సును, లేడిని కుడి ఎడమల నాలుగు చేతులతో ధరించును.

ఎడమ భాగమునందున్న [illegible] [illegible] [illegible], రెండు కన్నులతో, జటాజూటముతో, అంగ[illegible] [illegible], శ్రీస్వామి వారికి నమస్కరించుచు ఉండును.

(స్వామి ఎట్లుండు, [illegible])

## 25. శ్రీ కంకాలమూర్తి ధ్యానము :

భస్మాలేపత్రిపుండ్రం రుచిరమణిలస
త్పిచ్ఛకం కాలదక్షం
టంకం వామే కరాబ్జే దధత మభిలస
త్సాంద్ర సిందూర శోభమ్ ॥
శూలం కృష్ణస్య వక్షే ప్రసృత కరతలం
బద్ధ బాలేందు చూడం
వందే దేవైర్మునీంద్రైః పరిష్కృత మభవం
వ్యాఘ్ర చర్మోత్తరీయమ్ ॥

చతుర్భుజం త్రినేత్రం చ జటామకుటసంయుతమ్
పాదయోః పాదుకాయుక్తం కించి ద్వై గమనోన్ముఖమ్ ॥
సర్వాభరణ సంయుక్తం యజ్ఞసూత్రోత్తరీయకమ్
శంఖం తువామకర్ణేతు దక్షిణే నక్ర కుండలమ్ ॥
కించి త్స్మ హసితాస్యంచ నానా లీలా సమావృతమ్
ఛురికాం దక్ష కట్యాంతు దధానం భూత సంయుతమ్ ॥
భిక్షాన్న మోచనాయాత మృగ పక్ష్యాది సంయుతమ్
దేవస్య వామపార్శ్వేతు మహా భూతం ప్రకల్పయేత్ ॥
ద్విభుజంచ ద్వినేత్రం చ కరాళ వదనాన్వితమ్
కపాలం శిరసి న్యస్య దేవవామే తు సంస్థితమ్ ॥
ఏవం కంకాల మా ఖ్యాతమ్ ।

శ్రీకంకాలమూర్తి ఎఱ్ఱని శరీర ఛ్ఛాయలతో, సర్వాంగములయందు విభూతితో పూయబడిన త్రిపుండ్రములతో, చంద్రరేఖ నలంకరించిన జటాజూటముతో, పులితోలు ఉత్తరీయముతో, మూడుకన్నులతో, నాలుగుచేతులతో, పాదములయందు పాదుకలతో, సర్వాభరణములతో, ఉత్తరీయమువలెనున్న జందెముతో, కుడిచెవియందు మకర కుండలముతో ఎడమ చెవియందు శంఖముతో, చిరునవ్వుల మొగముతో, ప్రయాణమునకు సిద్ధపడుచున్న రూపముతో, పరివేష్టించిన భూతములతో, భిక్షాన్న దానములకై వచ్చిన మృగములతో, పక్షులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1. పుణులతో కూడిన నెమలి పించమును, ఎముకను అట్లే ఎడమ భాగమున లేడిముఖము పైకి చాపబడిన నిజ హస్తమును, టంకమును నాలుగుచేతులతో ధరించును. నడుమున క్రింది భాగమున చిన్న కత్తియుండును.

శ్రీ స్వామివారి ఎడమ భాగమున రెండు చేతులతో, రెండు కన్నులతో, భయంకరమగు మొగముతో, తలయందు కపాలముతోనున్న ఒక భూతమును నిర్మింపవలెను.

(శ్రీస్వామిరక్తవర్ణము, భూతము నీలవర్ణము)

## 26. శ్రీ చండేశానుగ్రహమూర్తి ధ్యానము

చండేశం పీతవర్ణం యుగకర సహితం
దక్షహస్తే చ టంకం
వామే కృష్ణం దధానం వరకర సహితం
పార్వతీ వామభాగమ్ ॥
చండేశ స్యోత్తమాంగే ప్రతి విహిత కరం
దక్షభాగే త్రినేత్రం
సర్వాలంకారయుక్తం శశికలధరం
గంగయా యుక్త మీడే ॥
దేవస్య దక్ష భాగేతు చండేశం తు ప్రకల్పయేత్
దేవస్య బాహు మాత్రేణ చండేశాయామ ఉచ్యతే॥
వ్యస్త వ్యోమ ప్రపాదేవ చండేశో భక్తిసంయుతః
చండేశ్వరం స్వర్ణవర్ణం బాలభూషణ భూషితమ్ ॥
దేవం శిరసి చండస్య లీలయా పరిశోభితమ్
చండే శానుగ్రహం ప్రోక్తమ్ ॥

చండేశుడను బాలభక్తుని శ్రీ స్వామి అనుగ్రహించెను. అందుచేత శ్రీ స్వామికి కూడా చండేశుడను పేరు గలిగినది. ఇచ్చట చండేశుడను భక్తుని అనుగ్రహించిన శ్రీ స్వామి రూపమును, భక్తుడగు చండేశుని రూపమును వర్ణింపబడుచున్నవి.

శ్రీస్వామి పచ్చని శరీర కాంతులతో, నాలుగుచేతులతో, మూడు కన్నులతో ంగతో, చంద్రరేఖతో కూడిన జటాజూటముతో, సర్వాలంకారములతో ఎడమ భాగమున ర్వతితోనుండును.

కుడి నిజకరము చండునిపై శిరముపై నుండును, నిజ వామకరమునందు వరముద్ర ండును. పరకరములతో కుడిచేతియందు టంకమును, ఎడమచేతియందు మృగము ఉండును.

శ్రీస్వామి వారి కుడివైపున చండేశ్వరుని నిర్మింపవలెను. అతని పొడవు శ్రీస్వామివారి బాహువంత ఉండవలెను. తన శిరమున స్వామి అనుగ్రహముతో చేయి పెట్టుటచేత చండేశుడు భక్తియుతుడాయెను. అతడు సర్వభూషణములతో నుండవలెను.

(స్వామి, చండేశుడును పీతవర్ణము)

## 27. శ్రీ విషాపహారమూర్తి ధ్యానము

ఏక వక్త్రం త్రినయనం జటామకుట సంయుతమ్
చతుర్బాహుం సురక్తం సమ్మృగం పరశు ధారిణమ్ ॥
దక్షహస్తే గరం ధృత్వా పానో న్ముఖ మదేక్షణమ్
వరదం వామహస్తే తు సర్వాలంకార సంయుతమ్ ॥
దేవస్య వామ పార్శ్వేతు దేవీం చైవ హి కారయేత్ ॥
శ్యామాం ద్వినేత్రం ద్విభుజాం త్రిభంగీం
సవ్యాపసవ్యస్థిత కుంచి తాంఘ్రిమ్
కంఠే నిపీడ్య స్థిత సవ్యలంబాం
చింతాకులా మీశ్వర తుష్టి దాత్రీమ్ ॥
పీతవస్త్రాం ద్వినయనాం వాంఛి తార్థ ఫలప్రదామ్॥

శ్రీవిషాపహార స్వామి మిక్కిలి ఎఱ్ఱనగు శరీర ఛ్ఛాయలతో, ఒక్క మొగముతో, మూడు కన్నులతో, చంద్ర రేఖాలంకృతమగు జటాజూటముతో, చతుర్బాహువులతో, సర్వాలంకారములతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి గరళ పాత్రమును, టంకమును, అట్లే ఎడమ వైపున వరముద్రను, లేడిని నాల్గు చేతులతో ధరించి గరళమును త్రాగుటకు సిద్ధపడి మదముచే ఎఱ్ఱబడిన కన్నులతో నుండును. స్వామి వారి వామభాగమున నల్లని శరీర ఛ్ఛాయులతో రెండు కన్నులతో, రెండు చేతులతో, త్రిభంగమగు (మూడు వంకలుగల) రూపములో, కొలదిగ వంచిన కుడి ఎడమ పాదములతో, స్వామి కంఠమును కౌగలించిన కుడిచేతితో, బంగారు వస్త్రములతో, తన స్వామి విషపానము చేయుచున్నాడను దుఃఖములో నున్నను, అతనికి ధైర్యమును, సంతృప్తిని, కలిగించుచూ, భక్తులకోర్కెలు తీర్చునట్టి ముజ్జగముల తల్లియగు దేవిని కూర్చున్న దానినిగా నిర్మింపవలెను.

(స్వామి ఎరుపు, దేవి నలుపు)

## 28. శ్రీ చక్రదానమూర్తి ధ్యానము

విష్ణు ర్మ్నీశపుర స్థితో ఽ అంజలికరో
దేవస్య పాదాబ్జమోః

సంస్థాప్యాక్షిల సత్సుమాల్య మనిశం
పీతాంబరం కౌస్తుభమ్ ॥
యస్తస్మై దయయా పరం పశుపతిం
పద్మాక్ష ఇత్యా ఖ్య యా
టంకం కృష్ణమృగం వరం చ దధతం
చక్రప్రదం తం భజే ॥

ఏకవక్త్రం త్రినేత్రం చ జటామకుటసంయుతమ్
దధ మేణం చ పరశుం వరదం చైవ వామకే ॥

దక్షిణే చక్ర సంయుక్తం దాత్సరూప మి హో చ్యతే
దేవశ్య వామభాగే తు శ్యామరూపం సు సంస్థితమ్ ॥

సర్వాభరణ సంయుక్తం పీతవస్త్రోత్తరీయకమ్
శంఖ చక్రసమాయుక్త ముత్తరే చాంజలిం న్య సేత్ ॥

ఏవం లక్షణ సంయుక్తం విష్ణురూప మి హో చ్యతే ॥

శ్రీ చక్రదానమూర్తియగు పరమశివుడు ... ముగముతో, మూడుకన్నులతో, తెల్లని శరీచ్ఛాయతో, చంద్రరేఖాలంకృతమైన ... ముతో, నాలుగుచేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండిపైకి విష్ణునకు ఈయదలచిన సుదర్శన చక్రమును టంకమును, అట్లే ఎడమవైపున వరముద్రను, లేడిని ధరించి నాలుగుచేతులతోనుండును.

శ్రీస్వామి వారి ఎడమ భాగమున నల్లని శరీర కాంతులతో, సర్వాభరణములతో, పచ్చని పట్టుబట్టలతో, శ్రీ స్వామికి నమస్కరించుచూ దోసిలి పట్టిన నిజకరములతో శ్రీ స్వామివారి పాదములయందు పద్మమువంటి తన కన్నుతోకూడిన మాలను, కౌస్తుభమణిని, పీతాంబరమును సమర్పించుచున్న చూపులతో, పరకరములయందు చక్రమును, శంఖమును ధరించి విష్ణుడు ఉండవలెను.

దయాపూర్ణుడగుచు "ఓ పద్మాక్షా" అని పిలిచి చక్రమును అనుగ్రహించుచున్న చక్ర ప్రదుడగు శ్రీ చక్రదానమూర్తిని నేను భజించుచునాను.

(శ్రీస్వామిది శ్వేతవర్ణము, విష్ణువుది శ్యామ వర్ణము)

## 29. శ్రీ విఘ్నేశ్వర ప్రసన్నమూర్తి ధ్యానము :

చతుర్భుజం త్రినేత్రం చ జటామకుట సంయుతమ్
అభయం శిరసి న్యస్య వరదం వామహస్తకే ॥

కృష్ణా పరశు సంయుక్తం విఘ్నేశో దక్షిణే స్థితః
శయానం దక్షిణం పాదం దధం వామం తు లంబితమ్ ॥

సర్వాభరణ సంయుక్తం సర్పం సుశోభితమ్ ।
దేవస్య వామ పార్శ్వేతు దేవీం ప్రహసితాననామ్ ॥
సర్వాలంకార సంయుక్తం సవ్యే తూత్పల ధారిణీమ్
వామే వరద సంయుక్తం ద్విభుజాం చ త్రినేత్ర కామ్ ॥
దక్షిణే శయితం పాదం వధం వామేతు లంబితమ్
ఏకపీఠ స్థితాం దేవీ ముమాస్యాదో క్షిపత్స్యరు ॥
విఘ్నేశం రక్త వర్ణం చ కిరీట మకుటాన్వితమ్
నమస్కారాంజలి కరం పాశాంకుశ సమన్వితమ్ ॥
సర్వలక్షణ సంయుక్తం సర్వాభీష్ట ఫలప్రదమ్
విఘ్న ప్రసాద మిత్యుక్తమ్: ॥

శ్రీ విఘ్నేశ్వర ప్రసన్నస్వామి నల్లని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నాలుగు చేతులతో, చంద్రరేఖాలంకృతమైన జటాజూటముతో సర్వాభరణముల నలంకరించుకొని యుండును.

శ్రీస్వామివారి కుడి పరహస్తమును విఘ్నేశ్వరుని శిరమునందు అభయ ముద్రతోనుండును, వామహస్తమునందు వరద ముద్ర ఉండును. కుడి ఎడమ పరహస్తములయందు టంకము లేడి ఉండును.

శ్రీస్వామివారి కుడి పాదము శయనించియుండును, ఎడమ కాలు వ్రేలాడుచుండును.

శ్రీస్వామి ఎడమ భాగమున చిఱునవ్వు మొగముతో నల్లని శరీర చ్ఛాయలతో, రెండుచేతులతో, మూడు కన్నులతో, అవయవములన్నింటియందు ధరింపబడిన నగలతో గౌరీదేవి యుండును.

ఆమె కుడి చేతియందు కలువపువ్వు, ఎడమచేతియందు వరముద్ర ఉండును. ఆమె కుడికాలు శయనించినదై ఎడమకాలు వ్రేలాడుచునుండును.

శ్రీస్వామి వారికి కుడి భాగమున విఘ్నేశ్వరుడు ఎఱ్ఱని శరీర చ్ఛాయులతో కిరీటము మున్నగు భూషణములతో, నాలుగు చేతులతో నుండును. అతని నిజకరములు శ్రీ స్వామివారికి నమస్కరించుచు దోసిలిని పట్టియుండును. పరకరములతో కుడి దానియందు అంకుశము, ఎడమదానియందు పాశము ఉండును.

ఎల్ల లక్షణములతో కూడిన ఈ విఘ్నప్రసాదస్వామి రూపము ఎల్లరకు కోరిన ఫలములనిచ్చును.

(శ్రీస్వామి శ్రీదేవియును నలుపు, శ్రీ విఘ్నేశ్వరుడు ఎఱుపు)

## 30. శ్రీ సోమాస్కందమూర్తి ధ్యానము :

ఉద్యద్భాను నిభం చతుష్కరయుతం
కేయూర హారాది భి
ర్దివ్యం వస్త్రధరం జటామకుటి నం
సంశోభినేత్ర త్రయమ్ ॥
వామే గౌరీయుతం సుఖాస ముభయో
ర్మధ్యే కుమార స్థితిం
సోమాస్కంద విభుం మృగాభయ వరాన్
టంకం దధానం భజే ॥

సోమస్కం దేశ్వరం ప్రోక్తం భోగశక్తి సమన్వితమ్
చతుర్భుజం త్రినేత్రం చ జటామకుట మండితమ్ ॥
సర్వాభరణ సంయుక్తం వరదాభయ హస్తకమ్
కృష్ణం టంకం దధానం చ దక్షిణే వామకే ఽ పిచ ॥
పత్రం తు వామకర్ణేతు దక్షిణే నక్ర కుండలమ్
ఉపవీత ధరం చైవ శయానం వామ పాదకమ్ ॥
లంబితం దక్షిణం పాదం వామే గౌరీ సమన్వితమ్
తయో ర్మధ్య గతం స్కందం సర్వలక్షణ సంయుతమ్ ॥
సోమాస్కంద మితిప్రోక్తం గంగా చంద్రసమన్వితమ్
సోమాస్కందశ్య పార్శ్వేతు భోగశక్తి శ్చ వామకే ॥
వీరాం తు దక్షిణే పార్శ్వే చాసీనాం వా స్థితాం తువా
పంచవింశతి మూర్తీనాం సోమస్కందో మహాన్ మత: ॥
ఉత్సవారంభకాలేతు సోమస్కందో విశేషత :
ధరాంతు కుముదం దేవీం వామే వరద సంయుతమ్ ॥
శయానం దక్షిణం పాదం వామపాదంతులంబితమ్ ॥

## స్కంద ధ్యానము :

బాలరూపం స్థితం స్కందం ద్వినేత్రం ద్విభుజాన్వితమ్ ॥
తరళాబ్జధరం హస్తే సర్వాభరణ భూషితమ్ ॥
సోమస్కంద మితి ప్రోక్తమ్ ॥

శ్రీ సోమస్కందమూర్తి ఉదయించుచున్న లేత సూర్యుని వలె ఎఱ్ఱని శరీర చ్ఛాయలతో, మూడు కన్నులతో, గంగాదేవి చంద్రరేఖలచే నలంకరింపబడిన

జటాజూటముతో, జందెముతో ఎడను భాగమున భోగశక్తియగు గౌరీదేవితో, నాలుగుచేతులతో ఆభరణములన్నింటిచేత నలంకరింపబడిన సర్వాంగములతో కుడిచెవియందు మకరకుండలమును, ఎడను చేతియందు తాటంకముతో, మధ్య భాగమున కుమార స్వామితో, సుఖముగ నాసీనుడై, దివ్యమగు వస్త్రములను ధరించి యుండును. గౌరీదేవి వీర శక్తియైనచో కుడివైపున కూర్చుండిగానీ, నిలచిగానీ వుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయ ముద్రను, టంకమును అట్లే ఎడమ వైపున వరముద్రను, లేడిని నాలుగుచేతులతో ధరించియుండును.

శ్రీ స్వామి ఎడమ కాలు శయనించియుండును. కుడి కాలు వ్రేలాడుచుండును.

వామ భాగమునందున్న గౌరీదేవి కుడి చేతియందు కలువపువ్వును, ఎడమ చేతియందు వరదముద్రయునుండవలెను. ఆమెకుడి కాలు శయనించి ఎడమ కాలు వ్రేలాడుచు పీఠమునందుండవలెను. వారి మధ్యమున నున్న స్కందుడు బాలరూపముతో, రెండుకన్నులు, రెండు చేతులతో, సర్వాభరణములతో, హస్తమునందు పద్మముతో నుండవలెను.

ఇది సోమస్కందమూర్తి రూపము. ఇరువది ఐదుశివమూర్తులలో నిది మిక్కిలి ప్రశస్తమైనది. ఉత్సవకాలములయందు ఈ సోమస్కంద రూపుడైన శ్రీ పరమశివునకు విశేష ప్రాధాన్యత కలదు.

(శ్రీస్వామి రక్తవర్ణుడు, దేవి శ్యామవర్ణము, స్కందుడు నీలవర్ణము)

### 31. శ్రీ ఏకపాదమూర్తి ధ్యానము :

ధ్యా యే త్కోటి రవిప్రభం త్రినయనం
శీతాంశు గంగాధరం
హస్తే టంక మృగం వరాభయకరం
పాదైక యుక్తం విభుమ్ ॥
శంభో ర్దక్షిణ వామకక్ష భుజయో
ర్బ్రహ్మా చ్యుతా భ్యాం స్థితం
తత్ర ల్లక్షణ మాయుధై: పరివృతం
హస్త ద్వయా ధ్యాంజలిమ్ ॥
బ్రహ్మాండప్రళయే సుసంస్థిత పదం
బ్రహ్మాండ మధ్యస్థితమ్
హ్యేవం లక్షణ సంయుతం పురహరం
పాదైకమూర్తీ కృతమ్ ॥

ఏకపాద మితి ఖ్యాతమ్ ॥

ఏకపాదమూర్తి కోటి సూర్యులవలె మిక్కిలి ఎఱ్ఱని శరీర ఛ్ఛాయలతో, గంగాదేవి చంద్రరేఖలచే నలంకరింపబడిన జటాజూటములతో, ఒక్క పాదముతోనుండును.

కుడివైపున క్రింది నుండిపైకి అభయముద్రను, టంకమును, అట్లే ఎడమువైపున వరముద్రను, లేడిని నాలుగుచేతులతో ధరించును. శ్రీ స్వామి కుడి భాగమున బ్రహ్మయును, ఎడమ భాగమున విష్ణువును తమ తమ ఆయుధములతోను పరకరములరెంటితో ధరించి, రెండు నిజ కరములతో నమస్కరించుచుందురు.

శ్రీస్వామివారి ఏక పాదము బ్రహ్మాండ మధ్యమున, ఆధార స్తంభము వలె ప్రళయ కాలమున కూడా చెదరక నిలచియుండును.

ఈ లక్షణములతో కూడిన పురహరుని మూర్తి ఏక పాదరూపమని ప్రసిద్ధమైనది.

(రక్తవర్ణము, శ్వేత వర్ణమనియు ప్రమాణము)

## 32. శ్రీ సుఖాసీన మూర్తి ధ్యానము :

**అరుణాభసుభస్మ విలేపన ధృ**
**ద్ధరణీచర టంక వరా భయదమ్ ॥**
**అరుణాంబర శోభిలసచ్ఛు భదం**
**గుణనేత్ర సుఖాసన రూప మిదమ్ ॥**

**చతుర్భుజం త్రినేత్రం చ జటామకుట సంయుతమ్**
**అభయం దక్షిణే హస్తే వరదం వామహస్తకే ॥**

**కృష్ణా పరశుసంయుక్తం వామదక్షిణ హస్తయో :**
**శయానం దక్షిణం పాదం దదం వామంతు కుంచితమ్ ॥**

**ఉమా సహిత వత్సర్వం స్కంద గౌరీ వివర్జితమ్**
**సుఖాసన మితి ప్రోక్తమ్ ॥**

శ్రీ సుఖాసీన మూర్తి ఎఱ్ఱని శరీర ఛ్ఛాయలతో, మూడు కన్నులతో, గంగాదేవి చంద్రరేఖలచే నలంకరింపబడిన జటాజూటముతో, జందెముతో, నాలుగు చేతులతో, ఆభరణములన్నింటిచేత నలంకరింపబడిన సర్వావయవములతో, ఎఱ్ఱని వస్త్రముతో సుఖాసీనుడై యుండును.

శ్రీ స్వామికుడి వైపున క్రిందనుండి పైకి అభయముద్రను, టంకమును అట్లే ఎడమ వైపున వరముద్రను, లేడిని ధరించిన నాలుగు చేతులతో నుండును.

శ్రీస్వామి కుడి కాలు శయనించి, ఎడమ కాలు కొంచము కుంచితమై (వంచబడినదై) యుండును.

ఎల్ల సుఖములను ఇచ్చునట్టి ఈ రూపమును సుఖాసీనమని చెప్పబడినది.

(రక్తవర్ణము)

## 33. శ్రీదక్షిణామూర్తి ధ్యానము :

భూతివ్యాపాండురాంగ : శశి శకల ధరో
జ్ఞాన ముద్రాక్ష మాలా
వీణాపుస్తై ర్విరాజోత్కర తలకమలో
యోగ పట్టాభి రామః ॥
వ్యాఖ్యాపీఠే నిషణ్ణః సకలమునివరైః
సేవిత స్సు ప్రసన్న :
సవ్యాలః కృత్తి వాసా : సతత మవతు నో
దక్షిణామూర్తి రీశ : ॥
దక్షిణే జమదగ్నిశ్చ వసిష్ఠ భృగు నారదా :
భరద్వాజః శౌనక శ్చాప్య గస్త్యో భార్గవ స్తథా ॥
వామపార్శ్వే విధాతవ్యాః కిన్న రాద్యైః సుసేవితే
కైలాస పర్వతే తస్మిన్ వట వృక్షస్య మూలకే ॥
ఆసీనం సకలేశం తు శాంతరూపం మహేశ్వరమ్
దక్షిణామూర్తి మూచుస్తే ఽ ప స్మారం శాయమే దధ : ॥

సురలు, అసురులు, కిన్నరులు, కింపురుషులు, ప్రమధులు మున్నగు సకల పరిజనములు సేవించుచుండ కైలాసపర్వతమునందలి వటవృక్ష మూలమునందు దక్షిణామూర్తి, వ్యాఖ్యాన మూర్తి అనుపేరులతో మహేశ్వరుడు సుఖాసీనుడై యుండును.

ఆ స్వామి విభూతిచేత తెల్లనగు సర్వావయవములతో, చంద్రరేఖచే నలంకరింపబడిన జటాజూటముతో, పాముల భూషణములతో, పులితోలు వస్త్రముతో, నాలుగు చేతులతో నడుమున యోగపట్టముతో, వ్యాఖ్యాపీఠమునందు కూర్చుండి సమస్త ముని గణములచేత సేవింపబడుచు అభిరాముడై ప్రసన్నుడై యుండును.

కుడివైపున క్రిందనుండి పైకి జ్ఞానముద్రను, జపమాలను, అట్లే ఎడమవైపున పుస్తకమును, వీణను నాలుగు చేతులయందు ధరించియుండును.

ఆ స్వామి కుడి భాగమున జమదగ్ని, వసిష్ఠుడు, భృగుడు, నారదుడును, ఎడమ

భాగమున భరద్వాజుడు, శౌనకుడు, అగస్త్యుడు, భార్గవుడును ఉండవలయును. క్రింది భాగమున (పాదముల క్రింద) అపస్మారుడను వానిని పరుండ బెట్టవలెను.

సకల లోకములకు ప్రభుడగు, శాంతరూపుడగు, ఈ మహేశ్వరుని దక్షిణామూర్తి లేక వ్యాఖ్యానమూర్తి అని వృద్ధులగు ఋషులు పలుకుచుందురు.

(సుప్రభవర్ణము)

ఆ) **అచల ఉపరిశృంగే శంభు యోగాసన స్థం**
**ధవళ మమల వర్ణం చైకవక్త్రం త్రినేత్రమ్ ॥**
**కరగత శుచిసర్పం పుస్తక జ్ఞాన ముద్రం**
**మునినుత పదయుగ్మం దక్షిణామూర్తి మీడే ॥**

శ్రీదక్షిణామూర్తి మిక్కిలి ఎత్తైన పర్వత శిఖరమునందు స్వచ్ఛమగు మిక్కిలి తెల్లని శరీర కాంతులతో, మూడు కన్నులుగల ఒక్క మొగముతో, నాలుగు చేతులతో, కళ్యాణకరమైన యోగాసనమందుండును.

కుడి భాగమున క్రిందనుండి పైకి జ్ఞానముద్రను, నాగపాశమును అట్లే ఎడమ వైపున పుస్తకమును, అగ్నిని కుడి ఎడమల నాలుగు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో సకలముని జనముచేత నుతింపబడు పాదములుగల శ్రీ దక్షిణామూర్తి స్వామిని నేను ప్రార్థింతును.

(సుప్రభవర్ణము)

## 34. శ్రీ లింగోద్భవ మూర్తి ధ్యానము :

**లింగాకారస్య మధ్యేతు చంద్రశేఖరవత్థ్సితమ్**
**నలకాధస్థ్సితం పాదం లింగోద్భవ సమన్వితమ్ ॥**
**విరించి ర్హంసరూపేణ చోర్ధ్వగో వామపార్శ్వకే**
**దక్షే వరాహరూపస్య రూపేణా ధోగతో హరి : ॥**
**వామదక్షిణ పార్శ్వ స్థౌ కృతాంజలి సమన్వితా**
**స్వరూపేణ ద్వి పాదస్థౌ వజ విష్ణూ విభో: పరే ॥**
**ఏవం లింగావతారస్తు సర్వశాంతి కర: సదా ॥**
**తుంగాంగ విస్తృతి న తాం సకలం బ మా నై:**
**సంపన్న చిహ్న భుజ భూషణ వర్ణ భేదై: ॥**
**శోభా న్వితం శుభకరం సకల ప్రజానా**
**మైశ్వర్య సంఘ పరివృద్ధి కరం విదధ్యాత్ ॥**

శ్రీలింగోద్భవమూర్తి లింగము యొక్క మధ్య భాగమున చంద్రశేఖరుడైన పరమశివుని రూపములోనుండవలెను. ఆచంద్రశేఖరుని పాదము లింగమునందుండవలెను.

శ్రీ చంద్రశేఖరుడు కుడివైపున క్రిందనుండి పైకి అభయముద్రను, గొడ్డలిని అట్లే ఎడమవైపున వరముద్రను, లేడిని కుడిఎడమల ధరించిన నాలుగుచేతులతోనుండును.

ఆస్వామికి ఎడమవైపున హంస రూపముతో నున్న బ్రహ్మను పైకి వెళ్ళుచున్నట్లు, నిర్మింపవలెను. కుడివైపున వరాహ రూపముతోనున్న విష్ణువును క్రిందికి వెళ్ళుచున్నట్లు నిర్మింపవలెను

వామ దక్షిణ భాగములయందున్న బ్రహ్మయు, విష్ణువును తమ తమ స్వరూపముతో, రెండు పాదములతో నమస్కారాంజలిని పట్టిన నిజ కరములతో, పరకరములయందు తమ తమ ఆయుధములతో, మొగములయందు మాత్రమే హంసము యొక్క వరాహము యొక్క రూపములలో నుండవలయును.

ఆయుధములు,చేతులు, ఆభరణములు వర్ణములు మున్నగునవి ఎత్తునందు, వైశాల్యమునందు మూసరములు మున్నగునవి తగిన రీతిగానున్నచో సుందరమైన ఆ మూర్తి సుభములనిచ్చును. సర్వ ప్రజలకు ఐశ్వర్యము వృద్ధిచేయదగును.

శ్రీలింగోద్భవమూర్తి విశ్వమునకు శాంతిచేకూర్చును.

(శుభ్రవర్ణము)

## 35. శ్రీ శరభమూర్తి ధ్యానము :

మహామేరు సమాకార మష్టపాదం రవిప్రభమ్
ద్వాత్రింశద్బాహు సంయుక్తం సూర్యసోమాగ్ని లోచనమ్ ॥
దుర్గా కాల ద్విపక్షం చ సుతీక్ష ఘన గర్జితమ్
ఊర్ధ్వ కేశం మహాబాహుం నానాలంకార భూషితమ్ ॥
వజ్రముష్ట్యభయం చక్రం శక్తిం దండాంకు శౌ తథా
ఖడ్గ ఖట్వాంగ పరశు వక్షమాలాస్థి శూలకమ్ ॥
ధనుశ్చ ముసలం చాగ్నిం దధానం దక్షిణైః కరైః
వరదం పాశహస్తం చ గదాం బాణ ధ్వజౌ తథా ॥
క్రక చం క్రోడశంఖౌ చ ఖేటం నాగం చ పంకజమ్
కపాలం పుస్తకం కుంతం దుర్గా శ్లిష్ట కరాంబుజమ్ ॥
హలంవామే దధానం చ భీషణం కరపంకజైః
దంష్ట్రోల్లాసం మహాసింహచ్ఛటాచ్ఛటనిపీడితమ్ ॥

శ్రీ శరభమూర్తి ఎఱ్ఱని శరీర చ్ఛాయలతో, మహామేరు పర్వతమునంటి ఆకారముతో, ఎనిమిది పాదములతో, ముప్పది రెండు చేతులతో, సూర్యుడు, చంద్రుడు, అగ్ని ఆ ముప్పుర రూపములలోనున్న మూడు కన్నులతో, మర్గపతె నల్లనగు రెండు రెక్కలతో, భయంకరమగు ఉరుమువంటి గర్జనములతో, పైకిలేచియున్న వెంట్రుకలతో, గొప్ప పొడవైన చేతులతో, సర్వాగములయందు భూషణములతో, మహాభీషణమగు కోరల కాంతులతో, సింహముల సమూహములను మర్దించుచు ఉండును.

ఈ స్వామి కుడివైపున క్రిందనుండి పైకి అభయముద్రను 1, ముష్టి అను ఆయుధమును 2, అంకుశమును 3, గొడ్డలిని 4, దండమును 5, బాణమును 6, రోకలిని 7, ఖట్వాంగమును 8, చక్రమును 9, ఖడ్గమును 10, అగ్నిని 11, శక్తిని 12, శూలమును 13, జపమాలను 14, వజ్రమును 15, ఎముకను 16. అట్లే ఎడమవైపున శ్రీ దుర్గాదేవిని 1, వరద ముద్రను 2, పాశమును 3, గదను 4, ఏంటిని 5, ధ్వజమును 6, అంపమును 7, వరాహ ముఖమును 8, శంఖమును 9, ఖేటమును 10, నాగమును 11, పద్మమును 12, కపాలమును 13, పుస్తకమును 14, కుంతమును 15, నాగలిని 16, కుడి ఎడమల ముప్పది రెండు చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ శరభమూర్తికి నమస్కరించుచున్నాను.

## శ్రీ నందికేశ్వర ధ్యానము :

**బిభ్రాణం పరశుం మృగం కరతలై రీశే ప్రణామాంజలిం**
**భస్మో ధూళిత పాండరం శశికళా గంగాక పర్దో జ్జ్వలమ్ ॥**
**శ్రీకంఠే త్రిపురాంతకే ప్రణయినం జ్యేష్ఠా గణేంద్రా వృతం**
**బ్రహ్మేంద్రాచ్యుత వందితాంఘ్రి కమలం శ్రీ నందికేశం భజే ॥**

శ్రీ నందికేశ్వరుడు గొడ్డలిని, లేడిని కుడి ఎడమల ధరించిన హస్తములతో, ఈశ్వరుని నమస్కరించు చున్న నిజకరములతో విభూతి పూతల చేత తెల్లనగు శరీరముతో, చంద్రరేఖ, గంగాదేవి కల జటాజూటముతో ప్రకాశించుచుండును.

శ్రీకంఠుడు, త్రిపురాంతకుడగు పరమశివుని యందుభక్తి కలిగి, దేవతా శ్రేష్ఠులగు ఇంద్రాదులచే చుట్టబడిన బ్రహ్మ, విష్ణువు మున్నగు వారలచేత నమస్కరింపబడుచున్న శ్రీ నందికేశ్వరుని నేను భజించుచున్నాను.

(శ్వేత వర్ణము)

## 36. శ్రీ కల్యాణ సుందరమూర్తి లక్షణము (కాశ్యప శిల్ప శాస్త్రే)

అథ కళ్యాణ సుందరమూర్తే లక్షణం వక్ష్యతే వ ఘ నా ॥
సుస్థితం వామ పాదంతు దక్షిణం కుంచితం భవేత్ ।
దక్షిణం పూర్వ హస్తంతు గౌరీ దక్షిణ హస్త ధృత్ ॥

వరదం వామ హస్తంతు పరహస్త ద్వయోస్తదా ।
దక్షిణే పరశుం చ వామే కృష్ణ మృగం తథా ॥

జటా మకుట సంయుక్తః సర్వాభరణ భూషిత : ।
దేవః ప్రవాళ వర్ణాభః దేవేశస్య విశేష తః ॥

సవ్యశ్యామ శిఖాదేవి ప్రాగ్వ న్మానాది సంయుతా ।
ఉత్పలం వామహస్తేయు తథా దక్షిణ హస్తకమ్॥

శంభోర్హస్తేన సంగృహ్య లజ్జాలంబన సంయుతా ।
పార్వత్యానుగతా శ్రీ వాణి సర్వాభరణ భూషితా ॥

హస్తస్తు సంస్పృశే ద్దేవ్యా : గౌర్యాస్తు కటిశీ మకం
దేవాగ్రే కారయేత్ కుండే హోమకర్మ ప్రజాపతి : ॥

శంభో ర్నైస్తన సీ మాస్తం ప్రజేశస్యోదయం భవేత్ ।
చతుర్భుజం చతుర్వక్త్రం సర్వాభరణ భూషితమ్ ॥

కుండి కాంచాక్ష మాలాంచ వామదక్షిణతః పరే ।
సృక్ స్రువా పూర్వహస్తే ద్వౌ సవ్యే వామే కరాత్ క్రమాత్ ॥

ఉత్తరాభి ముఖాసీనో పద్మపీఠే ప్రజాపతి : ।
ప్రాగగ్రేదేవి దేవేశా దేవి దేవస్య దక్షిణే ॥

దక్షిణాభిముఖో విష్ణుః హోమ స్యోత్తరదిక్ స్థితః ।
శంభోర్నైవాపి సీమాస్తం శ్రేష్ఠాయామం స్తనాంతకమ్ ॥

హిరణ్య కరకేనైవ పూర్వహస్త ద్వ యోపరి ।
సంగ్రాహ్య వరదే హస్తే దద్యా దుదక పూర్వకమ్ ॥

తీర్థాంబు స్వర్ణకలశం పూర్వ హస్త ద్వమేస్థితమ్ ।
శంఖ చక్ర ద్వయం చైవ వామదక్ష కరస్థితామ్ ॥

అనాదిగోత్ర సంభూతః శ్రీ శివః పరమేశ్వర : ।
ఆది గోత్రాం ఉమాం గౌరీం తవై వాద్య దదామ్యహమ్ ।

ఇత్యుక్త్వా వరదే హస్తే దద్యాత్ హస్తో దకం హరిః ।
అష్ట విద్యేశలోకేశ సిద్ధ యక్ష గణాదయ : ॥

ఋషయశ్చైవ గంధర్వా: మా తరశ్చాన్య దేవతా : ।
తత్తత్ శక్తి సమోపేత హృదయాంజలి సంయుతా ।
సంభ్రాన్త మనసోపేత సంవీక్ష్య పరిత: స్థితా : ॥
ఏవం కళ్యాణమూర్తి స్స్యాత్ అర్ధనారీశ్వరం తత: ।

శ్రీ కళ్యాణ సుందరమూర్తి లక్షణములు - ఎడమ పాదము సుస్థితముగను, కుడి పాదము కుంచితముగను వుంచవలెను. కుడివైపు నిజహస్తమును గౌరీదేవి కుడిచేతిని పట్టుకొని యుండును.

ఎడమ చేతిలో వరదముద్రయు, పరహస్తముల రెండిటియుండును కుడివైపున పరశువు, ఎడమవైపున లేడిని యుండును.

స్వామికి జటా మకుటము, చంద్రరేఖ, సర్వాభరణములలోనుండును. శ్రీస్వామి ప్రవాళ వర్ణములో నుండును.

శ్రీ గౌరీ అమ్మవారు శ్యామల వర్ణముతో మనోన్మానములు అమరి యుండి వామహస్తమందు ఉత్పలమును, దక్షిణహస్తము శివుని హస్తమును పట్టుకొని, లజ్జ చేత వంచిన శిరస్సు కలదై యుండును. ఈ దేవి ప్రక్కన శ్రీదేవియు, సరస్వతియు సర్వాభరణ భూషితలైయుందురు.

వారు తమ చేతులతో గౌరీదేవి కటి బంధమును తాకుచున్నట్లు నిలచియుందురు. స్వామి వారి ముందు బ్రహ్మదేవుడు హోమము చేయుచున్నట్లు, కూర్చొనియుండును. అతనికి నాలుగు భుజములు నాలుగు మోములు, సర్వాభరణములు కల్గి శివునికి ఆసన్నుడైయుండును.

కుండికయు, అక్షమాలయు, ఎడమ కుడిపై చేతులలోను, స్రుక్ స్రువములను క్రింది చేతలలోను ధరించియుండును. ఈతడు పద్మపీఠముపై ఉత్తరాభిముఖుడై యుండును. తూర్పు వైపున దేవి, దేవతలుందురు. అమ్మవారు అయ్యవార్కి ఎడమ వైపున నుండును.

విష్ణుమూర్తి హోమమునకు ఉత్తరముననుండి, దక్షిణమునకు చూచుచుండును. ఇతనిని శివుని ముక్కు వరకు ఎత్తు వుండునట్లుగా కల్పించవలెను. ఈతని వరదముద్రలోనున్న క్రింది రెండు చేతులతో బంగారు చెంబులో నీరు పోయునట్లుండును. నీరుగల బంగారు చెంబు నిజహస్తములలోను, శంఖ చక్రములు పరహస్తములలోను ఉండును.

అనాది గోత్రజుడైన పరమేశ్వరుడైన శివునకు ఆదిగోత్రజయైన ఉమాదేవిని గౌరిని నేడు నీకిచ్చుచున్నాను అని చెప్పుచూ విష్ణుమూర్తి హస్తోదకము విడచునట్లుండవలెను.

వీరికి ప్రక్కగా అష్ట దిక్పాలకులు, సనకాదులు, లోకేశులు, సిద్ధయక్ష గణములు, ఋషులు, దైత్యులు, గంధర్వులు, అష్టమాతృకలు, ఆ రూపా దేవతల పత్నులు, శక్తులు, చుట్టును కూడి, సంభ్రాంతి పరవశులై పాదములకు హృదయాంజలి ఘటించుచూ నిల్చి యున్నట్లు చేయునగు.

ఇట్టి కళ్యాణ సుందరమూర్తిని భక్తితో నమస్కరించుచున్నాను.

(శ్రీస్వామి ప్రవాళ వర్ణం, గౌరి, విష్ణువు శ్యామల వర్ణం, బ్రహ్మ, వాణి శ్వేత వర్ణం)

## శైవమత సాంప్రదాయాలు :

1. శైవము, 2. పాశుపతము, 3. కాలముఖము, 4. కాపాలికము. వామ మార్గీయ భైరవ సాంప్రదాయాలను గురించి కూడా చెప్పబడినది. దార్శనిక జగత్తులో శైవ - శాక్త దర్శనములు బాగా ప్రసిద్ధిచెందినవి.

### శై సిద్ధాంతానుసారం శివునికి గల ద్వివిధ శక్తులు

1. సమవాయిని 2. పరిగ్రహా రూపశక్తి.

**1. సమవాయిని :** శక్తి చిద్రూప నిర్వికార పరిణామమమని, ఈ శక్తి శివునిలో సమ భావంలో వుంటుంది. అంటే శివశక్తి సంబంధం తదాత్మ్య సంబంధం, ఆ శక్తియే శివునియొక్క స్వరూపశక్తి.

**2. పరిగ్రహాశక్తి :** ఇది అచేతనము, పరిణామిని కూడా, ఈ పరిగ్రహాశక్తి శుద్ధమని, అశుద్ధమని రెండు విధములు. శుద్ధశక్తిని 'మహామాయ', అశుద్ధశక్తిని 'మాయ' అంటారు. 'మహామాయ సాత్విక జగత్తుకు' ఉపాదాన కారణము. 'మాయ ప్రాకృతి జగత్తుకు ఉపాదాన కారణము.

జీవునకు జగద్బంధన కారణము అజ్ఞానమే. సాధనవల్ల అజ్ఞానమును నివృత్తి చేసి కొనవచ్చు. "నేను శివుడను" అనుజ్ఞానమువల్ల ఆ క్షణంలో ఆత్మ స్వరూప శివసాక్షాత్కారము కలుగుతుంది. జీవుడు జీవన్ముక్తుడౌతాడు. ఇదే సంక్షిప్తంగా శైవదర్శనం.

శివునికి మరోపేరు "అశుతోష్" 'అశు' అనగా శీఘ్రముగా 'తోష' యనగా ప్రసన్నుడగునని తెలియగలదు. అనే కానేక శైవకథలు, భక్తిగీతాలు, శివభక్తులు జరిపెడి నృత్యాలు, వాయిద్యాలు అన్ని కూడా శరీరంలో ఒక నూతనోత్తేజాన్ని కల్గించటమేకాక వల్లుగగుర్పొడిచే విధంగా ఉంటాయి. శివుని లీలాగాథలు అనంతమైనవి. ఎందువల్లనంటే

పూర్వభారతీయ నాగరికతా వైభవంలో అనేకానేక ఆటవిక జాతి తెగలు, భిన్న భిన్న ప్రదేశాలలో స్థావరములేర్పరుచుకొని ఆ యా అధిప ముఖులను ప్రకృతి విధానంలో గౌరవించి, ఆతని సాహసకార్యాలను కీర్తించ, స్మరించటం అనేక కథలలో ఆదిమజాతి నాయకులందరిలోను 'శివుని' గనే భావించి కీర్తించి ప్రచారం చేయుటం జరిగి వుండవచ్చు.

## ధ్యానం అంటే ఏమిటి ?

ధ్యానం ఒక సాధన. ఒక పద్ధతి, పవిత్రమైన చైతన్యాన్ని మనలోకి రావలసినదిగా పిలవటమే ధ్యాన లక్షణం, ఆ చైతన్యంతో సంయోగమును పొందటం దాని అలౌకికానుభూతిని పొందటం ముఖ్యం. సంస్కృతంలో ధ్యానం అనే పదానికి రెండు సమానార్థక పదాలు ఆంగ్లంలో Meditation, Contemplation క్రమంగా వీటిని 'చింతన, విచారణ' అనవచ్చు. ఇవి రెండూ ధ్యాన రూపాలే. ఒకే భావ ప్రవాహం మీద మనస్సును కేంద్రీకరించటం 'చింతన'. ఒకే వస్తువు, రూపం, భావం మీద వ్యక్తీకరించిన ఏకాగ్రతవల్ల జనించిన శక్తివల్ల ఆ వస్తువు రూపాన్ని, భావాన్ని సంబంధించిన జ్ఞానాన్ని పొందటం 'విచారణ' గా తోస్తుంది.

ధ్యానంలో దేనిని గూర్చి భావించాలి అనే ప్రశ్నకు మీ ప్రకృతి మీ అత్యున్నత ఆకాంక్షలను బట్టి ఉంటుంది. సంపూర్ణమైన సమాధానం కావాలంటే "బ్రహ్మ" మీద ధ్యానం నిల్పటం సర్వోత్తమం "సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇదియుంతా బ్రహ్మమే అనే భావనమీద ధ్యానించటం మంచిది. ఈ ఏకైక ఆత్మ లేదా సచ్చిదానందానికి చెందిన బహురూపాలని గ్రహిస్తాము. అలాగే సర్వమనస్సులూ జీవాలు, శరీరాలు, విస్తృతిగాచెందిన ఆత్మ అస్థిత్వంలోని ఒక స్థితికి క్రియాశీల రూప కల్పనలని, అన్య భావాలకిట చోటులేదని గ్రహిస్తాము.

ధ్యానం స్థిరపడిన తరువాత ఏ పరిస్థితులలోనైనా దానిని చేయగలగాలి. ధ్యానానికి అవరోధాలుగా నిల్చే వాటన్నింటిని వ్యతిరేకించగల ఇచ్ఛ, ఏకాగ్రత, మనసు చలించటం, మరపు, నిద్ర, ఓర్పు లేకపోవటం అశాంతి ఇవి అన్నీ అవరోధాలు.

అంతర్గత చైతన్యం అంటే చిత్తం, శుద్ధంగా ప్రశాంతంగా వుండాలి. భంగం కల్గించే ప్రతి చర్యలనుంచి అంటే ఆగ్రహం, దుఃఖం, నిరాశ, ఆతృత మొదలైన వాటినుండి స్వేచ్ఛపొందాలి.

**'ఓం కారం'**: 'అ' కార, 'ఉ' కార 'మ' కారాత్మకమైనదే 'ఓం' కారము. ఓం కారమే నిశ్చలమైన పరబ్రహ్మయని అధర్వణ వేదాంతర్గత ప్రశ్నోపనిషత్‌లోని మహత్తర నిరూపణము. ఓం కారమే పరబ్రహ్మము. అనాదియై, అవినాశనమైన బ్రహ్మ సృష్టియొక్క సమస్త కణములయందు వ్యాపించి యున్నది. అతడే ఈ చరాచర సృష్టి

జగత్ పిత, వ్యుత్పత్తి [illegible] అమరుడు, పరమ [illegible] అపరతత్వము, [illegible]

" ఓ మితి - బ్రహ్మ ! [illegible]"

([illegible])

ఓం కారము [illegible] అమరమై, నిర్భయమైన [illegible]. ఓం కారమును ధ్యానించి పరబ్రహ్మ యొక్క [illegible].

ఓం కారనాదము బ్రహ్మ స్వరూపము, ఆకాశ రూపమై, శబ్దరూపముగా విశ్వవ్యాప్తమై బ్రహ్మ పదార్థమునకు మూలాధారముగా నాద బ్రహ్మగా ఆవిష్కరించినది.

"చైతన్యం సర్వభూతానాం వివృతం జగదాత్మనా నాదబ్రహ్మ, తదానంద మద్వితీయము పాస్మహే" ॥

త్రిమూర్తులు ఓం కార ఉపాసకులే. శ్రీ త్యాగరాజస్వామి నాదోపాసకుడై దైవ సాక్షాత్కారమును పొందియున్నాడు. అట్టి మహిమాన్వితమైన ఓం కారమును నిత్యము ఉపాసించి తరించగలరు.

## రుద్రాక్ష మహిత :

పరమశివుని నేత్రములనుండి జలబిందువులుగా భూతలముపైబడి స్థావర రూపముదాల్చి మహా రుద్రాక్ష వృక్షములుగా పుట్టెనని పురాణ ప్రశస్థి, రుద్రుని నేత్రములనుండి జనించుటచే రుద్రాక్షలుగా పేరొందెను. ఉపనిషత్తులయందు, స్కాంద పురాణాదులయందు రుద్రాక్ష మహిమ ప్రతిపాదించబడినది. రుద్రాక్షమాలతో జపముచేయుట నేటికీ సనాతనాచారంగా సాగుచున్నది.

రుద్రాక్ష చెట్లు వృక్ష శాస్త్రమందు "ఎలయో కార్పస్ వర్గానికి చెందినది. ఇది "ఇరాషియో కార్పస్ గ్యానిట్రస్" అనే పేర్లు తెలియగలదు. ఆసియా ఖండం తూర్పు దక్షిణ ప్రాంతం, మలేషియానుండి ఆస్ట్రేలియా పసిఫిక్ దీవులకు విస్తరించిన భూభాగాల్లో ఈ మొక్కలు ఉన్నాయి. మనదేశంలో నేపాల్, బీహార్, బెంగాల్, అస్సాం, మధ్యప్రదేశ్‌లలో విస్తారంగా ఉన్నాయి. ఇది అక్టోబరు మాసంలో పూతకొస్తుంది. ప్రతి సంవత్సరం పూత కొస్తుందనే నమ్మకం లేదు. ఒక్కోసారి కొన్నిసంవత్సరాల వరకు పూత రాక పోవచ్చు.

పూలు తెల్లగా వుండి ఆకులకన్నా చిన్నవిగా వుంటాయి. పండుటాకుల కణుపులనుండి పూలు ఉట్టుకొస్తాయి. పళ్ళు నీలిరంగు, రక్తపు ఎరుపు కలిపిన విధంగా వుంటాయి. ప్రతిరుద్రాక్షకు కొన్నిముఖాలుంటాయి. (భాగాలుగా విలువు గీతలు లేక గాడులు) ఏకముఖి, ద్విముఖి అరుదుగాలభిస్తాయి. చివరగా ముప్పది ఒక్క ముఖాలుగా దొరకుతాయి. పంచముఖముల పంట ఎక్కువ. తంత్ర శాస్త్ర ప్రకారం రుద్రాక్షలు ఎంత చిన్నవైతే అంతశక్తి హీనమైనవిగా పరిగణిస్తారు. వీనిలో ఎరుపు, తెలుపు, నలుపు, పశుపు రంగు లున్నాయని నిపుణుల అభిప్రాయం.

భాగవతం, శివపురాణం స్మృతులు రుద్రాక్షల గొప్పతనాన్ని వర్ణిస్తూ - మాలగా ధరించిన సర్వ పాపహరమని, ఒక్కొక్క రుద్రాక్షకు ఒక్కొక్క అద్భుత గుణములున్నట్లు చెప్పుచున్నవి. మరియు విలువగల ఔషధములుగా పరిగణించబడినవి.

**ఏకముఖ రుద్రాక్ష :** దీనిని 'శివ' స్వరూపముగానే పేర్కొనవచ్చు, ఇది సామాన్యముగా దొరకటం కష్టం. దీనిని నియమముగా "ఓం హ్రీం నమః" అను మంత్ర జపముతో ధరించిన శివతత్వమలవడి వ్యక్తిత్వ వికాసమేర్పడి మానసిక శాంతి సుఖము లభించును.

ఇలా ద్విముఖి, త్రిముఖి, చతుర్ముఖి, పంచముఖి ఆ పై ఏక వింశతి ముఖమువరకు అనేక దేవతల ప్రతిరూపములుగా అర్చించబడుచున్నవి. ఇలా రుద్రాక్షలు ఆస్తిక ప్రపంచమున ప్రముఖ స్థానమాక్రమించినవి.

## పురుష సూక్తము

**"పురుష ఏ వేదం సర్వం యద్భూతం యచ్చభవ్యం"**

**"సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్ర పాత్**
**స భూమిం విశ్వతో వృత్వా అత్య తిష్ఠద్ద శాంగులమ్"**

**(ఋ. 1-1-1)**

సర్వప్రాణులయొక్క సమిష్టియే రూపముగల బ్రహ్మాండ దేవుడు విరాట్పురుషుడునగు, పరమేశ్వరుడు సర్వజీవుల శిరస్సులూ తనవే గనుక అనంత శిరస్సులు కలవాడైయున్నాడు. ఇంకనూ అనంత నేత్రములు, అనంత పాదములు కలవారుగా, సర్వజీవుల ఇంద్రియములలో కలడు కనుక సహస్రాక్షుడు, సహస్రపాదుడు, సహస్ర శిరస్కుడు అగుచున్నాడు. అట్టి పురుషుడు బ్రహ్మాండ మంతటిని వ్యాపించి, ఉండి తానే వెలుగు చున్నాడనియు, ఇచట దశాంగులములు అనగా దశ దిక్కులు అని చెప్పనగు.

పురుష సూక్తము [illegible] 16 శ్లోకములలో 64 పాదములుగా నున్నదని తదుపరి యజు[illegible] 94 పాదములుగా [illegible] తెలియుచున్నది. అన్నింటి యందు [illegible] సర్వశక్తులు, పాంచ [illegible] తానే వ్యాపించియున్నట్లు తెలియగలదు. మనస్సు, బుద్ధి, అహంకారము, [illegible] అని [illegible] చూపుతున్నది. అట్టి [illegible] - సృష్టి క్రియా [illegible] క్రింది విధముగా [illegible] పరచవలసి యున్నది.

పురుషుడు (ప్రకృతి)

మహత్ (బుద్ధి)

అహంకారం

| జ్ఞానేంద్రియాలు | కర్మేంద్రియాలు | మనస్సు |
| --- | --- | --- |
| శ్రోత్ర | వాక్ | శబ్ద - ఆకాశం |
| త్వక్ | పాణి | స్పర్శ - వాయువు |
| చక్షు | పాద | రూప - తేజస్సు |
| జిహ్వ | పాయు | రస - జలము - |
| ఘ్రాణ | ఉపస్థ | గంధ - భూమి |

భూత భవిష్య ద్వర్తమాన రూప జగమంతయూ ఆ పరమపురుషుని మహిమయే. ప్రభావమే, శక్తియే, ఈ మహిమకంటే ఆ పురుషతత్వ మెంతయో గొప్పది. అట్టి విశ్వ కర్మమ ఎరింగిననేగాని అమృతత్వములేదని పురుష సూక్తమనుచున్నది.

అట్టి జగత్సృష్టికర్తయూ, జగత్ కారణుడును అయిన పరమ పురుషుని - విశ్వపతిగా నెరింగినవాడు జరామరణముల నుండి ముక్తుడు కాగలడనుచున్నాడు. అనగా చావు పుట్టుకలలోని విశిష్ఠతలే మాత్రం పట్టని జిజ్ఞాసువుకాగలడని భావము.

## పంచతత్వములు :

"ఆత్మన ఆకాశ స్సంభూత :, ఆకాశా ద్వాయు :
వాయో రగ్ని : అగ్నే రాపః, అద్భ్య : పృథివీ,
పృథివ్యా ఓషదయ : ఓషధీభ్యో ఽ న్నమ్
అన్నా త్పురుష : "
(తైత్తరీయోపనిషత్తు)

జగత్ కారణ వస్తువగు ఆత్మనుండి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అనెడి పంచభూతములు కల్గెనని భావము, అట్లే స్వాత్త్వి కాంశలయొక్క ఫలముగా ఏర్పడినవి. శ్రోత్ర, త్వక్, చక్షు, ర్జిహ్వా, ఘ్రాణములనెడి జ్ఞానేంద్రియములు వాటి యొక్క సమష్టిగా ఏర్పడినదేమనో బుద్ధి చిత్తాహంకారజ్ఞతలతో కూడిన అంతఃకరణము. ఇక పంచభూతముల రజోగుణాంశలచే -వాక్కు, పాణి, పాదము, ఉపస్థ, పాయువులనెడి పంచకర్మేంద్రియములు. వాటి యొక్క సమష్టిసృష్టి ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనెడి పంచప్రాణములు. అట్లే జగత్తులో జరిగే కార్యములు సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహములు పంచకృత్యము. అట్లే మానవులు పొందు దశలు కూడా జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, సమాధి, తురీయాతీతము అనియు. ప్రకృతి - పురుషులుకూడా - సత్తు, చిత్తు, ఆనందము నామము, రూపము అను పంచాంశములతో కూడినవారని గ్రహించగలము. ఇట్లు పురుషుని అనేక పంచతత్త్వములతో సమన్వించబడినవి.

## గాయత్రీ మంత్రార్థము

"గాయంతం త్రాయతే ఇతి గాయత్రీ" అనగా గానముచేయువారిని, జపించు వారిని రక్షించునని వ్యుత్పత్త్యర్థము.

గాయత్రీ మంత్రము ఋగ్వేదములో తృతీయ మండలమున 62వ సూక్తములో పదవ ఋక్కు. విశ్వామిత్రుడు దర్శించినట్టిదే. మరొక మంత్రమునందు "విశ్వామిత్రస్య రక్షతి బ్రహ్మేదమ్ భారతమ్ జనమ్" (ఋ. 3-53-12) విశ్వామిత్రుడద్దాని దర్శించిన ఈ ఇంద్ర స్తోత్రము లేదా వేద భాగము భరత కులమున పుట్టిన జనమును రక్షించుచున్నది. అది సర్వ భారత జనులచేతను జపింపబడి వారి అభ్యుదయములకు హేతువగుచున్నది. ఇది గాయత్రి అనెడి చందస్సులోనే ఉన్నది. దీనికి సాయణుల భాష్యము ననుసరించి -

**"ఓం తత్స వితుర్వరేణ్యం**
**భర్గో దేవస్య ధీమహి**
**ధియో యోనః ప్రచోదయాత్** (ఋ. 3-62-10)

గాయత్రి పదము స్త్రీ లింగములో ఉన్నను గాయత్రి మంత్రార్థము పుంలింగ పరమై ఉన్నది.

**అర్థము :** ఏ సవితృదేవుడు (సూర్యుడని అర్థము) మనయొక్క కర్మలను లేదా ధర్మధర్మాది విషయములైన బుద్ధులను ప్రేరేపించునో ఆ సవితృదేవునియొక్క, అనగా సర్వాంతర్యామిగా ప్రేరకుడైన ఆ జగత్ సృష్టికర్త అందరిచేత ఉపాస్యముగనూ, జ్ఞేయముగనూ భజింపదగిన భర్గమను పేరుగల తేజమును పరబ్రహ్మస్వరూపమును, స్వయం జ్యోతియగు తేజమును ధ్యానించుచున్నాము.

సవిత్రు శబ్దమునకు నిద్రించు వానిని మేల్కొలుపువాడని వ్యుత్పత్తి అర్థము. సాయణులు సవితృ శబ్దమునకు సూర్యుడనియు భర్గ శబ్దమునకు అన్నమనియు కూడా అర్థము చెప్పినారు. అవి వేదములకు బాహ్యార్థములు మాత్రమే. అంతరర్థమును పరికించిన నిద్రనుండి మేల్కొలుపుట అనగా అజ్ఞాన నిద్రనుండి మేల్కొలుపుట అనియే భావము. అట్లు మేల్కొలుపువాడు బాహ్య సూర్యుడుకాక అంతరంగమున ఉన్నవాడును, పరమాత్మయగు అంతర్యామి సూర్యుడే కావలెను.

శ్రీ శంకరులు సౌందర్యలహరిలో లలితాదేవిని "పరబ్రహ్మ మహిషి" అని సంబోధించినారు. అనగా ఆమె పరాశక్తి రూపిణి అనియే భావము. ఆయన దృష్టిలో శివుడు సాక్షాత్పరబ్రహ్మము. శ్రీ కాళిదాసుకూడా

"వాగర్థా విప సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ".

పార్వతీ పరమేశ్వరులను జగత్పితలని స్తుతించినాడు. పార్వతి శివుని అర్ధాంగిగా మాత్రమేకాగా, గాయత్రీదేవి సాక్షా ద్విశ్వకర్మ స్వరూపిణియే అయి పరమాద్వైతమును ప్రకటించినది.

అట్టి గాయత్రీ మంత్రోపాసన ద్వారా నిద్రాణమైన అంతర్ శక్తులను మేల్కొలిపి దృఢ స్వభావులై, సత్యశీలురై ప్రవర్తించవలసినదిగా తెలియబడుచున్నది..

## ద్వాదశ జ్యోతిర్లింగములు

సనాతనుడు, సద్గురు బ్రహ్మ, జగత్ పితనైన శ్రీ మహాదేవుడు తన ప్రభలను జంబూద్వీపమునేకాక, అద్దాని పరి వృతకమైన, నేపాల్, బంగ్లాదేశ, కౌలాలంపూర్, మలేషియా, సింగపూర్, థాయ్‌లాండ్, శ్రీలంక, పాకిస్థాన్ దేశాలలోకూడా "మాఘ బహుళ త్రయోదశి "మహాశివరాత్రి" పర్వదినంగా విశేష ప్రశస్థి నొందియున్నాడు. పూజలందుకొనుచున్నాడు. భారతదేశ పరిసరదేశాలలో శతాబ్దాల క్రితం భారతావనినుండి వలస వెళ్ళి అక్కడ స్థిరపడిన అనేక లక్షలమంది ఈ పర్వదినాన్ని భక్తి శ్రద్ధలతో జరుపుకొనటం మనమెరిగినదే. గత 30 సంవత్సరాలలో భారత దేశంనుండి వేలాదిగా డాక్టర్లు, ఇంజనీర్లు, సైంటిస్టులు, పరిశోధకులు, కళాకారులు ఇతర దేశాలలో స్థిరపడి నేటికి సుమారుగా 50 లక్షలకు పైబడిన భారతీయ సంతతి ఇతర దేశాలలో నివశిస్తున్నట్లు ప్రచార సాధనాల వల్ల తెలియవస్తున్నది.

అమెరికా ఇంగ్లండ్, సింగపూర్, థాయ్‌లాండు దేశాలలో హిందూ దేవాలయములు అనేకం నిర్మాణం జరిగియున్నవి. అచ్చట భారతీయ సాంప్రదాయానుసారం వేదమంత్రోశ్చరణతో పూజలు నిర్వర్తించుచున్నట్లు తెలియుచున్నది.

యావత్ భారతదేశంలో ఆ మహాదేవుని ద్వాదశ జ్యోతిర్లింగములుగా వెలసి విశిష్ట పూజలందు కొనుచూ మహామహితాన్వితమైయున్నవి.

శ్లో॥ 1) సౌరాష్ట్రే సోమనాథం చ 2) శ్రీశైలే మల్లికార్జునమ్ ।
3) ఉజ్జయిన్యాం మహాకాల 4) మోంకారే పరమేశ్వరమ్ ॥
5) కేదారం హిమ వత్పృష్ఠే 6) ఢాకిన్యాం భీమ శంకరమ్ ।
7) వారణాస్యాంచ విశ్వేశం 8) త్ర్యంబకం గౌతమీ తటే ॥
9) వైద్య నాథం చితాభూమౌ 10) నాగేశం దారుకావనే
11) సేతు బంధేచ రామేశం 12) ఘుశ్మేశంచ శివాలయే ॥

ద్వాద శైతాని నామాని ప్రాత రుత్థాయయః పఠేత్ ।
సప్తజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి ॥

జ్యోతిర్లింగము లేకాక, పంచభూత లింగములుగా ప్రసిద్ధి కెక్కిన క్షేత్రములు.

1. పృథ్విలింగము - కంచి -ఏకామ్రేశ్వర లింగము
2. జలలింగము - జంబుకేశ్వర క్షేత్రంలోని జంబుకేశ్వర లింగము
3. తేజోలింగము - తిరువణ్ణామలలోని అరుణాచలేశ్వర లింగము.
4. వాయులింగము - శ్రీకాళహస్తి క్షేత్రములోని శ్రీ కాళహస్తీశ్వర లింగము
5. ఆకాశ లింగము - చిదంబరంలోని నటరాజస్వామి.

(ఇచట లింగము కనుపించదు)

ఇంకా ఆంధ్రదేశమున పంచారామ లింగములుగా ప్రసిద్ధికెక్కిన క్షేత్రములు -

1. ద్రాక్షారామమున భీమేశ్వర లింగము.
2. సామర్లకోటయందు - కుమార భీమేశ్వరలింగము
3. సోమరామమున - సోమలింగము
4. క్షీరారామమున - శ్రీరామలింగము
5. అమరారామమున - శ్రీ అమరేశ్వరలింగములు ప్రసిద్ధములు.

యావత్ భారతదేశమున అనేక ప్రసిద్ధ శైవక్షేత్రాలు తూర్పు. దక్షిణం, పడమర, ఉత్తర దిశలయందు సుమారు 230 కి పైబడియున్నవి.

నేపాల్ దేశమున శ్రీ పశుపతి నాథ లింగము, గండకీ తీరమున శ్రీ ముక్తినాథ లింగము, కాశ్మీరమునందు తినాప్సుగా అమరనాథమున - అమరనాథ లింగము (హిమలింగము) జగత్ప్రసిద్ధములు.

అట్లు సదాశివుడు సామ్రాట్ భావనాపని, పరిసర దేశములందు అనేక వేలస్థానములందు సుప్రతిష్ఠుడైన సిద్ధాంత సుందర భావనలను, ఆధ్యాత్మిక విలువలను, విశ్వ మానవ సౌభ్రాతృత్వమును నెలకొల్పి - మనలను సత్ ధర్మాచరుణులుగా ప్రభావితం చేయుచున్నాడు. ఆత్మనాపమై ఎల్లప్పుడు సముపాస్యయుంపబడు పరమాత్ముడు. ఇంద్రియ, మనః బుద్ధి హిరణ్య గర్భాఖ్యతత్త్వమును మించి ఉత్తరోత్తరమైన పరమునకు కూడా పరమై శ్రేష్ఠమైన సూక్ష్మరూపియైన పరాత్పరుడు. శాంభవమైన తేజస్సుచే లింగాకారమునందుండు వాడు. పరవిద్యచే తత్త్వోపదేశముచే జన్మించిన శివజ్ఞానమును ముముక్షువులను కాపాడువాడు. శుద్ధుడై పాపాదులను మాడ్చి వేయును. గాయత్రి మంత్ర ప్రతిపాద్యుడైన దేవుడు. తన కఠిన శాసనములచే సర్వ చరాచర జగత్తు అంతయును నియమము తప్పకుండా వర్తింపజేయువాడు సన్మార్గమున మనలను నడుపు వాడైయున్నాడు.

## ఈశాన ముఖ ధ్యానమ్ :

**వ్యక్తా వ్యక్త గుణేతరం సువిమలం - షట్త్రింశతత్త్వాత్మకం ।**
**తస్మాదుత్తర తత్త్వమక్షరమితి - ధ్యేయం సదాయోగిభిః ।**
**వందే తామస వర్జితం త్రిణయనం - సూక్ష్మాతి సూక్ష్మాత్పరం ।**
**శాన్తం పఞ్చమ మీశ్వరస్యవదనం - ఖ వ్యాపి తేజోమయమ్ ।**

వ్యక్తము - అవ్యక్తము అను రెండు లక్షణములకంటెను ఇతరమగు లక్షణములు కలదియు (జగదంశములగు) ముప్పది ఆరుతత్త్వముల రూపమున పరిణమించునదియు సకల తత్త్వములకంటెను పైది అగు అనుత్తరము అను అక్షర తత్త్వముగా ఎల్లపుడును యోగులచే ధ్యానించబడ దగినదియు, తమోగుణ రహితమును, మూడు కన్నులు కలదియు సూక్ష్మాతి సూక్ష్మమగు దానికంటెను గొప్పదియు, శాన్తమును అకాశమునందంతటనూ వ్యాపించు తేజమే తన రూపము కలదియు అగు ఈశ్వరుని ముఖమునకు నమస్కారము.

**విశేషము:** తాంత్రికసాంప్రదాయము ననుసరించువారు సృష్టియందు గోచరించు ఆ యా అంశములను ముప్పది ఆరుగా విభజించిరి - అవి

**శుద్ధ తత్త్వములు :**

1. శివః, 2. శక్తిః, 3. సదాశివః, 4. ఈశ్వరః, 5. శుద్ధ విద్యా.

శుద్ధాసుద్ధ తత్త్వములు :

6. మాయా, 7. కలా, 8. విద్యా, 9. రాగః 10. కాలః, 11. నియతిః, 12. పురుషః.

అశుద్ధ తత్త్వములు :

13. ప్రకృతిః, 14. అహంకారః, 15. బుద్ధిః, 16. మనః, 17. శ్రోత్రం, 18. త్వక్, 19. చక్షుః, 20. జిహ్వా, 21. ఘ్రాణమ్ - (జ్ఞానేంద్రియ పంచకము) 22. వాక్, 23. పాణి, 24. పాదౌ, 25. పాయు, 26 ఉపస్థః (కర్మేంద్రియ పంచకము) 27. శబ్దః, 28. స్పర్శః, 29. రూప, 30. రసః, 31. గంధః, (విషయ తన్మాత్రాపంచకము) 32. ఆకాశః, 33. వాయుః, 34. తేజః 35. ఆపః 36. పృథ్వి (భూతపంచకములు).

ఇందు 'శక్తి' యే అంబ. ఈ శక్తితోకూడి ఏకత్వమునందిన 'శివ' తత్త్వము 'సాంబశివ' తత్త్వము. ఈ సాంబ శివుని ప్రీతికై చేయునదియే శ్రీ రుద్రపారాయణముగాని, జపముగాని, హోమముగానీ అభిషేకముగాని అని తెలియవలెను.

మహన్యాస రుద్రాభిషేక మందు - 'మహాన్యాసము' అను న్యాసప్రక్రియలో ఐదున్యాసములు కలవు. అందు సాధకుడు తన ముప్పది యారు తత్త్వములందును రుద్రుని నిల్పి - తన శరీరమును రుద్ర శరీర ధర్మముగా నిల్పి తత్ ధర్మ భావనతో ఆరాధించి లోకహిత కారిగా కాగలడని - అట్టి బలసంపత్తి ప్రాప్తించగలందులకు నిర్వహించునదిగా తెలియుచున్నది.

## శ్రీ శివరాత్రి మహిమ

శివరాత్రి : మాఘమాస కృష్ణ చతుర్దశినాడు విజ్ఞానమయ స్వరూపుడైన సర్వభూత మహేశ్వరుని, శివుని పూజించు ఆచారము యావత్ భారతదేశమందేకాక పరిష్కృత దేశములయందు కూడా అనాదిగా వచ్చుచున్న సాంప్రదాయమే.

ఈపూజ రాత్రి నాల్గు జాములయందు జరుపుదురు. దీని ఉద్దేశ్యము కృష్ణ చతుర్థశీ తిథియందు చంద్రకళలు పదునాలుగు లయమయి ఒక్క కళమాత్రమే మిగిలి యుండును. మనస్సున కధిపతి చంద్రుడు. బాహ్య ప్రకృతియందలి చంద్రకళా లయ వికాసములను బట్టియే అంతర ప్రకృతియందు మనోలయ వికాసములుండును. చంద్రుని వృద్ధి క్షీణతలననుసరించి జీవుల మనోప్రవృత్తులు మారుచుండును. ఇది దేశీయ వైద్య విధానములో అందరెరిగినదే.

శివుడు మంగళ స్వరూపుడు, మంగళప్రదాత, జ్ఞానకారకుడు. శివలింగము, గౌరీపీఠము అనెడి రెండింటి చేరికతో ఘటితమైన మూర్తి శివలింగము. ఇది నిల్చిన త్రికోణాకారముగల పీఠముపైనుండెడిదే గౌరీపీఠము (శక్తి పీఠము) ఈరెండు కలసియున్న మూర్తినే 'ప్రాణాట్ల'మందురు. శివుని తెలుపునదే బిందువు. అదియే 'అట్టమ్' అనెడి లింగము. పార్వతిని శక్తిని తెల్పునదే త్రికోణము. అదే గౌరీపీఠము. ఇది సత్వరజస్తమో గుణమయమైన అవ్యక్త ప్రకృతియని తెలియగలదు. ఇదియే యీ జగత్తునకు సూక్ష్మతమ కారణము. ప్రకృతి పురుషుల ప్రథమ సంయోగము వల్లనే మహత్తత్వము తేటతెల్లమగుచున్నది.

శ్లో॥ మమయో నిర్మహద్బ్రహ్మ । తస్మిన్ గర్భందధా మ్యహమ్
సంభవ సర్వభూతానాం । తతో భవతి భారత ।

(భ.గీ. 14-గుణ. వి-3)

తా॥ ఓయి భారత : గొప్పదియగు నా ప్రకృతి ఉత్పత్తికి గారణము నేనుదానియందు జగద్విస్తార హేతువగు బీజామును ఉంచుచున్నాను. అందువల్ల బ్రహ్మాది సర్వభూతముల యుత్పత్తియగుచున్నది.

శివుని యీలింగమూర్తియందు ఎట్టి స్థూలావయవ, స్థూలభావములు లేవు. చిత్ ప్రతిబింబముతో గూడిన మహత్తత్వము నెటులో తెలుపుటకే లింగమూర్తి నవలంబించి శివపూజా విధానమేర్పడినది. శివలింగము చిదాభాస సమన్వితమైన మహాతత్వము యొక్క స్థూలప్రతీకయే. ఇదే విశ్వము యొక్క ఆద్యవస్థ. ఇదే విశ్వబీజము. శివధ్యాన మంత్రమందు "విశ్వాద్యం విశ్వబీజం నిఖిల భయహరమ్ లింగరూపం నమామి" అని వర్ణింపబడినది. లింగమనగా - చిహ్నము (గుఱుతు). ఏ గుఱుతువలన జగత్కారణ ప్రకృతి పురుష విషయకమైన జ్ఞానము కలుగునో యదే శివలింగము. ఈజగత్ప్రపంచ మనెడి కార్యములనే యవ్యక్త కారణమందు లయమందునో యదే లింగము. "లీయతే గమ్యతే యత్ర జగదిద లింగమ్".

జ్ఞానమైదు విధములుగా ప్రకాశించును. చక్షుకర్ణాదులైన పంచ జ్ఞానేంద్రియముల దారిని జ్ఞానమైదు విధముల వెలయుటకు నిత్యము మనము అనుభవించుచున్నాము. ఇవే విజ్ఞానమయ పురుషుని పంచముఖములు పంచవక్త్రుడు - అనగా విరివిగా దెఱచిన నోరుగలవాడు. వామదేవుడై జగద్వమనము (సృష్టి) చేయునపుడు పంచవక్త్రుడు. మఱి దానిని దనలో నిముడ్చుకొనునపుడును బంచవక్త్రుడే కావలయును. అనగా జగత్సృష్టి విలయములనొనర్చువాడు శివుడే.

త్రినేత్ర శబ్దము త్రికాల దర్శిత్వ సూచకము. త్రికాలముల నొక్కసారిగా విజ్ఞానమయ నేత్రములుగా సుద్భాసింపజేయు వాడనుటయే తెలియదగును. కావున

మహేశ్వరుడు త్రినేత్రుడు. మఱియు గాలసూచకులగు సూర్యచంద్రాగ్నులు శివుని నేత్ర రూపాయవములుగా జెప్పబడుట యాతడు కాలస్వరూపుడును, గాలాతీతుడే యగును.

శుద్ధసత్వ గుణములచేతనే యీ జ్ఞానమయ పురుషుని అనుసంధానము సాధ్యము. సర్వజీవులకు జ్ఞానదాతయైన గురుడు కృపాపరవశుడై యాత్మస్వరూప ప్రకాశము చేయునపుడే జీవుడు యదార్థ సద్గురులాభముచే ధన్యుడగును.

శివుడు జగద్గురుడు. అశుతోషి. ఆతని పూజకై విశేషాడంబరములు లేవు సామాన్యమైన మృత్తికతోనే సులభముగా పార్థివలింగముగా రూపొందించవచ్చు. అనాయాసముగా సంపాదించగల జల, బిల్వ దళములు ఆతని పూజయందు ప్రధానములు. అట్టి యతి సులభసాధ్యమైన పూజాఫలముగా, నతిదుర్భరమైన ముక్తి లభించును.

ఈ శివపూజ వలన ఆధ్యాత్మిక లాభమటుండ, అది భౌతిక జగత్తునందు కూడా విశేషఫలముగలదు. ఇది వసంతఋతు ప్రారంభము జీవజంతులు, తరులతాదులు అత్యధిక రస సమన్వితములై యుండును. బూర్వదినమందుజేసిన సంయమమును మఱునాటి పారణముతో, శివరాత్రి నిర్జలోపవాస పూర్వకముగా రాత్రి జాగరణము, శివపూజయు జరుగును. రాబోవు నదాన కాలవశమున జంతుశరీరమందలి రస ధాతువులు క్షీణింపసాగును. ఈవ్రత ఫలముగా బరమేశ్వర కృపచే రోగములు కలుగుననెడి భయము తొలగును.

ఈ సమయమందు మనస్సు స్వాభావికముగా క్షీణతనొందును. కారణము చంద్రుని కళలు క్షీణతతోనే మనస్సు క్షీణించుటతప్పదు. దీనిచేత విషయలాలస క్షీణించును. కావున పైనజెప్పిన కాలము నిర్గుణోపలబ్ధి విషయమున సహకారి కాగలదు. ఇపుడీ శివరాత్రి పూజా విషయము నిర్గుణ సత్తోపలబ్ధికి సంబంధించినదే. ప్రకృతి నియమానుసారము చతుర్దశి నాటికి పదునాలుగు కళలు క్షీణించి యుండుటచే జాగృతిక విషయలాలస క్షీణించును. ఋతు ధర్మమునుబట్టి యాకాశతత్త్వ విశిష్టతచే నిర్మలమగును. అట్టివేళ మాఘమాస చతుర్దశినాడు అనగా శివరాత్రినాడు ఉపవశించి, పార్థివాది లింగరూప శివుని బూజించి ప్రదోషకాలాదిగా భావలింగార్చనమునకు సాగు సాధకుడు సగము రాత్రియగుసరికి పరమేశ్వరుని నిర్గుణోపలబ్ధి భాగ్యమబ్బి హృదయమునందు తదాత్మ్యము నెలకొనును అదియే లింగోద్భవము. ఆకాలమునే లింగోద్భవకాలమందురు. పరమాత్మతో జీవునకు దదాత్మ సిద్ధియగుట కంటె శివము (మంగళము) మఱియొకటిలేదు. నిది శివరాత్రి మహత్యముగా తెలియగలదు.

## "ఓం నమో భగవతే రుద్రాయ" రుద్ర రూప వర్ణనమ్

భారతీయ సాంప్రదాయంలో సిద్ధమగు ఆచారము మృతులను దహించు స్థానము స్మశానము. లయ కర్తయైన వాడు రుద్రుడు స్మశానవాసి. దహన శేషభస్మమే

ఆతని శరీరపూతగా భావించి విభూతి ధారణ చేయు సంస్కృతిగా నిల్చినది.

శ్లో॥ శుద్దస్ఫటిక సంకాశం - త్రిణేత్రం పంచ వక్త్రకం।
గంగాధరం దశభుజం - సర్వాభరణ భూషితమ్.

" నీలగ్రీవం శశాంకాంక - నాగయజ్ఞోపవీతినమ్।
వ్యాఘ్ర చర్మోత్త రీయంచ - వరేణ్య మభయ ప్రదమ్.

" కమండల్వక్ష సూత్రాద్యై - రన్వితం శూల పాణినం।
జ్వలంతం పింగళ జటం - శిఖాముద్యోత రూపిణమ్.

" వృషస్కంధ సమారూఢ - ముమా దేహార్ధ ధారిణం।
అమృతే నాప్లుతం హృష్టం - దివ్య భోగ సమన్వితమ్.

" దిగ్దేవతా సమాయుక్తం - సురాసుర నమస్కృతం।
నిత్యంచ శాశ్వతం శుభ్రం - ధ్రువ మక్షర మవ్యయమ్.

" సర్వవ్యాపిన మీశానం - రుద్రం వైవిశ్వరూపిణం।
ఏవం ధ్యాత్వా ద్విజః సమ్యక్ - తతో యజవ మారభేత్.

అట్టి రూప విశేషము గల్గిన రుద్రుని విశ్వవ్యాపకునిగా స్తుతిస్తూ

**వందేశంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం,**
**వందే పన్నగ భూషణం మృగధరం వందే పశూనాం పతిమ్.**
**వందే సూర్య శశాంక వహ్నినయనం వందే ముకుందప్రియం**
**వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్॥**

## మహాన్యాసము - అభిషేకము :

రుద్రుడు వేదములయందు బహుదా స్తుతింపబడు దేవత. మహాభారతము శాం.ప. అ. 339 శ్లో - 51

అ - 340 - శ్లో - 37, అ - 341 - శ్లో 18, 19, 20, 21, 22 లలోనూ శ్రీ విష్ణు, మత్స్యపురాణముల యందు రుద్రోత్పత్తి వర్ణించబడింది. జ్యోతిశ్చక్రమున్గందు క్రాంతి వృత్తమున వెలుగొందు 27 నక్షత్రములలో ఆర్ద్రనక్షత్రాధిదేవత రుద్రుడే.

పశ్చిమ గోదావరి జిల్లా, ఏలూరు పట్టణముకు దగ్గరలో "చినవేగి, పెదవేగి" అను గ్రామ ప్రాంతములలో పురాతత్వ శాఖవారు జరిపిన త్రవ్వకాలలో ఒక దేవతామూర్తికి ఆ యా అవయవములతో అంటిన చిన్న చిన్న దేవతామూర్తులు కలవు. దీనిని దశముఖ రుద్రమూర్తిగా గుర్తించిరి. శ్రీ మహాభారతమున ఏకైక రుద్రడు మరల పది

భేదములనందినట్లుచెప్పబడినది. రుద్రుని ఎనిమిది దిక్కులు మరియు ఊర్ధ్వ, అధో దృష్టి కలిగి సర్వతో వ్యాపకుడుగా, విశ్వనేత్రునిగా వర్ణించటమైనది.

రుద్రమంత్రముకూడా "ఓం నమో భగవతే రుద్రాయ'' అని దశాక్షరిగానున్నది. ఇట్లు పది మందిగానైన రుద్రులు వారిలో ప్రతి ఒక్కరు పదేసి భేదములనందినట్లుగా వీరే శతరుద్రులుగా వేద భాగమున శతరుద్రీయము అనుట ప్రసిద్ధి. ఈ రుద్రుడు అభిషేక ప్రియుడై ఉపాసకులకు శాంతిని ప్రసాదించు వాడై ఉన్నాడు. ఇట్టి రుద్రుని అభిషేకించుటకు ముందు ఉపాసకుడు ఆ అభిషేక ప్రక్రియను తాను ఆచరించుటకు వలయు అధికారమును, శక్తిని తాను సంపాదించుకోవలెను. అందులకై ఆచరించవలసిన ప్రక్రియకే "మహాన్యాసమని' సాంప్రదాయమున వ్యవహారము.

ఇట్టి మహాన్యాసమును జరుపుకొనిన సాధకుడు రుద్రుని ధ్యానా వాహనాదులతో పూజించు క్రమమున జరుపు స్నాన విశేషమే రుద్రాభిషేకము. మహాన్యాస మంత్రమును వాని తత్వమును ఉపాసకుడు తనయందు నిలుపుకొని తరువాత రుద్రార్చనకు విధింపబడిన మంత్రములతో అర్చన జరుపుచూ స్నానము జరుపవలసియున్నది.

రుద్రా ధ్యాయాది వైదిక మంత్రములతోరుద్రుని అభిషేకానంతరము జరుగవలసిన పూజాంగములగు ఉపచారములను జరిపి అర్చించు విధానమును "మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము'' అని వ్యవహరించుచున్నారు. ఇందులో మొదటిదియూ ప్రధానమైనది అగు "మహన్యాసము'' అనబడు న్యాస ప్రక్రియలో ఐదు న్యాసములున్నవి.

**ప్రథమ న్యాసము:** 'శిఖ' మొదలగుకొని 'పాదముల' వరకు గల ముప్పదియొక్క అవయవములయందు ఆ యా మంత్రములను నిలుపు కొనుట - కవచమునుగానూ - ఉపకవచమునుగానూ తృతీయ నేత్రముననూ అస్త్రముగనూ ఆయా మంత్రములను న్యసించుట.

**ద్వితీయన్యాసము :** రుద్ర దశాక్షర మంత్రముతో దశాంగ న్యాసముచేసి రుద్రునుద్దేశించి నమస్కారముచేయుట.

**తృతీయ న్యాసము :** పాదము మొదలుగా మూర్ధము (శిరస్సు) వరకును పంచాంగముల యందు న్యాసము జరుపుట. హంసగాయత్రీ మంత్రజపము. దశదిజ్ఞ్న్యాసము (పది దిక్కులయందును ఆయా దిగ్దేవతలనునిలుపుట) దశాంగ రౌద్రీకరణము ( ఆయా మంత్రములతో సాధకుడు తన పది అవయవముల యందును రుద్రుని ఆయా అవయవముల ధర్మమును నిలుపుకొనుటతో తాను తన శరీరమున రుద్ర శరీర ధర్మమును నిలుపుకొనుట) షోడశాంగ రౌద్రీకరణము (ఆయా మంత్రములతో సాధకుడు తన పదునారు అవయవములయందును రుద్రుని ఆ యా అవయవముల ధర్మమును నిలుపుకొనుటతో తన శరీరమున రుద్ర శరీర ధర్మమును నిలుపు కొనుట).

**చతుర్థన్యాసము :** ఆత్మరక్షా (సాధకుడు గుహ్యాది మస్తకాంతన్యాసముచే తన శరీరమునకు సకలోపద్రవములనుండియూ ఆ యా మంత్రములతోరక్షను కల్పించుకొనుట)

**పంచమ న్యాసము :** హృదయము - శిరము -శిఖ - కవచ (స్థాన)ము - నేత్రములు - అస్త్ర (స్థాన)ము - అను ఆరు అవయవముల యందును ఆ యా మంత్రములతో న్యాసము జరుపుట.

ఈ అయిదు న్యాసములు జరుపుటకు ముందు ప్రథమ న్యాసము కంటెను ముందు పంచాంగ రుద్ర ధ్యానమును, రుద్ర పంచముఖధ్యానమునుచేయవలెను.

ఇట్లు అయిదు న్యాసములు జరిపిన పిమ్మట అర్చనము జరుపవలెను. తత్పరిసాధకుడు తన ప్రత్యంగములెల్ల రుద్ర భావముతో నిండి సత్ ప్రవర్తన కల్గిం, సదాచార సంపన్నుడై సత్ భావనలతో ప్రకాశించునని అదియే మహన్యాస రుద్రాభిషేక ఫలమని భావించబడుచున్నది.

## శైవాగమములు :

శైవాగమములు బహు పురాతనమై సంస్కృత భాషయందు క్రీ. పూ. వ్రాయబడినవిగా, ప్రాచీన ఋషులు భగవంతుని దివ్యానుభూతుల నందుకొని మౌళిక వేద వాఙ్మయ సరళిని దృష్టియందుంచుకొని ఈ ఆగమములను రూపొందించిరని భావిస్తారు. ఇవి పరమశివుని పంచముఖములయందు దుద్భవించినవని శృతి. దక్షిణ ప్రాంతీయ ఆధ్యాత్మిక ఆలోచనలు వాటి వివరాణలు ; తపో నియమములు విగ్రహారాధన, సాంకేతిక చిహ్నములు, జ్ఞాన యోగాదులు అన్నియూ శైవాగమములయందు పరంపరాగతమై అంతర్లీనమైనవి. బౌద్ధమునకు ముందుగనే ప్రాచుర్యము చెంది ఆగమములు బౌద్ధమత వ్యాప్తిని సన్నగిల్లజేసి హిందూ ధర్మములు శృతి ద్వారా ప్రాచుర్యమునంది తదుపరి గ్రంథస్థమైనవి. కనుక ఇవి నిత్యములు, అపౌరుషేయములే.

స్వామి ఇవేకానందుడు - ఆగమములు హిందూ ధర్మమునందు యావత్ భారత దేశమున ఆచరణలో నున్నవని చెప్పియుండిరి.

శైవ సిద్ధాంతుల భాషణల ననుసరించి వేదములు సర్వజన సమ్మతము లైనప్పటికి శైవాగమములు ప్రత్యేకతను కలిగి లింగభేదము లేక సర్వమానవ సౌభాగ్యదాయకములుగా మనుచున్నవి. శైవ మహాపండితోత్తములైన శ్రీ కాంత, హరిదత్త, శివాగ్రయోగి, అప్పయ్య దీక్షితులు, శివజ్ఞాన స్వామి మొదలైనవారు శైవాగమ వ్యాప్తికి విశేష కృషి సలిపిన మహామహులు.

ఆగమములోని జ్ఞానపాదము శైవ సిద్ధాంత పరంగా పదార్థము, జీవాత్మ, పరమాత్మ, పశుపతి లేక దైవము అని మూడు తత్వ భాగములుగా విభజించిరి. ఈ విశ్వసృష్టికి మూలభూతము దైవమని, శక్తి విడదీయరాని రూపమున పరమాత్మమయందు లీనమై విశ్వ నిర్మాణమునకు కారణ భూతమైనట్లు చెప్పబడినది. జీవాత్మ పరమేశ్వరుని సాక్షాత్కారము పొదవలెనన్న పరిశుద్ధ ప్రవర్తన, నిషిద్ధ కర్మలు చేయకుండుట, త్యాగ నిరతితోకూడిన పరిపూర్ణ శరణాగతిని సాధించుటకు సహాయపడుచున్నవి.

ఆగమములలో క్రియాపాదములు రెండవభాగము. ఇందనేక విధములైన దీక్షలను విశదపరచి ఈశ్వరా రాధనకు వివిధ మార్గములను బోధించుచున్నది. శివాలయ నిర్మాణము, శిల్ప నిర్మాణము, పూజా విధానము, ఆలయ నిర్మాణమునకు స్థల నిర్ణయము మొదలు ఆరాధనా నియమముల వరకు అనేక ప్రక్రియలను నియమములను నిర్దేసించుచున్నది.

ఆగమములలో యోగభాగము మూడవది. యోగసాధనకు అష్టాంగ మార్గమైన యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన మరియు సమాధి అనుయోగ భాగము. పరమాత్మయందు బుద్ధి నిలిపి జీవాత్మ, పరమాత్మలోలీనమగుటను యోగమందురు.

నాల్గవభాగము చర్యపాదము, ప్రవర్తన, పూజా సామాగ్రి సేకరణ, పూజా విధానము, విగ్రహావిష్కరణ, సంస్కారము, నివేదనము ఆదిగాగల విషయము లిందు గలవు. వేలకొలది దేవాలయములు ఆగమ శాస్త్ర అధ్యాయము వలన సజీవములై తత్ శాస్త్ర వైశిష్ట్యమునకు సాక్షీభూతములుగా నిలచియున్నవి.

ఆగమ సూత్ర నిబంధనలననుసరించి నిర్మాణము, పూజా విధానము నడుపబడుచున్నవి. ఇందు ఆత్మార్థము అనగా వ్యక్తిగత శ్రేయము మరియు పదార్థము అనగా సమాజ శ్రేయము అందుచే దేవాలయములు ఆస్తిక సమాజమునకు ఎంతో అవసరమై దిన దిన ప్రవర్ధమాన మగుచున్నవి. శిల్ప కళను దేవాలయములందు ఉపయోగించి వాటిని భక్తికి ముక్తికి నిలయములుగా రూపుదిద్దుకొనునట్లుగా చేసి ఆగమములు తమ ప్రామాణికతను నిరూపించుకొన్నవి. దేవాలయ నిర్మాణ పద్ధతి, స్థానిక కట్టుబాట్లు, స్థల చరిత్ర, పురాణ ప్రసిద్ధ దృష్టియందుంచుకొని విగ్రహములు వాటి ప్రమాణములు, కట్టడములు, ప్రాకరములు, నియమబద్ధమైన ప్రతిష్ఠ, పూజా విధానము, పక్ష, మాస, సంవత్సరములయందు జరుపవలసిన పూజా విధానము, వ్యక్తిగత, సామాజిక అభ్యున్నతి కోరి జరిపే పూజలు, పూజారుల నియమనిబంధనలు ఇవి అన్నియూ ఆగమముల వలన క్రమబద్ధతను పాటించి క్రియ, చర్య పాదముల

యందలి నిబంధనలు, సూత్రముల ఉపకరించి భక్త జన సామాన్యమునకు ఆచరణయోగ్యమై ప్రసిద్ధములైనవి.

నేటి నాట్యభంగిమలు, భరతనాట్యము శాస్త్రీయ నృత్య విధానము నందలి మౌళిక సూత్రముల ప్రామాణికత ఆగమ సిద్ధాంత జన్యమే అని చెప్పబడుచున్నది.

శైవాగమ సూత్రములు నాగరలిపిలో నున్నందువల్లన ప్రాశ్చాత్య పండితులను విశేషముగా ఆకర్షించలేకపోయినవి. మనదేశమందు కూడా అపార ఆగమ సంపదను అధ్యయనము చేయుట విస్తృతముగా కృషి జరుగలేదు. ఎన్నో తాళపత్ర గ్రంథములు కాలగర్భమున కలసిపోయినవి. సర్వజననీయమైన శైవాంగను సిద్ధాంతములు ఇంకనూ పరిశోధించి వాని ఆధ్యాత్మిక ప్రాధాన్యతకు గుర్తింపు లభించులాగున చూడ వలసిన బాధ్యత మన యందరిపై కలదని మనవి.

## ముగింపు :

"మానవ సమైకతా దర్శనమ్"

"దైవ స్పర్శ ఉంటే సర్వమూ జరుగగలదు" **ఆ మహా స్పర్శవల్ల** ప్రేమ గొప్పదిగా పెరిగి దాని **దివ్య** ప్రాముఖ్యతను తెల్పగలదు.

మానవ జాతి ఆవిర్భావంలో ఉన్న విశేషమేమంటే **తన్ను** గురించి తాను తెలుసుకొనే శక్తి మానవునకు కలిగింది. అందువల్ల **అంతర్లీనంగా** వున్న దైవం పరిణామం చెందే ప్రక్రియకు అతడు సహకరించవలసి యున్నది. "సిద్ధాంతం" విశ్వప్రేమగా రాబోయే దశకు తాను సత్యశీలత కల్గిన ఆధ్యాత్మికతను పాదుకొల్ప వలసియున్నది. అది ప్రేమ - త్యాగ నిరతుల నీయవలసినదిగా నేడే తాను భావించి ఆ దివ్య చైతన్య **దిశగా పరి**శ్రమించవలసియున్నది. వ్యక్తిగత అహంకారం ఒకటే పోతేచాలదు. సామూహిక సామాజిక అహం సమాజ ఆధిపత్యం కూడా పూర్తిగా మార్పు పొందాలి. శ్రీ అరవిందులవారు" ఒక మహాతత్త్వవేత్తమాత్రమే కాదు ఒక మహాసంఘ తత్త్వ వేత్తకూడా సామూహిక మానవుడు."

మానవ సమాజం ఐదు విస్పష్ట దశలగుండా పురోగమిస్తుంది. 1. సారూప్యదశ, 2. నమూనాదశ, 3. ఆచార సాంప్రదాయ దశ, 4. వ్యక్తిత్వ దశ, 5. అంతరంగ దశ. వ్యక్తికి వున్నట్లే ప్రపంచానికి కూడా ఒక ప్రకృతి ఒక అంతరాత్మ, ఒక ధర్మం దర్శనంగా ఉంటాయి. అంతే కాదు దేశాలకు సమూహాలకు కూడా అంతరాత్మలుంటాయి. ఏకాంత జీవనంలో పరిణామం సాధ్యం కాలేదు. వ్యక్తి ఆధ్యాత్మిక వికాసంతో పాటు సమాజ ఆధ్యాత్మిక వికాసంకూడా ప్రక్కప్రక్కనే జరగాలి. దైవం కేవలం వ్యక్తికి అతీత

స్థితికి సంబంధించిలేదు. ఆయన విశ్వమయుడు. దివ్య చైతన్యం కొద్ది మంది పరిణిత వ్యక్తులకు మోక్షాన్నివ్వటానికి రాలేదు. అందరూ భగవంతుని సంతానమే. అందరిపైన ఆయన ప్రేమ, అనుగ్రహం సదా వుంటుంది. వ్యక్తి వికాసము విశ్వ వికాసము జంటగా పరిణితి చెందుతాయి.

భారత దేశంలో వేదయుగానికి ముందునుంచే సనాతన సిద్ధాంతం ఒక ప్రతీకాత్మక దశ అందులో ఆధ్యాత్మిక తత్త్వమే ప్రధానం. మతాచారాలు, బహురూపాలుగా దానికి అంగాలు. ఆధ్యాత్మిక మత తత్త్వంగా వున్నది. మనస్తత్వ నైతిక దశలుగా పరిణమిస్తుంది. అంతర్గత కలహాలతో ఎన్నో మారణహోమాల తదుపరి తిరిగి మానవజాతి జాగృతమై సనాతన భారత సిద్ధాంతం వైపుగా పరుగుతీసింది. శాంతి - ప్రేమ తప్ప అన్యమేదీ మానవునికి తృప్తి నీయదని గ్రహించింది. అప్పటి నుంచి అంతరంగ వీక్షణం ప్రారంభం అయింది. ఆత్మ దర్శనం కోసం ఆత్మ సత్యంలో జీవించటం కోసం ప్రయత్నం ప్రారంభించింది. అంతర్గత బాహ్య జీవితాలలో ఆత్మ సత్యానుభవం కోసం అన్వేషణ సాగించింది. అదే ప్రేమ అని గ్రహించింది. దివ్య పరిపూర్ణత మనకు ఎగువున ఎప్పుడూ వున్నది. కానీ ఆధ్యాత్మికత అంటే చైతన్యలో దివ్యత్వాన్ని పొందటం. అంతరంగంలోబాహ్యలోకూడా ఆ దివ్య జ్ఞాన జీవనాన్ని జీవించటం, చరించటం, జీవితం ఆత్మ ప్రకాశం మీదే నిలబడాలి. భారతావనిలో అని సాధించిన ఆదర్శ పురుషునినే 'ఋషి' అని పిలవ బడతాడు. అతడు వైజ్ఞానికాతీత దివ్య చైతన్య ఆధ్యాత్మిక సత్యాన్ని దర్శించినవాడు. అతడే ప్రపంచ మానవజాతికి మార్గదర్శకుడు కాగలడు. వేదాంతంలేని హిందూ మతం మృత ప్రాయం. వేదాంతం మానవజాతి సామాన్య సంపద, 'మానవజాతికి ఆధ్యాత్మిక మతం ఒక్కటే తరుణోపాయం' ఆధ్యాత్మిక ఏకత్వం మనస్తత్వ ఏకత్వానికి దారితీస్తుంది. స్వేచ్ఛగా అంతర్గత వైవిధ్యాన్ని అంతే స్వేచ్ఛగా బాహ్య ప్రకటనను ఆచరించటం ఆధ్యాత్మిక ఏకత్వంలో ప్రధాన సూత్రం. ఏకత్వం అంటే ఏకరూపకతకాదు. ఎకత్వం అంటే భిన్నత్వత ఏకత్వం, స్వతంత్ర వ్యక్తుల, శక్తుల సామరస్య స్థితి, ఆధ్యాత్మిక తత్త్వం రానిదే పూర్తి స్వేచ్ఛరాదు. అది సతతా సర్వదా అనుసరించి ఆ దైవ కృపకు ప్రేమకు పాత్రులు కాగలరని కోరుకొనుచున్నాము.

## అంతర్ దర్శనము (పరివేదన)

**1. అయయో ! యెందఱి మానవోత్తముల కంఠాంకూరము**
**ల్ ద్రుంచెని**
**ర్దయమౌ కాలము ; యౌవనంబు, తను సౌంధర్యంబు**
**లావణ్య, మ**
**వ్యయమై నిల్చునే? యెన్ని యెన్ని కనుగాయల్ రాలె**
**నీ నేల, నా**

రయ లేదోవిరఁబూయకే యురలి వ్యర్థంబైన
లే మొగ్గల

2. నీవూనేనను తారతమ్య మిహమందేగాని భూగర్భ ర
త్నావాసంబునలేదు, దుర్జనుడు, పుణ్యాత్ముడు, భిక్షార్థియున్
శ్రీవాల్లభ్య ధురంధరుడు నొకటే శ్రేణిన్ సుఖాసీనులై
యావిందున్ భుజియింతు, రంతఁగనలే మా మృత్తికన్ భేదముల్.

3. గతము గతంబె, యెన్నటికిఁ గన్నులఁ గట్టదు, సంశయాంధ సం
వృతము భవిష్యదర్థము, వివేకముతో, యొక వర్తమానమే
సతత మవశ్య భోగ్యమగు సంపద; రమ్ము విషాదపాత్రకీ
మతమున ! దావులేదు, క్షణమాత్ర వహింపుము శివశోత్రికన్ ।

4. అంబరం బొక చిత్ర దీపంబు; రవియు
దీపపున్ శెమ్మె, లోకంబు తెరపటంబు;
నీడ బొమ్మలు మనుజులు; నిఖిలమునకుఁ
గాలచక్రంబు నిర్ణేత; గతియనాది.

5. ఆది మధ్యాంత రహితమై యలరుచుండు
కాలయవనిక భేదింపఁగలమె మనము?
ఇటకు నెందుండి వచ్చె నింకెటకుఁ బోవుఁ
బ్రాణియను ప్రశ్న కెవ్వాడు బదులు సెప్పు?

6. సతముఁ దత్త్వ విచారంబు సలిపి సలిపి
మూలసూత్రంబు నెవరైన ముట్టినారె ?
నేఁడు విన్నట్లు; రేపును నేఁటి యట్లు;
అందని ఫలంబుచేచాఁప నందు టెట్లు?

7. అఖిల శాస్త్ర పురాణ తత్త్వబ్ధులీఁది
పరమ విజ్ఞాన దీపమౌ పండితుండు
కాళరాత్రిని మార్గంబు గానలేక
యల మామూలు కథఁజెప్పి యంతరించు !

8. జీవితం బెల్ల బహుశాస్త్ర సేవలందుఁ
గడిపితి, రహస్యములు కొన్ని గ్రాహ్యమయ్యె,
నిప్పుడు వివేక నేత్రంబు విప్పిచూడఁ
దెలిసికొంటి నాకేమియుఁదెలియదంచు.

9. ఏమి ప్రయోజనంబుగన నిష్టములేనిదే
నన్నుఁ దెచ్చె; నిం
కేమి యశంబు గౌరవము హెచ్చును న ౯
నమయింప; దైవలీ
లా మహిమోన్నతి ౯ మదిఁ దలంపనసాధ్యము;
రాకపోకలే
లా ? మన జీవితంబునకు లాభము
కేవల జీవతం బెకా !

10. తెలియరో, మున్ను నస్తితి జలంబున 'నే'
నను విత్తునాటి, య
వ్వల ( బరి వేదనాగ్ని శిఖఁబ్రాణము
వోసెను· గాలి పొల్కని
య్యల సకలంబుఁ గ్రుమ్మరుదు; నెచ్చటి
మృత్తిక తోడఁ జేసెఁ గ్రం
తలకిరవైన యీ తనువుఁ ? దాఁ కిన (
దప్పిన మన్ను దుమ్మగు ౯

11. కాలము రోష సంకువికారముఁ జూపకపూర్వమే నువ్వా
త్పాళులఁ గూడిమాడి జరుపందగు వెన్నెల ఈశగోష్ఠి, చం
డాలయముండు ద్వారముకడ ౯ నిలుచుండిన యప్డు తెప్పపా
టాలముసేయువే ? గుటికెఁడైన జలంబును ద్రావనిచ్చునే?

12. కనుగొను శబ్దరూపరస గంధముల ౯
సుఖమైన స్పర్శ మో
హనమగు నీ ప్రపంచము ననంతముగా
సృజియించి ధాత చే
సెనే శిలతోడ మానవుని చిత్తము ?
సద్భు దయంబు లేవిచో
జనులఁ బరస్పర ప్రణయ సౌఖ్యము
మందున కైనఁ జిక్కునే ?

[illegible] చిపటిన
దేవళము [illegible]

ఫలము లభించు? ప్రేమరస భావయు
తుండవయేని మానిసి
వలవుము, ప్రాణహీనమగు బండలు
వేయిటి కన్న శ్రేష్ఠమై
యలరుఁగదా మనుష్య హృదయంబు
ప్రతి ప్రణయానురక్తులకు॥

14. మునునేనస్థితి నిద్రనుండ నిలకుం బోఁ దోలి
దుఃఖంబులం,
దనుసౌఖ్యంబుల నందఁజేసి మరలం
దర్శింతు వౌరౌర ! పా
పిని శిక్షింతు నటంచు; నీ చతురతన్
వేనోళ్ళఁగీర్తింతు రీ
వినయార్తుల్; మఱి శిక్ష కర్తుఁడవు
నీవే కావె లోకేశ్వరా ?

15. కరుణావార్ధివి నీవు, నేనిఁకను దుష్కర్మంబు
వర్జించి ని
ర్భర వైరాగ్యముఁ బూన నీవు కృపఁజూపం
బాత్రు లెవ్వారు? నీ
బిరుదున్ నిల్పుటకే వొనర్చితిని నిర్భీతిన్
సమస్తాఘముల్.
సరకం బంటకయున్న వీలగునె
పశ్చాత్తాపముం బొందఁగన్ ॥

16. ఇల చదరంగ; మందు జనులెల్లరు పావు;
లహస్యులు విశల్
దెలుపుమ నల్పుగళ్ళు; కదలించును రాజును
బంటుఁ దక్కు పా
వుల విధియాటకాఁడు, పలుపోకలఁ ద్రిప్పును
గళ్ళు మార్చు, న
వ్వల నొక టొక్కటిం జదిపివైచు
నగాధ సమాధి పేటికన్ ॥

(కవికోకిల శ్రీ దువ్వూరి రామిరెడ్డి "పానశాల')

## వేమన దృష్టిలో :

1. శివుని యనుభవంబు సృష్టిలోపలలేక
సంశయంబు చెడదు సాధకులకు
చెలగు దివ్వెలేక చీకటి వాయువా? ॥ విశ్వ ॥

2. బ్రహ్మమును యెరుగదు భవ మిందుండ నా
తనువు గుడిగజేసి తన్ను నిలిపి
లోక బుద్ధి విడిచి లో జూపు జూడరా

3. అంతరంగమందు నభవు నుద్దేశించి
నిల్చిచూడ జూడ నిలుచుగాక
బాహ్యమందు శివుని భావింప నిల్చునా ?

4. ఆరుగురిని జంపి హరుమీది ధ్యానంబు
నిలిపి నిశ్చలముగ నెగడి యాత్మ
నతని యెకని సేయు వాతడే యోగిరా

5. బ్రహ్మ మనగ వేరె పరదేశమున లేదు
బ్రహ్మ మనగ తానె బట్టబయలు
తన్ను దా నెరిగిన తానె పో బ్రహ్మంబు

6. తమ తలంపులలోన తత్వశిఖామణి
దలచినవారెల్ల తత్వవిదులు
ఘనమైన నిభిడాంధ కారంబులో జ్యోతి
నమవుతో జూచిన యాతడే యోగి
శివునిలో జీవుని జీవునిలో శివు
నొనర డెల్పిన వాడు యోగ దృక్కు
సాంఖ్య యోగంబున సర్వంబు శివుడని
నిశ్చయించినవాడు నిర్మలుండు

యిట్టి జాడగాక యందరైనను నేమి
గట్టుగాగ శివుని బట్టగలర
పొట్ట జీవుబాసి పోయి తా నుబ్బునా ? ॥విశ్వ॥

8. శివునిమీద మనసు స్థిరముగ నుంచిన
నౌను మోక్ష మరయు నౌన దౌను
శివునిమీద మనసు చీమంత తప్పిన
కాదు కాదు ముక్తి కాదు వేమ

## శ్రీ శివ పంచాక్షరి స్తోత్రం

1. నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ,
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మైనకారాయ నమ శ్శివాయ.

మందాకినీ సలిలచందన చర్చితాయ
నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ
మందార పుష్ప బహు పుష్ప సుపూజితాయ
తస్మై మకారాయ నమ శ్శివాయ.

శివాయ గౌరీవదనాంబుజాత
సూర్యాయ దక్షాధ్వర నాశకాయ,
శ్రీ నీలకంఠాయ వృషధ్వజాయ
తస్మై శికారాయ నమశ్శివాయ.

వశిష్ఠ కుంబోద్భవ గౌతమాది
మునీంద్ర దేవార్చిత శేఖరాయ
చంద్రార్క వైశ్వానర లోచనాయ
తస్మై వకారాయ నమ శ్శివాయ.

యక్ష స్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ,
దివ్యాయ దేవాయ దిగంబరాయ
తస్మై యకారాయ నమ శ్శివాయ

2. సాలోక్యం తవపూజనే, శివమహాదేవేతి సంకీర్తనే।
సామీప్యం శివభక్తి ధుర్యజనతా సాంగత్య సంభాషనే ।
సారూప్యం చచరాచరాత్మక తనుధ్యానే భవానీ పతేః ।
సాయుజ్యం మమ చిత్రమత్ర భవతి స్వామిన్ కృతార్థో స్యహమ్ ।

3. రమణీయతర మంత్ర రాజంబు లందెల్ల
వధికమై యెప్ప పంచాక్షరంబు.
ఆగామి సంచిత ప్రారబ్ధ పాతక
హరణ కారణము పంచాక్షరంబు

గణుతింప ధర్మార్థకామ మోక్షముల లి
దక్షతనిచ్చు బంచాక్షరంబు.
కౌశి కాగస్త్యాది ఘనమునీంద్రులు దెల్పు
లక్షణంబరయ పంచాక్షరంబు.

జపపరాయణులకు సాధుజనుల కెల్ల
నక్షయ ఫలప్రదంబు పంచాక్షరంబు
పూర్వజన్మ కృతానేక పుణ్య సాధ్య
మాగ మోక్తంబు శైవ పంచాక్షరంబు

మంత్రపుష్పం (తాత్పర్యము)

ధాతా పురస్తాద్య ముదాజహార । శక్రః
ప్రవిద్వాన్ । ప్రదిశశ్చతస్రః । తమేవం విద్వా
నమృత ఇహ భవతి । నాన్యః పంథా అయనాయ విద్యతే ॥

తా॥ ఈ మంత్రపుష్పమున విరాట్పురుషుడు వర్ణింపబడెను. ప్రార్థించువారికి సకల శుభములు ప్రసాదించునని ప్రజాపతి [illegible] సకల దిశలయందుగల సకల ప్రాణుల సంరక్షకునిగా ఇంద్రుడా పరమాత్మను తెలిపికొనెను. ఏ విద్వాంసుడు ఆ పరమ పురుషుని తనకంటే నభిన్నునిగ బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచే నెఱుంగునో అతడు అమృతత్త్వమును పొందును.

నమస్తే అస్తు భగవన్వి శ్వేశ్వరాయ మహాదేవాయ
త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్ని కాలాయా కాలాగ్ని
రుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ
సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః ॥

తా॥ ఓ భగవంతుడా ! నీవు విశ్వమునకు ప్రభువువు. మహాదేవుడవు, త్రిలోచనుడవు. త్రిపుర ధ్వంసివి, త్రేతాగ్ని రూపుడవు, ప్రళయకాలాగ్నివి, ప్రళయకాల రుద్రుడవు, నీలకంఠుడవు, మృత్యువును జయించినవాడవు, సర్వమున కధిపతివి, సర్వ కాలములందును, సర్వశుభంకరుడవు. ఐశ్వర్యవంతుడవగు ఓ మహాదేవా! నీకు నమస్కారము.

1. సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశ మ్భువమ్ ।
విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదమ్ ॥

తా॥ అనంత శిరములు, అనంత నేత్రములు కలవాడును, విశ్వమునకు సుఖమును కల్గించువాడును, సర్వప్రాణులకు ఆధారభూతుడును, నిత్యుడును, విశ్వ శ్రేయమును కూర్చువాడును, మంగళకరుడును, మోక్ష ప్రదాతయునగు నారాయణునకు నా నమస్కారము.

2. **విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్ ।**
**విశ్వమే వేదం పురుషస్త ద్విశ్వముప జీవతి ॥**

3. **పతిం విశ్వ స్యా త్మే శ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్ ।**
**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥**

4. **నారాయణ పరోజ్యోతి రాత్మ నారాయణః పరః**
**నారాయణ పరం బ్రహ్మతత్వం నారాయణః పరః ॥**

తా॥ విశ్వరూపుడును, విశ్వాతీతుడును, పరమాత్మయు, శాశ్వతుడును మంగళకరుడునగు నారాయణుడు విశ్వాధారుడు శాశ్వతుడునూ, వేదాదులచే ప్రశంసింపబడినవాడును, మునులచే ప్రస్తుతింప బడినవాడునగు నారాయణడు గురు శుశ్రూషాదులచే తెలిసికొనదగినవాడు. అట్టి సర్వాంతర్యామి రూపుడగు నారాయణునకు నమస్కారము.

నారాయణుడే పరంజ్యోతి, అతడే పరమాత్మ, నారాయణుడే పరబ్రహ్మ సత్య స్వరూపుడు సర్వోత్తముడును నారాయణుడే పరబ్రహ్మ సత్యస్వరూపుడు సర్వోత్తముడును నారాయణుడే అట్టి నారాయణునకు నమస్కారము.

5. **నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః ।**
**యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయ తే సివా ॥**

తా॥ ధ్యానము ధ్యానించు వాడును నారాయణుడే, అనేక కోటి బ్రహ్మాండములు కలవని వినబడునవియు, మనకు కనుపించు లోకము కూడా నారాయణుడే.

6. **అంత ర్బ హిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణ స్థిసతః ।**
**అనన్త మవ్యయం కవిగ్ం సముద్రేం న్తం విశ్వశమ్భువమ్ ॥**

తా॥ నారాయణుడే బాహ్యాభ్యంతరములందంతట నిండియున్నాడు. అతడు నాశరహితుడు, అచ్యుతుడు అతని ధ్యానము సాగరరూపమగు సంసారమునందు వైరాగ్యమును కల్గించును. అతడు విశ్వమునకు సుఖమును కల్గించువాడు.

7. **పద్మకోశ ప్రతీకాశ గ్ం హృదయం చాప్య ధో ముఖమ్ ।**
**అథో నిష్ట్యా వితస్త్యా న్తే నాభ్యా ముపరితిష్ఠతి ॥**

తా॥ నాభికిపై భాగమునను, కంఠమునకు దిగువగనూ, ద్వాదశాంగుళ పరిమాణముగల భాగమున అధో ముఖముగల కమలమువంటి హృదయము కలదు.

8. జ్వాల మాలాకులం భాతి విశ్వస్యాయతనం మహత్ ।
సన్తతగ్ం శిలాభిస్తు లమ్బత్యాకోశ సంనిభమ్ ॥

తా॥ జ్వాలా మాలికలచే ప్రకాశించుచూ, నానా విధములగు నాడీ సముదాయములు వ్రేలాడుచుండు హృదయ కమలము నారాయణునకు స్థానము.

9. తస్యాన్తే సుషిగ్ం సూక్ష్మం తస్మిన్త్స ర్వం ప్రతిష్ఠితమ్ ।
తస్యయధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః ॥

తా॥ ఆ హృదయ కమలమున కగ్ర భాగమునందు కొద్దిగ వికశించిన కమలమువంటి కమలము కలదు. అది జీవస్థానము. అందు సర్వము ప్రతిష్ఠింపబడినది. ఆ కమలము మధ్య భాగమునందు అంతట ప్రజ్వలించు వైశ్వానరుడను జఠరాగ్ని కలదు.

10. సో ఽ గ్ర భు గ్విభజ న్తిష్ఠన్నా హార మజరః కవిః ।
తిర్య గూర్ధ్వ మధ శ్శా యీ రశ్మ య స్తస్య సన్తతా ॥

తా॥ ఆ వైశ్వానరుడు భుజించిన ఆహారము ఆయా భాగములలో విభజింపబడి క్రిందుగను, మీదుగను అర్థమగుచున్నది. అందలి కిరణములు ఆపాదమస్తకము వ్యాపించి ప్రకాశించుచున్నవి.

11. సన్తాపయతి స్వందేహమాపాదతల మస్తగ : ।
తస్యమధ్యే వహ్ని శిఖా అణీ యోర్ధ్వా వ్య వ స్థిత : ॥

తా॥ వైశ్వానరోపాసకు లట్టి దేహకాంతిని సాధింపగలరు, జఠరాగ్ని మధ్య సూక్ష్మమగు జ్వాలపై కెగురుచున్నది.

12. నీలతోయద మధ్యస్తా ద్వి ద్యుల్లే ఖేవ భాస్వరా ।
నీ వార శూక వ త్త న్వీ పీతా భాస్వ త్య ణూపమా ॥

తా॥ ఆ సూక్ష్మ జ్వాల నీలమేఖముల మధ్యనుండి మెఱుపు తీగవలె నున్నది. నీవార ధాన్యపు ముల్లు వలె సూక్ష్మమై పచ్చని కాంతితో ఆ జ్వాల అణురూపమున నున్నది.

13. తస్యాశ్శి ఖాయా మధ్యే పరమాత్మా వ్యవ స్థిత : ।
సబ్రహ్మ సశివ స్స హరి స్సే న్ద్ర స్సో ఽ క్షర : పరమస్స్వరాట్ ॥

**తా॥** ఆ జ్వాలకు మధ్య భాగమున పరమాత్మకలడు. అతడే బ్రహ్మ, అతడే రుద్రుడు, అతడే విష్ణువు, ఇంద్రుడును అతడే. అతడు వినాశములేనివాడు. శాశ్వతుడు, స్వయం ప్రకాశుడు, సర్వాధారుడు

**14. రాజాధి రాజాయ ప్రసహ్య సాహిణే**
**నమోవయం వైశ్రవణాయ కుర్మ హే ।**
**సమే కామాన్కామ కామాయ మహ్యం ।**
**కామేశ్వరో వై శ్రవణో దదాతు ।**
**కుభేరాయ వైశ్రవణాయ మహారాజాయ నమ : ॥**

**తా॥** ఆభగవంతుడు రాజాధిరాజు. అతడే కామేశ్వరుడు. ఆ భగవంతుడు భక్తులకు సకలాభిష్టముల నొసంగుచున్నాడు. భక్తుల బహు విధ స్తోత్రముల వినుట యందాసక్తి కలవాడును అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుండును, అను శ్రీ మన్నారాయణునకు సాష్టాంగ ప్రణామములు.

**15. ఓం తద్బ్రహ్మ । ఓం త ద్వాయుః । ఓం తదాత్మా ।**
**ఓం తత్సత్యమ్ । ఓం తత్సర్వ మ్ । ఓం తత్పురోన్నమ : ॥**

**తా॥** ఓం కారమే బ్రహ్మ స్వరూపము, ఓం కారమే వాయు స్వరూపము ఆత్మ రూపము కూడా ఓం కారమే. ఆ ప్రణవమే సత్య స్వరూపము సమస్తమునకుకారణ స్వరూపము, తచ్ఛబ్ద వాచ్యుడగు పరమాత్మయు ఓం కారమే. అట్టి ఓం కారమునకు నమస్కారము.

**16. అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తి షు ।**
**త్వం యజ్ఞ స్త్వం వష ట్కారస్త్వ మిన్ద్ర స్త్వగ్ ం రుద్ర స్త్వం**
**విష్ణు స్త్వం బ్రహ్మత్వం ప్రజాపతి : ।**
**త్వం త దాప ఆపో జ్యోతీర సో ఽ మృతం**
**బ్రహ్మ భూభు వస్సువరోమ్ ॥**

**తా॥** విశ్వమునందలి ప్రాణులతో సర్వాతంర్యామిగనుండి ఆ పరమ పురుషుడు హృదయమునందుండును. ఓ భగవంతుడా ! నీవే యజ్ఞ స్వరూపుడవు. వషట్కారమవు నీవే, ఇంద్రుడవు, విష్ణుడవు, రుద్రుడవు నీవే, నీవే ప్రజాపతివి, జలము, జ్యోతియు, రసము నీ రూపములే అమృత రూపుడును నీవే. భూర్భువ స్వ ర్లోక స్వరూపుడవు నీవే, నీ వే ఓం కార స్వరూపుడవు.

17. సద్యో జాతం ప్రపద్యామి సద్యో జాతాయ వై నమో నమః ।
భవే భవే నాతి భవే భవ స్వమామ్ । భవో ద్భవాయనమః ॥

తా॥ పరమేశ్వరుని పశ్చిమ ముఖమునకు సద్యోజాతమని పేరు. సద్యో జాత రూపుడగు పరమేశ్వరుని శరణ జొత్తును. ఓ సద్యోజాత నన్ను మాటిమాటికి జన్మించునట్లు చేయక తత్వ జ్ఞానమునకై ప్రోత్సహింపుము. సంసారమునుండి యుద్ధరించు సద్యో జాత నీకు నమస్కారము.

18. వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమశ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః ।
కాలాయ నమః కలవికరణాయ నమో బలవికర ణాయ నమో
బలాయ నమో బలప్రమథ నాయ నమ స్స ర్వ భూత
దమ నాయ నమో మనోన్మనాయ నమ :

తా॥ సుందరుడు, ప్రకాశించువాడును, జగదుత్పత్తికి పూర్వమున నుండు వాడును, సర్వశ్రేష్ఠుడును, ప్రళయకాలమున రోధనమునకు కారణ భూతుడును, కాలరూపుడును, సుఖములు స్వీకరించువాడును, వివిధ జగత్కారకుడును, రాక్షసుల బలమును ధ్వంస మొనర్చువాడును, సర్వప్రాణుల శిక్షించువాడును, సర్వజ్ఞుడును, సర్వ జ్ఞతముడునగు శివుని ఉత్తర ముఖమునకు నమస్కారము. శివుని ఉత్తర ముఖమునకు వామ దేవమను పేరు గలదు.

19. అఘో రే భ్యో ऽ ధ ఘోరే భ్యా ఘోర ఘోర త రేభ్యః ।
సర్వేభ్య స్స ర్వ శర్వే భ్యో నమస్తే అస్తు రుద్ర రూపేభ్య : ॥

తా॥ పరమేశ్వరుని దక్షిణ ముఖమునకు అఘోరమని పేరు. అతని ఆకారములు కొన్ని శాంతములు, మఱి కొన్ని రాజసములు, భయంకరములు. ఇక కొన్ని తామసములగుటచే ఘోర తరములు ఓ పరమేశ్వరా! నీ సాత్త్విక, రాజస తామసములగు రుద్ర రూపములకు సర్వదేశములందును, సర్వకాలములందునూ నమస్కారము.

20. తత్పురుషాయ విద్మహే మహా దేవాయ ధీమహి ।
తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥

తా॥ పూర్వ వక్త్రమునకు తత్పురుషుడని పేరు. గురుముఖమునను, శాస్త్రములవలనను ఆ శివుని పూర్వ ముఖ రూపుడగు తత్పురుష దేవుని తెలిసికొనుచున్నాము. ఆ తత్పురుష దేవుని ధ్యానించుట కతడు మాకు ధ్యాన, జ్ఞానములకు ప్రేరణ కల్పించుగాక.

21. ఈశాని స్సర్వ విద్యానా మీశ్వర స్స ర్వ భూతానాం
బ్రహ్మా ధి పతిర్బ హ్మణో ఽ ధిపతిర్బ్ర హ్మాశివోమే
అస్తు సదా శివోం ॥

తా॥ పరమేశ్వరుని ఊర్ధ్వ ముఖమునకు ఈశానమని పేరు. ఈశాన నామకుడగు దేవుడు సర్వ విద్యలకు అధిపతి అఖిల ప్రాణి సంరక్షకుడు, వేద సంరక్షకుడు. హిరణ్యా గర్భునకు అధిపతి అట్టి సర్వజ్ఞుడగు పరమాత్మ నన్నను గ్రహించుటకు శాంతుడగుగాక , ఆ సదాశివుడే నేనగుదును గాక.

22. ఓం పురుషస్య విద్మ సహస్రాక్ష స్య మహాదేవస్య ధీమహి ।
తన్నో రుద్ర : ప్రచోదయాత్ ॥

తా॥ సహస్ర నేత్రములు కలవాడు మహాదేవుడునగు రుద్రుడు అతనిని స్మరించుటకు మాకు ధృఢ బుద్ధిని కల్గించుగాక.

23. శంనో మిత్ర శ్శం వరుణ :
శంనో భవత్వర్య మా
శంన ఇంద్రో బృహస్పతి :
శంనో విష్ణు గురు క్రమ : (ఋ. 1-91-9)
" ప్రాణో వైమిత్రః అపానో వరుణ : "

పై యజుర్వాక్యమును బట్టి మిత్ర వరుణులు ప్రాణాపాన స్వరూపులు. ఆ ప్రాణాపానముల నాశ్రయించిన జీవునకు సుఖము నిచ్చువారు కావలయునని, సూర్యుడు, ఇంద్రుడు, బృహస్పతి, విష్ణువు సుభములనిత్తురు గాక, సర్వ వ్యాపకమైన పరమేశ్వర శక్తి మాకు మంగళము కూర్చుగాక.

భద్రం కర్ణేభి : శ్రుణు యామ దేవా :
భద్రం పశ్యే మా క్ష భిర్య జత్రః
స్థిరై రంగై స్తు ష్టు వాంసస్త నూభి :
వ్యశేమ దేవహితం యదాయు : (ఋ. 1-89-8)

తా॥ ఓ ప్రకృతిలోని దివ్య శక్తులారా ! మేము జీవించి యున్నంత వరకు మా చెవులచేత మంగళకర వాక్యములనే విందుముగాక. అట్లేజీవితాంతము కన్నులతో సుభములనే చూతుముగాక. మంచి పటుత్వముగల అంగములతోడి శరీరములచేత బ్రతికి యున్నంత కాలము లోక క్షేమం కర కార్యములనే చేయుదముగాక. ఇట్లనుటచేత మానవులెట్లు జీవితకాలమున మనో వాక్కాయములచేత లోక సేవ చేయవలెనో తెలియుచున్నది.

ఓం శాంతి ఓం శాంతి ఓం శాంతి

## శ్రీ మార్గబంధు స్తోత్రము :

శంభో మహాదేవ, శివ శంభో మహాదేవ
దేవేశ శంభో, శంబో మహాదేవ దేవ

ఫాలా వనమ్రత్ - కిరీటం, ఫాలనేత్రార్చిషా దగ్ధపం చే షుకీటమ్
శూలా హతారాతి కూటం శుద్ధ మర్ధేందు చూడం భజే మార్గబంధుమ్

అంగే విరాజద్భుజంగం అభ్రగంగాతరంగాభి రామోత్త మాంగమ్,
ఓం కారవాటీ - కురంగం సిద్ధ సంసేవితాం ఘ్రిం భజే మార్గబంధుమ్.

నిత్యం చిదానందరూపం, నిహ్నతాశేష లోకేశ వైరిప్రతాపమ్,
కార్తస్వరాగే ంద్ర చాపం, కృత్తివాసం భజే దివ్య సన్మార్గ బంధుమ్.

కందర్ప దర్పఘ్న మీశం కాలకఠం మహేశం మహా వ్యోమకేశం,
కుందాభదంతం సురేశం కోటిసూర్య ప్రకాశం భజే మార్గబంధుమ్.

మందార భూతేరుదారం మందరాగేంద్రసారం మహా గౌర్య దూరం
సింధూర దూరప్రచారం సింధు రాజాతి ధీరం భజే మార్గబంధుమ్.

అప్పయ్య యజ్వేంద్ర గీతం స్తోత్ర రాజం పఠేద్యస్తు భక్త్యా ప్రయాణే
తస్యార్థసిద్ధింవి తనుతే మార్గమధ్యే భయం చాశుతోషో మహేశః

## దారిద్ర్య దహనస్తుతి :

విశ్వేశ్వరాయ నరకార్ణవ తారణాయ
కర్ణామృతాయ శశిశేఖర ధారణాయ
కర్పూర కాంతి ధవళాయ జటాధరాయ
దారిద్ర్య దుఃఖ దహనాయా నమ శ్శివాయ.

గౌరీ ప్రియాయ రజనీశ కళాధరాయ
కాలాంతకాయ భుజగాధిప కంకణాయ
గంగాధరాయ గజరాజ విమర్దనాయ
దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ.

భక్త ప్రియాయ భవరోగ భయా పహాయ
ఉగ్రాయ దుఃఖ భవసాగర తారణాయ
జ్యోతిర్మ యాయ గుణనామ సువృత్యకాయ
దారిద్ర దుఃఖ దహనాయ నమశ్శివాయ.

చర్మాంబరాయ శవభస్మ విలేపనాయ
ఫాలేక్షణాయ మణికుండల మండితాయ
మంజీర పాద యుగళాయ జటాధరాయ
దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ.

పంచాననాయ ఫణిరాజ విభూషణాయ
హేమాంశు కాయ భువనత్రయ మండితాయ
ఆనంద భూమి వరదాయ తమో మయాయ
దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ.

భానుప్రియాయ భవసాగర తారణాయ
కాలాంతకాయ కమలాసన పూజితాయ
నేత్రత్రయాయ శుభ లక్షణ లక్షితాయ
దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ.

రామప్రియాయ రఘునాథ వరప్రదాయ
నామప్రియాయ నరకార్ణవ తారణాయ
పుణ్యేషు పుణ్యభరితాయ సురార్చితాయ
దారిద్ర దుఃఖ దహనాయ నమశ్శివాయ.

ముక్తీశ్వరాయ ఫలదాయ గణేశ్వరాయ
గీతప్రియాయ వృషభేశ్వర వాహనాయ
మాతంగ చర్మ వసనాయ మహేశ్వరాయ
దారిద్ర దుఃఖ దహనాయ నమశ్శివాయ.

## లింగాష్టకమ్ :

బ్రహ్మమురారి సురార్చిత లింగం - నిర్మలభాసిత శోభిత లింగం ।
జన్మజ దుఃఖ వినాశక లింగం - తత్ప్రణమామి సదాశివలింగమ్ ॥

దేవముని ప్రవరార్చిత లింగం - కామదహన కరుణాకర లింగం ।
రావణ దర్ప వినాశన లింగం - తత్ప్రణ మామి సదాశివ లింగమ్ ॥

సర్వ సుగంధ సులేపిత లింగం - బుద్ధి వివర్ధన కారణ లింగం ।
సిద్ధ సురాసుర వందిత లింగం - తత్ప్రణమామి సదాశివలింగమ్॥

కనక మహామణి భూషిత లింగం - ఫణిపతి వేష్టిత శోభిత లింగం ।
దక్ష సుయజ్ఞ వినాశన లింగం - తత్ప్రణ మామి సదాశివ లింగమ్ ॥

కుంకుమ చందన లేపిత లింగం - పంకజహార సుశోభిత లింగం ।
సంచిత పాప వినాశన లింగం - తత్ర్పణమామి సదాశివ లింగమ్ ॥

దేవగణార్చిత సేవిత లింగం - భావైర్భక్తిభి రేవచ లింగం ।
దినకర కోటి ప్రభాకర లింగం - తత్ర్పణమామి సదాశివలింగమ్ ॥

అష్టదళోపరివేష్టిత లింగం - సర్వసముద్భవ కారణ లింగం ।
అష్టదరిద్ర వినాశన లింగం - తత్ర్పణమామి సదాశివ లింగమ్.

సురగురు సురవర పూజిత లింగం - సురవన పుష్ప సదార్చిత లింగం ।
పరమపతిం పరమాత్మక లింగం - తత్ర్పణమామి సదాశివ లింగం॥

## శ్రీ శివ భజనలు

1. శ్రీ దక్షిణామూర్తి జగద్గురు జైజై
భూతనాథ సద్గురు జై జై
ఓం నమశ్శివాయ శివాయ నమ ఓం
ఓం నమశ్శివాయ శివాయ నమ ఓం ॥

2. తపోవనేశ పరమగురు జైజై
భూతనాథ సద్గురు జైజై
సోమశేఖర కాశీ విశ్వేశ్వర
సోమశేఖర కాశీ విశ్వేశ్వర ॥

3. శ్రీ దక్షిణామూర్తి జగద్గురు జై జై
భూతనాథ సద్గురు జైజై
గౌరీ ప్రియానంద స్వామి జైజై
పార్వతీ ప్రియానంద స్వామి జైజై ॥

4. జయగురుదేవం అభయానందం ప్రణమామ్యహం
గురుదేవం అహర్నిశం ప్రణమామ్యహం గురుదేవం
ధర్మోద్ధారకం సిద్ధాంత ప్రచారకం ఆనంద రూపం ఆత్మస్వరూపం
తామస హరకం ఉత్సాహ వర్ధకం తపోవన శిష్య తత్త్వ స్వరూపం ॥

5. ప్రేమ హృదయవం పరమ విరాగిణం
సన్యాసినం గురుం శిరసా నమామ్య హం
సచ్చిదానందస్వామి తిత్తిత్తారా తైతై
ముక్తిదాయక స్వామి తిత్తిత్తారా తైతై
జగద్గురు నాథ సదాశివానంద హోయ్ ॥

6. తిక్ తిక్ తారా తిక్ తిక్ తై
తికతై తకతై తకతై తోమ్
తైతైతైతైతై తిక్ తిక్ తారా తై తై
అమృతానంద స్వామి తిక్ తిక్ తారా తైతై
విరూపానంద స్వామి తిక్ తిక్ తారా తైతై
జ్ఞాన జ్యోతి స్వరూప స్వామి సదాశివానంద హోయ్ ॥ తిక్ తిక్

7. తపోవన శిష్యస్వామి తిక్ తిక్ తారా తైతై
వేదాంత వేద్య స్వామి తిక్ తిక్ తారా తైతై
వృషభవాహన స్వామి సదాశివానంద హోయ్ ॥ తిక్ తిక్

8. చిత్త సుద్ధి కర్తా స్వామి తిక్ తిక్ తారా తైతై
భవముక్తి ప్రదాత స్వామి తిక్ తిక్ తారా తైతై
సిద్ధజ్ఞాన ప్రదాత స్వామి సదాశివానంద హోయ్ ॥ తిక్ తిక్

9. శ్రీ గురుదేవ నమో నమో
హే ! పరమేశ్వర నమో నమో
ఓం కారాయ నమో నమో
సత్య శివ సుందర నమో నమో ॥

10. జగదీశ్వరాయ నమో నమో
నిత్య నిరంజనాయ నమో నమో
కర్మయోగి నరేశ నమో నమో
కర్మ బంధ వినాశ నమోనమో ॥

11. సదాశివానంద గురుదేవ నమోనమో
ప్రణవ స్వరూపా భవా ! నమో నమో
సనాతన మూర్తై శివా ! నమో నమో
సాదరం తవపాదం భజామ్యహం గురుదేవ ॥

12. సర్వజ్ఞాన ప్రదాత నమో నమో
భవరోగ వినాస నమో నమో
సర్వమంగళ దాత నమో నమో
సర్వ పరమానంద దాయక గురుదేవా నమో నమో

13. నాగలక్ష్మి కంఠావృతా చంద్రశేఖర నమో నమో
జ్ఞాన సుమప్రదాత ముక్తిదాత నమో
సుభ గాయత్రీశా నటేశా నమో
శ్రీకరా శ్రీరామావరా శ్రీ పర్వతే శా నమో నమో ॥

పాహిమాం సునందన సురేంద్రార్చిత నమో నమో
పాహిమాం మల్లేశ్వరార్చిత సనాతనా శివా నమో నమో ॥

14. అరుణేశా రమణ వరేశా నమో
విశ్వంభరా విశ్వేశ్వరా నమో
కరుణాకరా కాలభయం కరా నమో
కపర్దే కరుణాబ్ధె నమో

15. పాహిమాం మౌనదేవా నమో నమో
పాహిమాం గురుదేవా నమో నమో
పాహిమాం కరుణాబ్ధె నమో నమో
బ్రహ్మేంద్రార్చిత పాదారవిందే నమో నమో ॥

1. భోలానాథా ఉమాపతే ! శంభోశంకర పశుపతే !
నంది వాహన నాగభూషణ ! చంద్రశేఖర జటాధరా !
గంగాధరా గౌరీమనోహర ! గిరిజాకాంతా సదాశివా !
కైలాసవాసా కనకన భేశా ! గౌరీ మనోహర విశ్వేశా !
స్మశాన వాసా చిదంబరేశా ! నీలకంఠా మహాదేవ !
మూలాధారాజ్యోతి ప్రకాశ ! విభూతి సుందర పరమేశా !
నటన మనోహర డమరుక హస్తా పార్వతీరమణా సదాశివా ॥

2. శంకర సదాశివా చంద్రశేఖర చంద్రశేఖర గౌరీ శంకర
నీలకంఠ త్రిపురారి చంద్రశేఖర ఫాలనేత్రా సూలధారి భావజహారి ॥

3. ఆత్మ లింగం భజరే ! పరమాత్మ లింగం భజరే
అద్భుత లింగం భజరే ! పరమాద్భుత లింగం భజరే
నాగలింగం నవమణిలింగం ! నాభీకమలోద్భవ లింగం
ఈశ్వర లింగం భజరే ! పరమేశ్వర లింగం భజరే

4. మృత్యుంజయాయ నమ ఓం, త్రయం బకాయ నమ ఓం
లింగేశ్వరాయ నమ ఓం, జగదీశ్వరాయ నమ ఓం
సర్వేశ్వరాయ నమ ఓం, పరమేశ్వరాయ నమ ఓం
నాగేశ్వరాయ నమ ఓం, జగదీశ్వరాయ నమ ఓం ॥

5. జయ జయ గంగాజటాధర గౌరిశంకర గిరిజా రమణ
జయ మృత్యుంజయ మహాదేవ మహేశ్వర మంగళ సుభచరణ
నందివాహన నాగభూషణ నిరుపమ గుణసదన
నటన మనోహర నీలకంఠ, హరా ! నీరజ దళనయన
శివశంభో, హరశంభో, హరశంభో భవనాశ కైలాస నివాస
పార్వతీ పతే హర, పశుపతే గంగాధర, హరా ! గౌరీపతే ॥

6. శంభో శంకర సాదాశివా ! సర్వేశ్వరా మా పాహి ప్రభో
పాహి ప్రభో మాం పాహి విభో
లింగోద్భవ హర లింగేశ్వరా ! జగదీశ్వరా మాం పాహిప్రభో
పాహి ప్రభో మాం పాహివిభో ॥

7. ధిమ ధిమ ధిమి ధిమి నటన శివ తాండవ కేళీ విలాస శివ
లీలామానుష వేష శివ ! లింగోద్భవ హర సాంబశివ
గంగాధర చంద్ర చూడ శివ ! గజముఖ షణ్ముఖ నాథ శివ
పార్వతీ నాయకపరమశివ ! పాహి ప్రభో మాం ! గౌరీశివ
ఓం నమశ్శివాయ, ఓం నమశ్శివాయ, ఓం నమశ్శివాయ, శివాయ నమ ఓం ॥

8. శంభో శంకర తాండవ ప్రియ హర
జయ జయ శంకర జయహే, హర హర శంకర జయహే
డమ డమ డమ డమ డమరు బోలె
ఝణ ఝణ ఝణ ఝణ ఢం కా బాజే
ఝణత ఝణత ఝణత పాయల్ బాజే
కైలాస వాస ఉమాపతే, త్రిశూలధారి గిరిజా పతే
త్రినేత్రఫాల గౌరీపతే ।
హర హర హర హర ఓం, శివ శివ శివ శివ ఓం ॥

9. సత్య శివ సుందర జయ అభయంకర
జయ శివశంకర చంద్ర కళాధర
సాంబ సదాశివా శివహర ఓం, శివహర ఓం, శివ హర ఓం
గజ చర్మాంబర శివహర ఓం, శివ హరఓం, శివ హర ఓం ॥

10. శివ మహేశ్వర శివ మహేశ్వర శివ మహేశ్వర పాహిమాం
శివ మహేశ్వర శివ మహేశ్వర శివ మహేశ్వర రక్షమాం
కైలాస వాస మహాదేవ విభూతిసుందర మహాదేవ
నందీశ్వర హర మహాదేవ త్రిభువన పాలన మహాదేవ ॥

## "శ్రీశైల సుధాలహరి"

(శ్రీ పోలూరి రామకృష్ణయ్య)

"శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే"

శ్రీ శ్రీ శ్రీ గిరి మల్లికార్జున కృపా సిద్ధ్యర్థమై కారయి
త్రీ శ్రేష్ఠ భ్రమరాంబికా మృదుయనః ప్రీత్యర్థమై భక్తి నే
న శ్రాంతాశ్రయ పర్వత ప్రథిత సర్వాధిక్య సౌందర్య స
త్య శ్రేయస్కర వర్ణనన్ బలికెదన్ ధర్మాభిలాషుండనై ॥

రంగద్భంగ శుభాంగ దివ్యతర ధారావ్యాప్త పాతాళి గం
గాం గీకార వినమ్ర వర్తనుడనై యావన్మహా సిద్ధ సత్
సాంగత్యా భ్యుదయాభిలాషినయి శ్రీశైలేంద్ర సాంద్రో జ్జ్వలో
చ్ఛృంగోద్దామ విభూతి దర్శనము వర్ధింతున్ గళాసిద్ధికై ॥

సాక్షాన్మోక్ష వరప్రసాదియని విశ్వవ్యాప్త కీర్తి చ్ఛ టా
వీక్షాఖండ మనోజ్ఞమై వెలుగు భూ భృద్రాజమున్ శ్రీ గిరిన్
దీక్షాబద్ధ కరాంబు జాతమున భక్తిన్ మ్రొక్కి తత్ క్షేత్ర మా
తృ క్షీరాక్షం పానమాధురిని తృప్తిన్ గ్రోలి జీవించెదన్ ॥

ఆగణీత పుణ్య సంచయ మహా నిధులంబలె బ్రహ్మ విష్ణు రు
ద్రగిరులు శ్రీగిరిన్ నిఖిల దరాధర రామణీయక
ప్రగుణ పృథూన్నతాగ్ర మునిరాజులు వాదగి యొప్పుచున్న త
ద్భగవ దనన్య రూపులకు భక్తిని వందన మాచరించెదన్ ॥

మదిలోనున్న సమస్త భావముల సూక్ష్మజ్ఞాన సంపన్న కో
విద నైపుణ్యముచే గ్రహించెదవు నా వృత్తాంత మిమ్మాడ్కి గాం
చెదవంచున్ దయసేతువంచు సరస స్నేహోదయోలాసినై
హృదయోత్సాహము వెల్లడించితిని తండ్రీ ! శ్రీ శివ స్వామిజీ ॥

ఆస్వాదించెద యుష్మదీయ మృదుపాదాంభోజ మాధుర్య న
వ్య స్వచ్ఛాక్షయ సిద్ధసాంద్ర మకరందా నేక నిష్యంద బిం
దు స్వాదుత్వము కల్మి నిన్ను వినుతింతున్ శ్రీమరై కండనం
బి స్వామీ ! దయసేయు మయ్య, యిదే నావిశ్వాసమున్ దెల్పితిన్ ॥

పుణ్యుని లింగమూర్తి గురుమూర్తి వరేణ్యుని సత్యశీల స
ద్గణ్యుని సిద్ధ పూరుషుని తత్పరభక్తి మతింతు నింత కా
రుణ్యముతోడ సిద్ధుల నెరుంగ వచించిన సిద్ధమాన్య బ్ర
హ్మణ్యుని సద్గురున్ శివుపినాకుని నిత్యము నాత్మనెంచుచున్॥

నీదౌ దర్శనభాగ్య మిబ్బెననుచున్ నిస్సార సంసార భీ
ష్మో దగ్ర ప్రతిబంధకో దధి తరంగో త్తాల ఝంపా ప్రమా
దాది క్లేశములన్ దొలంగుటకు విన్నర్థించితిన్ శ్రీ చతు
ర్వేది స్వామి! గ్రహింపు నిర్మల మనః ప్రేమ ప్రహనాంజలుల్ ॥

సర్వశ్రీగిరి రామణీయక కళా సాహిత్య శిల్పోన్న తా
పూర్వ స్నిగ్ధ వశీ కృతాభినవ నైపుణ్యంబు పుణ్యాంగనా
శర్వాణీ ప్రియ శక్తి పీఠమహిత శ్వ శ్రేయస ప్రోజ్వలా
శీర్యా దైక విశేష మట్టి శిఖరి శ్రీరాశికే మ్రొక్కెదన్ ॥

## ఈశ్వర ధ్యాన శ్లోకములు

శ్లో॥ 1. శుద్ధ స్ఫటిక సంకాశం ప్రసన్నం శీతల ద్యుతిం
విద్యుద్వలయ సంకాశం జటాముకుట భూషితం ॥

2. శార్దూల చర్మవసనం మందస్మిత ముఖాంబుజం
రక్త పద్మదళ ప్రఖ్య పాణిపాద తలాధరం ॥

3. సర్వ లక్షణ సంపన్నం సర్వాభరణ భూషితం
దివ్యాయుధ కరై ర్యుక్తం దివ్య గంధాను లేపనం ॥

4. పంచ వక్త్రం దశ భుజం చంద్ర ఖండ శిఖామణిం
అస్య పూర్వముఖం సౌమ్యం బాలార్క సదృశ ప్రభం ॥

5. త్రిలోచ నారవిందాఢ్యం బాలేందు కృత శేఖరం
దక్షిణం నీలజీముతం సమాన రుచిర ప్రభం ॥

6. భృకుటీ కుటిలం ఘోరం రక్త వృత్త త్రిలోచనం
దంష్ట్రా కరాళం దుష్ప్రేక్ష్యం స్ఫురితాధర పల్లవం ॥

7. ఉత్తరం విద్రుమం ప్రఖ్యం నీలాలకవి భూషితం
సద్విలాస త్రినయనం చంద్రార్ధ కృత శేఖరం ॥

8. పశ్చిమం పూర్ణచంద్రాభం లోచన త్రితయోజ్వలం
చంద్రరేఖాధరం సౌమ్యం మందశ్మిత మనోహరం ॥

9. పంచమం స్ఫటిక ప్రఖ్యం మిందురేఖా సముజ్వలం
అతీవ సౌమ్యముత్ఫుల్లలోచన త్రిత యో జ్వలం ॥

10. దక్షిణే శూలపరశు వజ్ర ఖడ్గాన లో జ్వలం
పూర్వేపినాక నారాచ ఘంటా పాశాంకుశో జ్వలం ॥

11. ని వృత్యా జానుపర్యంత మానాభిచ ప్రతిష్ఠయ
ఆ కంఠం విద్యయాత ద్వాదాలలాటంతు శాంతయా ॥

12. త దూర్ధ్వశాంత్యతీ కలదూపర యాత ధా
పంచా ధ్వ వ్యాపినం తస్మాత్ కళాపంచక విగ్రహం ॥

13. ఈశాన ముకుటం దేవ పురుషాఖ్యాం పురాతనం
అఘోర హృదయం తద్వ ద్వాను గుహ్యం మహేశ్వరం ॥

14. సద్యోజాతం చతతుమ్మూర్తిం అష్టత్రిశ త్కళామయం
మాతృకామయ, మీశానం పంచ బ్రహ్మమయం తథా ॥

15. ఓం కారాఖ్యమయం చైవ హంస న్యాసమయం తథా
పంచాక్షర మయం దేవం షడక్షర మయం తథా
అంగషట్కమయం చైవ జాతిషట్క సమన్వితం ॥

ఇట్లు పరమేశ్వరుని ధ్యానించి, అతని వామభాగమున మనోన్మయినగు

గౌరిని భక్తితో ధ్యానించి యా వాహనము చేసి నమస్కరించి పూజించి సమాహిత చిత్తుడై ధ్యానింపవలెను.

శ్లో ॥ 1. ప్రఫుల్లోత్పల పత్రాంభాం విస్తీర్ణాయత లోచనాం
పూర్ణ చంద్రాభ వదనాం నీలకుంచిత మూర్ధజాం ॥

2. నీలోత్పలదళ ప్రఖ్యాం చంద్రార్ధ కృత శేఖరాం
అతివృత్త మనోత్తుంగ స్నిగ్ధపీనపయోధరాం ॥

3. తనుమధ్యాం పృధు శ్రోణీం పీతసూక్ష్మత రాం బిరాం
సర్వాభరణ సంపన్నా లలాట తిలకోజ్వలాం ॥

4. హేమారవిందం విలసద్ధ ధానం దక్షిణేకరే
దండ వచ్చామరం హస్తే న్య స్యా సీ నాం సుఖాననే ॥

శ్లో ॥ బ్రహ్మైవాహ మిదంజగచ్చ సకలం చిన్మాత్ర విస్తారితం
సర్వం చైతద విద్యయా త్రిగుణయా ఽ శేషం మయా కల్పితం
ఇత్థంయస్య దృఢామతి స్సుఖతరే నిత్యేపరే నిర్మలే
చందాలో ఽ స్తు సతుద్విజో ఽ స్తు గురురిత్యేషా మనీషామమ ॥

తా॥ నేను పరమాత్మ స్వరూపుడను. ఇదియంతయూ సర్వాధిష్ఠానమైన సచ్చిదానంద రూపమైన పరమాత్మయే గాని వేరుకాదు. కార్యకారణ రూపమైన సమస్త దృశ్యము సత్వరజ స్తమో గుణాత్మకమైన ఆవరణ విక్షేప శక్తియుక్తమైన మూలజ్ఞానం చేత నాయందు కల్పింపబడినది. అనగా అద్వైత సిద్ధాంతమందు ఆత్మాధిష్ఠాన భ్రమనే అంగీకరింతురు. కనుక ఇదియంతయూ ఆత్మాధిష్ఠానక భ్రమయేనని చెప్పవలెను. అటులయిన యెడల ఆరోపిత మగు ఈ దృశ్య మంతయూ నాస్వరూపమేనని, నాకంటే వేరులేదని, సచ్చిదానంద రూపమైన సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమైన దేశకాల వస్తు పరిచ్చెద రహితమైన పరిపూర్ణ రహితమైన పరమాత్మ స్వరూపమే నేనని పరబ్రహ్మ స్వరూప సాక్షాత్కారము ఏ మహానుభావునికి కల్గునో అట్టి మహానుభావుడు చండాలుడైననూ, బ్రాహ్మణుడైననూ సద్గురువుగా భావించవచ్చును. జ్ఞానము కలిగిన తరువాత ఆ జ్ఞానము వలన ఏనర్పడిన జీవ భావము సమూలముగా పోవును గనుక జ్ఞానియైన జీవుడు పరమాత్మ స్వరూపుడు గనుక పరమాత్మ సర్వస్వ రూపుడైనపుడు జ్ఞానికూడా సర్వస్వరూపుడగును గనుక ఆ జ్ఞాన దశయందు యెట్టి వాడైననూ పరమాత్మ

స్వరూపుడేయని యర్థముగాని వ్యవహార దశయందు కూడా భేదము లేదని అర్థముగాదు. జీవ భావమున్నంతవరకు, దేహాభిమాన మున్నంత వరకు, అన్ని భేదములు సత్యములేనని, పాటించవలసినదేగాని విడిచిపెట్టదగినవికావు. ఈ విషయములో శాస్త్రముచే ప్రమాణముగా ఆస్తిక బుద్ధితో గ్రహించవలెను.

"శ్రీదక్షిణామూర్తి దర్శనమ్ సమాప్తం"

మంగళం మహత్

# శివుని బహురూప మూర్తులు


Sri Tripurari Murthi
శ్రీ త్రిపురారి మూర్తి


Sri Chakradana Murthi
శ్రీ చక్రదానమూర్తి


దక్షిణామూర్తి



Sri Aghora Murty
శ్రీ అఘోర మూర్తి



Sri Neela Kantha Murthy
శ్రీ నీలకంఠ మూర్తి



Sri Sarabha Murthi
శ్రీ శరభమూర్తి



Sri Ekapada Murthi
శ్రీ ఏకపాద మూర్తి



Sri Dasa Bhuja Aghora Murthi
శ్రీ దశభుజ అఘోర మూర్తి



Sri Gajasura Samhara Murthi
శ్రీ గజాసుర సంహార మూర్తి



Sri Brahma Sirachetru Murthi
శ్రీ బ్రహ్మ శిరచ్ఛేతృ మూర్తి



సోమాస్కందమూర్తి



Sri Asithanga Bhairava Murthi
శ్రీ అసితాంగ భైరవ మూర్తి




Sri Sukasana Murthi
శ్రీ సుఖాసనమూర్తి



Sri Natya Murti
శ్రీ నాట్యమూర్తి



Sri Veerabhadra Murthi
శ్రీ వీరభద్ర మూర్తి



Sri Rudra Murthy
శ్రీ రుద్రమూర్తి



Sri Bhikshatena Murthi
శ్రీ భిక్షాటనమూర్తి



Sri Gowri Devi
శ్రీ గౌరీదేవి



Sri Kankala Murti
శ్రీ కంకాళమూర్తి



కంకాళమూర్తి



Sri Vishapahara Murthi
శ్రీ విషాపహరమూర్తి



Sri Esana Murthy
శ్రీ ఈశాన మూర్తి



Sri Tatpurusha Murthy
శ్రీ తత్పురుషమూర్తి



Sri Sadyojata Murty
శ్రీ సద్యోజాతమూర్తి



Sri Vighnesvara Prasanna Murthi
శ్రీ విఘ్నేశ్వర ప్రసన్నమూర్తి



Sri Lingodbhava Murthi
శ్రీ లింగోద్భవమూర్తి



Sri Chandesanugraha Murthi
శ్రీ చండేశానుగ్రహ మూర్తి



Maheswara Murthy
శ్రీ మహేశ్వర మూర్తి



Sri Maha Kailasa Murthy
శ్రీ మహా కైలాస మూర్తి



Sri Kiratharjuna Murthi
శ్రీ కిరాతార్జునమూర్తి



Sri Veerabhadra Murthi
శ్రీ వీరభద్రమూర్తి



Sri Kamadahana Murti
శ్రీ కామదహన మూర్తి



Sri Harihara Murthi
శ్రీ హరిహరమూర్తి



Sri Jalandharahara Murthi
శ్రీ జలంధరహర మూర్తి



అర్ధనారీశ్వరమూర్తి



Sri Dakshina Murthi

శ్రీ దక్షిణామూర్తి




Sri Vama Deva Moorthi

శ్రీ వామదేవమూర్తి

# బ్రహ్మంజీగారి దారు శిల్పములు

(కాశ్యప శిల్ప ఆధారము)

సద్యోజాతమూర్తి



తత్పురుషమూర్తి



# కోణార్క సూర్యమూర్తి





